Islam ek swayam sidh
Eshwariya Jeevan Vyavastha
(Telugu)

# ఇస్లాంపై

# విమర్శలు - జవాబులు


రచన :
శ్రీ రాజేందర్ నారాయణ్ లాల్
ఎం.ఎ. (హిస్టరీ) బనారస్ హిందూ యూనివర్సిటీ

అనువాదం :
అబుల్ ఫౌజాన్
ఎం.ఎ (ఇస్లామిక్ స్టడీస్), ఎం.ఎ (ఉర్దూ)

# విషయ సూచిక

*అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో...*

# గ్రంథ రచయిత

పేరు : **శ్రీ రాజేందర్ నారాయణ్ లాల్**

**జన్మించిన తేదీ :** 8 మార్చి, 1916; **జన్మస్థానం :** భరత్‌పూర్ (రాజస్తాన్)

**విద్యాభ్యాసాలు :** విద్యాభ్యాసాలు వారణాసి (యు.పి)లో జరిగాయి. క్వీన్స్ కాలేజీలో ఇంటర్మీడియేట్ చేసిన తరువాత క్రీ.శ. 1940 హిందూ యూనివర్సిటీ, బనారస్ ద్వారా ప్రాచీన భారత చరిత్ర, సంస్కృతంతో ఎం.ఎ పట్టా పుచ్చుకున్నారు.

**బహుమానం :** హిందూ యూనివర్సిటీ, బనారస్ ద్వారా 'గీత' పరీక్షలో బహుమానాన్ని పొందారు.

**ప్రత్యేకతలు :** ప్రారంభం నుండే ధర్మం పట్ల ఆసక్తి కలిగి వుండేవారు. శాంతి సామరస్యాల ఆచూకీ కోసం హిందూ ధర్మమే కాకుండా వివిధ మతాలను కూడా అధ్యయనం చేశారు. ఖుర్ఆన్, ఇస్లామిక్ లిటరేచర్ కాకుండా ఇతర గ్రంథాలు కూడా ఇస్లాం పరిచయానికి ఆధారాలయ్యాయి.

## గ్రంథం గురించి

'ఇస్లాంపై విమర్శలు – జవాబులు' అనే ఈ గ్రంథం ప్రారంభంలో ధర్మం ఆవశ్యకతను గురించి చర్చించటం జరిగింది. ఆ తరువాత హిందూ ధర్మం, బౌద్ధ ధర్మం, క్రైస్తవంతోపాటే ఇస్లామీయ ధర్మం గురించి తులనాత్మక (Com-

parative) అధ్యయన ఫలితాలను సమర్పించడం జరిగింది. ఇస్లాం గురించి పరిచయం చేయిస్తూ, అజ్ఞానం కారణంగా ప్రజల్లో వ్యాపించిపోయిన అపార్థాలపై ప్రత్యేకంగా చర్చించటం జరిగింది. కావున ఇస్లాంను సరిగా అర్థం చేసుకోవటానికి, ఈ పుస్తక అధ్యయనం ఎంతో సహకరిస్తుంది. ఫలితంగా దేశంలో శాంతి సామరస్యాలు, సోదర భావాలు ఏర్పడే అవకాశముంటుంది. యదార్థాన్ని, శాంతిని వెదుకుతున్న వారి కోసం ఈ పుస్తకం ఎంతో ఉపయోగపడుతుంది. ఇహపరాల్లో సాఫల్యాన్ని పొందే మార్గాన్ని వెదుకుతున్న వారి కోసం ఈ గ్రంథం ఎంతో ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాము.



# ముందు మాట

"ఇస్లాంపై విమర్శలు – జవాబులు" అనే ఈ పుస్తకాన్ని ప్రచురించి మీకు అందిస్తున్నందుకు మేమెంతో సంతోషిస్తున్నాము. రచయిత ఈ పుస్తకంలో ధర్మం ప్రాముఖ్యతను, దాని అవసరాన్ని గుర్తుచేస్తూ హిందూ ధర్మం, బౌద్ధ ధర్మం, క్రైస్తవం, ఇస్లాం పట్ల పరిపూర్ణమైన, వాస్తవమైన తులనాత్మక అధ్యయనం చేసి ప్రదర్శించారని, దీంతోపాటుగా ముస్లింలు, ఇస్లాం పట్ల సామాన్య ప్రజల్లో వ్యాపించిపోయిన అపోహల్ని, అపార్థాల్ని కూడా ఎంతో తార్కికంగా, సముచితంగా దూరం చేశారన్నది పాఠకులు గమనించాలి. ఈ పుస్తకాన్ని మొట్టమొదటిసారి క్రీ.శ. 1978లో ఇస్లామీయ సాహిత్య సదన్, రాంనగర్, బనారస్ (ఉత్తరప్రదేశ్) వారు హిందీ భాషలో ప్రచురించారు. ఆ తరువాత ఇది 'సాహిత్య సౌరభ్ న్యూఢిల్లీ' ద్వారా ప్రచురించబడింది.

'ఇస్లాం ఏక్ స్వయం సిద్ధ్ ఈశ్వరీయ జీవన్ వ్యవస్థ' అనే పేరుతో సాహిత్య సదన్ వారు ప్రచురించిన హిందీ పుస్తక అనువాదమే ఇది. ఈ పుస్తకంలో అక్కడక్కడ విశ్లేషణ కోసం చేర్చబడిన పాదసూచికలు దివంగత మౌలానా అబూ ముహమ్మద్ ఇమాముద్దీన్, రాంనగరి గారు వ్రాసినవి.

దేశ ప్రజల్లో పరస్పరం ఒకరి ధర్మం పట్ల మరొకరికి అవగాహన ఉండాలని, నిష్పక్షపాతంగా ఒకరి భావనలు వేరొకరు తెలుసుకునే సుహృద్భావ వాతావరణం ఏర్పడాలన్నదే ఈ పుస్తక ప్రచురణకు ముఖ్యోద్దేశ్యం. ఈ పుస్తక అధ్యయనం ద్వారా ఒకరి పట్ల మరొకరికి ఏర్పడిన అపోహలు, అపార్థాలు తొలగిపోయి వివిధ వర్గాల ప్రజలు పరస్పరం దగ్గరవుతారని, సుహృద్భావ వాతావరణం ఏర్పడుతుందని, ఇంకా ప్రజలకు సత్యాన్ని, యదార్థాన్ని తెలుసుకునే సౌలభ్యం ఏర్పడుతుందనేది మా విశ్వాసం.

ఈ పుస్తక ప్రచురణ సమయంలో అన్నిరకాల జాగ్రత్తలు తీసుకోవడం జరిగింది. అయినా ఎక్కడైనా తప్పులు, పొరపాట్లు దొరిలిపోతే లేదా అసమంజసమయినవిగా అనిపిస్తే పాఠకులు దయచేసి మాకు రాయాలని మనవి చేసుకుంటున్నాము. ఆవిధంగా సంస్కరించుకునే అవకాశం లభిస్తుంది.

**– ప్రకాశకులు**

# 1. విన్నపం

మౌలానా అబూ ముహమ్మద్ ఇమాముద్దీన్
రాంనగరి, బనారస్

శ్రీ రాజేందర్ నారాయణ్ లాల్ గారి ఈ పుస్తకాన్ని ప్రజలకు అందిస్తూ మేమెంతో హర్షిస్తున్నాము. వివేచనాపరులైన పాఠకులకు మేము విన్నవించే విషయం ఏమిటంటే శ్రీ రాజేందర్ గారు హిందూ ధర్మం, బౌద్ధ ధర్మం, క్రైస్తవం, ఇస్లాంపై వెల్లడించిన అభిప్రాయాలను సమర్థిస్తూ మేమిచ్చిన పాదసూచకల్ని కేవలం వాదోపవాదాలని భావించకూడదు. శ్రీరాజేందర్ గారు వెల్లడించిన అభిప్రాయాలే వాస్తవం అని అనుకుంటే వాటిపై మనం తప్పకుండా శ్రద్ధ చూపాల్సి వస్తుంది. ఇస్లాం గురించి మంచి అభిప్రాయాల్ని వ్యక్తం చేసిన వారు శ్రీ రాజేందర్ గారు మొదటి వ్యక్తి ఏమీకాదు. ఇదివరకు భారతదేశం, ఇతర దేశాలకు చెందిన అసంఖ్యాక విద్వాంసులు, జ్ఞానులు ఇలాంటి భావనల్నే వ్యక్తీకరించి ఉన్నారు. అంతేకాదు వారిలో చాలామంది ఇస్లాం ధర్మాన్ని స్వీకరించారు కూడా. ఇక ఇస్లాంను కీర్తించేవారైతే లెక్కకు మిక్కుటంగానే ఉన్నారు.

దివ్యఖుర్‌ఆన్‌ను కొందరు దైవగ్రంథంగా విశ్వసించినా, విశ్వసించక పోయినా, అదో చిట్టచివరి ధార్మిక గ్రంథమనే విషయాన్ని మాత్రం ఎవరూ నిరాకరించలేని నిజం. ఖుర్‌ఆన్ అవతరించి 1400 సంవత్సరాలు కూడా దాటిపోయాయి. ఈ సుదీర్ఘ కాలంలో ఎందరో జ్ఞానులు, విద్వాంసులు, గొప్ప తత్వవేత్తలు, వైజ్ఞానికులు, రాజకీయనాయకులు, కవులు, రచయితలు వచ్చారు, వెళ్ళారు. అయితే వీరందరిలో ఇంతవరకు ఎవ్వరు కూడా, తాను దైవప్రవక్తనని, తనపై దైవాదేశాలు అవతరిస్తున్నాయని చాటిచెప్పలేదు. ఏ రచయిత గాని, గ్రంథకర్త గాని, తన రచనను దైవగ్రంథం లాంటిదని వాదించనూలేదు.

మహనీయ ముహమ్మద్(స) దైవప్రవక్త అని, ఖుర్ఆన్ దైవగ్రంథమని నిర్ధారించటానికి ఇదో గొప్ప తార్కాణం.

ఒకే ఒక దైవం తప్ప వేరెవరూ ఆరాధ్యుడు కాదని, ఆయన దైవత్వంలో వేరెవ్వరూ భాగస్వాములు కారనే విశ్వాసం నిజమైన దైవధర్మానికి పునాది లాంటిది. ఆ దైవం మాత్రమే ఈ విశ్వానికి సృష్టికర్త, యజమాని, పోషకుడు, నియంత్రణాధికారి కాబట్టి కేవలం ఆయనొక్కడే ఆరాధ్యుడు. ఆయన తప్ప వేరెవ్వరూ ఆరాధ్యుడు కాజాలడు. ఏ వ్యక్తి అయినా సరే విచక్షణా జ్ఞానంతో నిష్పక్షపాతంగా, నిర్మల హృదయంతో ఖుర్ఆన్‌ను అధ్యయనం చేస్తే అది మొదటి నుంచి చివరి వరకు మానవ జీవితానికి సంబంధించిన వైయక్తిక, కౌటుంబిక, సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక ఆదేశాలన్నింటికీ, సమస్త వ్యవహారాలకు మూలం ఈ ఏకేశ్వరవాదమే. దీన్నే ఇస్లామ్‌గా పిలుస్తారు. అంటే మొత్తం జీవితంలో దేవునికి విధేయులై ఉండే ధర్మం అన్నమాట.

కేవలం తానొక్కటే దైవగ్రంథమని, తానేదో కొత్త ధర్మాన్ని తీసుకొని అవతరించానని ఖుర్ఆన్ ఎక్కడా చెప్పుకోలేదు. సృష్టి ప్రారంభం నుండే మానవుల మార్గదర్శకం కోసం, మానవుల్లో నుండే దైవం కొందరిని ఎన్నుకొని తన ప్రవక్తలుగా నియమించాడని, వారి ద్వారానే మానవులకు తన బోధనల్ని తన ఆదేశాలను చేరవేశాడని, ఈ సజ్జనుల్నే ప్రవక్తలుగా, దైవ సందేశ వహులుగా పిలుస్తారని ఖుర్ఆన్ చెబుతోంది. ఖుర్ఆన్‌ను అనుసరించి ప్రపంచంలోని ప్రతి జాతిలో, ప్రతి ప్రాంతంలో ఈ దైవసందేశవహులు వచ్చారని, వారందరి మౌలిక బోధనమాత్రం ఇదేనని, ఇప్పుడు దీన్నే ఇస్లాం అని పిలవటం జరిగిందని స్పష్టం చేస్తుంది. బేధం ఏదైనా ఉందంటే, అది దేశ కాల పరిస్థితులనుబట్టి వాడుకలో ఉన్న పేరు మాత్రమే. వాటన్నింటిలోని జీవం మాత్రం ఇదేనని అది నొక్కి వక్కాణిస్తుంది.

వచ్చే ప్రతి దైవప్రవక్త, తనకంటే ముందు ప్రభవించిన ప్రవక్తలు, వారి

ద్వారా తేబడిన దైవగ్రంథాలను ధృవీకరిస్తూ ఉండడం ఆనవాయితీగా ఉంటూ వచ్చింది. ఈ ఆనవాయితీనిననుసరించే, మహనీయ ముహమ్మద్(స) తనకంటే ముందు వచ్చిన ప్రవక్తల్ని ధృవీకరించారు. దివ్యఖుర్ఆన్ కూడా తనకంటే ముందు వచ్చిన దైవగ్రంథాల్ని ధృవీకరించింది.

శ్రీ రాజేందర్ నారాయణ గారు, ఇస్లాం దైవధర్మం చివరి ఎడిషన్ అంటూ ఇస్లాంను చాలా చక్కగా వివరించారు. ఈ విషయాన్నే దైవం దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉపదేశించాడు :

> **'ప్రవక్తా! మేము నీ వద్దకు పంపిన ఈ గ్రంథం సత్యాన్ని తీసుకొని వచ్చింది. తన కాలంలో ఉన్నటువంటి 'అల్ కితాబ్'లోని భాగాలను అది ధృవీకరిస్తుంది, పరిరక్షిస్తుంది.'** ***(అల్ మాయిదా : 48)***

మేము ఏ పదానికైతే 'పరిరక్షణ, సంరక్షణ' అని అర్థం చెబుతున్నామో, ఆ పదం ఎంతో అర్థవంతమైనది. అరబ్బీ భాషలో వాడిన మూల పదము 'ముహైమిన్'. ఇది సంరక్షణ భద్రత, సాక్ష్యం, అమానతు, సమర్థన, సహాయం అనే రకరకాల అర్థాల్లో కూడా వాడబడుతుంది. దీన్ని అనుసరించి దివ్యఖుర్ఆన్ లోని పై ఆయత్‌కు భావం ఏమిటంటే, అంతకు క్రితం అవతరించిన దైవగ్రంథాల్లోని సిసలైన ఏ దైవబోధనలనైతే ఖుర్ఆన్ తనలో భద్రపరచుకొని ఉన్నదో ఆ బోధనలన్నింటినీ అది సంరక్షిస్తున్నది, వాటిని ధృవీకరిస్తున్నది. ఈ గ్రంథాల్లో నిక్షిప్తమై ఉన్న దైవబోధనలన్నిటినీ ఇది సత్యమని ధృవీకరిస్తోంది. అంతేకాక ఆ బోధనలు సత్యమని సాక్ష్యమిస్తోంది కూడా. ఈ గ్రంథాల్లో ఆ దైవబోధనలతోపాటు అనేక విషయాలేవైతే జొప్పించబడ్డాయో వాటిని ఖుర్ఆన్ అనే గీటురాయిపై పరీక్షించి ఏరిపారేసి అవి దైవబోధనలు కావు అని నిరూపించవచ్చును.

ఖుర్ఆన్ అవతరణ కాలం నాటి అవిశ్వాసులు, నేటి ఆధునిక కాలపు వ్యతిరేకులు కూడా ఈ వాస్తవాన్ని గుర్తించలేక 'ఖుర్ఆన్ కేవలం గడిచిన

గ్రంథాల బోధనల నఖలు అని, వాటి భాగాలే తప్ప ఇంకేమి కాదని' కొట్టిపారేస్తారు. వారి వాదన ప్రకారం ఖుర్ఆన్ ప్రత్యేకంగా అవతరించిన ఓ దైవగ్రంథం కాక ఇది మానవ విరచితం మాత్రమే అన్నది.

గడిచిన కాలపు ధార్మిక గ్రంథాల వివిధ భాగాలను ఎన్నుకొని, మహనీయ ముహమ్మద్(స) ద్వారా రూపొందించబడిందని, దీన్నే దైవవాణిగా ప్రదర్శించారని ఆరోపిస్తారు వీరు.

భ్రమ, అపార్థం, అజ్ఞానాల కారణంగా ఏర్పడిన ఇలాంటి భావనలను ఒకసారి సమీక్షించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఏ జాతి అయినా సరే అది మార్గభ్రష్టత్వం చెందినప్పుడు, దాన్ని సంస్కరించి సన్మార్గం పైకి తేవడం కోసం దైవం తరఫున ఓ ప్రవక్త ఉద్భవించేవాడు. అప్పుడు ఆ జాతి రెండు వర్గాలుగా చీలిపోయేది. ఒక వర్గం సామాన్య ప్రజల వర్గం. వీరు నిష్పక్షపాతంగా, నిర్మల హృదయంతో దైవాదేశాలను విని, ఆ ప్రవక్తను విశ్వసించి, ఆయనకు అనుచరులుగా మారేవారు. ఇక రెండవ వర్గంలో ప్రాచీన మూఢాచారాలు గలవారు, స్వార్థపరులైన నాయకులు, అధికార మధాంధులు, స్వప్రయోజనాన్నే కాంక్షించే ధార్మిక గురువులుండే వారు. ఆ వ్యక్తినే గనక మనం దైవప్రవక్తగా అంగీకరిస్తే, అతని మతానికి విధేయులం కావాల్సి వస్తుంది; మన పెద్దరికం, మన గౌరవం, మన అధికారాలన్నీ మట్టిలో కలిసిపోతాయి అనే ఉద్దేశ్యంతో వారు ఈ ప్రవక్తలను వ్యతిరేకించేవారు. ఈ వ్యతిరేకత ఎంత తీవ్రంగా ఉండేదంటే కొన్ని సందర్భాలలో దైవప్రవక్తల్ని సైతం హతమార్చే కుట్రలు పన్నడం జరిగింది. ఈ స్థితికి చేరిన తరువాతే వారిపై దైవశిక్ష విరుచుకుపడేది. దానికి వీరంతా నాశనమైపోయేవారు. దైవప్రవక్తను విశ్వసించి, విధేయులుగా మెలిగినవారు మాత్రమే రక్షించబడేవారు. అయితే కొన్ని తరాలు గడిచిన తరువాత క్రమక్రమంగా వీరిలోనూ అవే పాత రుగ్మతలు వ్రేళ్లూనుకునేవి. దైవ అవిధేయతకు పాల్పడి వీరు రకరకాల దుర్మార్గాలు చేసేవారు. తమ పనులు చెడులుగా భావింపబడకూడదని, తాము దుర్మార్గంపై

నడిచినప్పటికీ ప్రజలు తమను దుర్మార్గులుగా భావించకుండా ఉండేందుకై, తమ హెూదా, అంతస్తు, గౌరవంలో ఎలాంటి లోపం రాకూడదనే దృష్టితో దైవగ్రంథాల్లో కూడా మార్పులు చేర్పులు చేసి ధర్మాన్ని సైతం తమ ఇష్టాను సారంగా మలచుకునేవారు.

యూదులు, క్రైస్తవులు తమ ధర్మం, ధార్మిక గ్రంథాల పట్ల ఇలాగే వ్యవహరించారు. దైవప్రవక్తలైన మహనీయ మూసా(అలై), దావూద్(అలై), ఏసుక్రీస్తు (అలై) నిజమైన బోధనలేమిటి? అనే విషయాన్ని ఖుర్ఆన్ మరీ మరీ విడమర్చి తెలిపింది. యూదులు, క్రైస్తవులు ఈ నిజధర్మాల్ని, బోధనల్ని ఎంతగా వక్రీకరించారో ఖుర్ఆన్ స్పష్టం చేస్తుంది. మన భారత దేశంలో సైతం ధర్మం పట్ల జరిగిన ప్రక్షిప్తాలను మనం ఊహించవచ్చు. అలా కాదనుకున్నప్పుడు 'ఎప్పుడెప్పుడైతే ధర్మం క్షీణతకు చేరుకుంటుందో, అప్పుడప్పుడు నేను అవతరిస్తాను' అనే గీత శ్లోకానికి అర్థం ఏమిటి? నా అభిప్రాయం ప్రకారం– శ్రీకృష్ణుడు తాను భగవంతుణ్ణని చెప్పి ఉండడు. బహుశా భగవంతుని తరఫున ఉద్భవించి ఉంటానని చెప్పి ఉండవచ్చు. ఏది ఏమైనప్పటికీ, ఆయన గారి ఈ ప్రవచనం ద్వారా ఈ దేశంలో కూడా అప్పుడప్పుడు ధర్మం వికృత రూపం దాల్చేదనేది మాత్రం నిరూపించబడిన సత్యం. గీతలోని శ్రీకృష్ణుని, బృందా వనంలో గోపికలతో విహరించే కృష్ణుణ్నీ మనమే రూపంలో చూస్తున్నాము? గౌతమ బుద్ధుడు, వేద శాస్త్రాల్ని సైతం విశ్వసించేవాడు కాదు. అయినా ఆయనలో దైవత్వాన్ని ఆపాదించి ఆయన్ను అవతారాల్లో చేర్చుకోవడం జరిగింది. స్వామి దయానంద సరస్వతీ గారు కూడా ఇలాంటి విషయాల్నే ఖండిస్తూ, నిరసిస్తూ దేహాన్ని చాలించారు.

ఒకవేళ మనలో స్వచ్ఛమైన ధర్మం, సిసలైన ధర్మం ఏదో తెలుసుకోవా లనే కోరిక నిజంగానే ఉండి వుంటే, మనం సత్యాన్వేషకులమే అయివుంటే, మనం తప్పకుండా వేదాల్ని, ఉపనిషత్తుల్ని నిష్పక్షపాత దృష్టితో అధ్యయనం

చేయాల్సి ఉంటుంది. ఆ తరువాత ఖుర్‌ఆన్‌ను అధ్యయనం చేస్తే ఈ గ్రంథాల్లోని దైవ బోధనలు ఏవి, మానవ ప్రక్షిప్తాలేవి? అనే విషయం మనకు స్పష్టంగా కళ్లకు కట్టినట్టు కనబడుతుంది.

–అబూ ముహమ్మద్ ఇమాముద్దీన్

రాంనగర్ (వారణాసి)

# ౨. పరిచయ వాక్యాలు

ఒక మహిమ మొదలుకుని, ఓ సామాన్య సంఘటన వరకు ప్రతిదీ దైవేచ్ఛ పైనే ఆధారపడి ఉంటుంది. పుస్తక రూపంలో పాఠకుల చేతిలో ఉన్న ఈ చిన్న ప్రయత్నానికి కూడా పై సూత్రమే వర్తిస్తుంది. ఈ పుస్తకం ప్రశ్నోత్తరాల రూపంలో వ్రాయటం జరిగింది. వాస్తవాల్ని సంక్షిప్తంగా పాఠకుల ముందు అద్దంలా ప్రదర్శించటమే దీని ముఖ్యోద్దేశం. సామాన్య ప్రజలు విషయాన్ని సులువుగా గ్రహించి నిరూపించబడిన సత్యాలను తమంతట తాముగా అర్థం చేసుకోవాలనే తలంపుతో, ఎలాంటి మానసిక ఒత్తిడికి, లేక చికాకుకు గురి కాకూడదనే ఉద్దేశ్యంతోనూ నేను బుద్ధిపూర్వకంగానే వివిధ గ్రంథాల్లోని విషయాల్ని ఇందులో చేర్చటం జరగలేదు. వృద్ధాప్యం సమీపించి ఉద్యోగం నుండి రిటైర్ అయిన తరువాత, నాకు ఆధ్యాత్మిక, మానసిక శాంతి ఎంతో అవసరం అనిపించింది. దానికోసం నేను నా స్వధర్మంతోపాటు ఇతర ధర్మాల్ని కూడా అధ్యయనం చేయాల్సి వచ్చింది. తులనాత్మక సమీక్ష, చింతన, ఆలోచనల ఆధారంగా నేను ఇస్లామ్ ధర్మాన్ని అత్యంత గౌరవప్రదమైనదిగా, అన్ని సమస్యలకు మౌలికమైనది, ఏకైక పరిష్కారమూ అయినదిగా కనుగొనడం జరిగింది. మానవుని వ్యక్తిగత, సామూహిక, పౌర, సాంఘిక, రాజకీయ, నైతిక, ఆర్థిక, ధార్మిక సమస్యలు అలాగే జాతీయ, అంతర్జాతీయ సమస్యలు, ఇహానికి

సంబంధించినవి లేదా పరలోకానికి సంబంధించిన సమస్యలన్నింటికీ పరిష్కారం చూపే 'మాస్టర్ కీ' (Master Key) ఇస్లామ్ ఒక్కటే.

ఇస్లాంకు సంబంధించిన వివరాలు, దాని శక్తి, దాని సహజత్వం, దాని సార్వజనీనత దాని ప్రామాణికతల గురించి పునరాలోచించే అవసరమే ఏర్పడదు. దాని ఏకేశ్వరవాదం అదీను స్వచ్ఛమైన ఏకేశ్వరవాదం ఏమిటో సుస్పష్టమైనది. దీనితోపాటే దైవప్రవక్త ముహమ్మద్(స) వారి వ్యక్తిత్వం సాటిలేనిదీ, పరిపూర్ణమైనదీను. ఎవరైనా ఒక వ్యక్తి నిర్మల మనసుతో, నిష్పక్షపాతంగా ఇస్లాంను అధ్యయనం చేస్తే, అతను నిస్సందేహంగా అదొక నిరూపితమైన సత్యం అని తెలుసుకోగలడు. ఇస్లాం రాకకు పూర్వం అజ్ఞాన కాలంలో అరబ్బులు బాహాటంగా పాప పంకిలంలో కూరుకుపోయి ఉండేవారు. ఇస్లామీయ బోధనల ద్వారా ప్రవక్త మహనీయులు(స) వారిని కొద్దికాలంలోనే అత్యంత ధార్మికులుగాను, మానవత్వానికే ఆదర్శప్రాయులుగాను తీర్చిదిద్దారు. భోగలాలసత్వం, ఉగ్రవాదం, దురాశ, దుర్మార్గం కలిగినవారు, త్రాగుబోతులు, కలహప్రియులు, దౌర్జన్యకారులు, చోరులు, నీచబుద్ధి లాంటి నమ్మశక్యం గాని దుర్గణాలు కలిగిన ఆ జాతిని, ఒకే ఒక తరంలోనే ఆసాంతం మార్చివేయడం ఓ గొప్ప మహిమే. అలాంటి ఉదాహరణ అసలు చరిత్రలోనే కనిపించదు.[1]

---

*1. భారతదేశంలో జన్మించిన శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణుడు, గౌతమ బుద్ధుడు ఇంకా వేరే మహోన్నత వ్యక్తిత్వాలన్నీనూ విద్యాధికులు, రాచ కుటుంబాలకు చెందినవారు. దేశంలో ఎందరో విజ్ఞానులు, తత్వవేత్తలు పుట్టారు. శ్రీరామచంద్రుని తండ్రి గారైన దశరథ మహారాజు రాజ్యమైతే ఓ ఆదర్శవంతమైన రాజ్యంగా పేరుగాంచింది. శ్రీకృష్ణుని మేనమామ దౌర్జన్యపరుడు, కౌరవులు పాండవుల పోరాటం ఒక కుటుంబ జగడమే. ఇవికాక దేశంలో ఇంకెలాంటి రుగ్మతలున్నట్లు పేర్కొనబడలేదు. గౌతమ బుద్ధుడు కూడా దేశంలో వ్యాపించి ఉన్న అధర్మానికి వ్యతిరేకంగా నిలబడలేదు. దానికి బదులు ఆయన మానవుని నిస్సహాయత, మృత్యువుకు ప్రభావితుడయ్యే వైరాగ్యాన్ని పొందాడు.*

*ప్రవక్త మహనీయుల దేశం అరేబియా అనేక తెగల్లో విభజించబడి ఉండేది. అక్కడ ఒక ప్రభుత్వ వ్యవస్థ అంటూ లేకుండేది. దేశమంతటా అనైతికత, దౌర్జన్యం వ్యాపించి*

అరబ్బు జాతి తరతరాల నుండి వ్యక్తిగతంగానే కాదు, సామూహికంగా కూడా ఏ రుగ్మతల్లోనైతే కూరుకుపోయి ఉండేదో, అలాంటి జాతి ఇస్లాం లాంటి అమోఘమైన ఔషధంతో స్వల్ప వ్యవధిలోనే పూర్తి ఆరోగ్యాన్ని పుంజుకుందనేది చారిత్రక సత్యం. ఈ చారిత్రక సత్యం ఆధారంగా ఇలాంటి వ్యాధులతో సతమతమవుతున్న ఏ జాతి అయినాసరే, ఏ కాలంలోనైనా సరే, ఇలాంటి దివ్యౌషధంతో పూర్తి స్వస్థతను పొందగలుగుతుందని ఘంటాపథంగా

---

*ఉండేవి. సారాయి, వ్యభిచారం, హింసా దౌర్జన్యాలు, దొంగతనం, దోపిడీలు ఒకటేమిటి మనుషులు ఛీత్కరించుకునే చెడుగులన్నీ అక్కడ వ్యాపించి వుండేవి. యూదులు, క్రైస్తవులు కూడా ధర్మవిహీనులుగా, దుర్మార్గులుగా మారిపోయి ఉన్నారు. దేశమంతటా అజ్ఞానం, బహుదైవారాధనలలో చిక్కుకుని ఉండేది. ఈ బహుదైవారాధకుల జాతికి ధార్మిక నాయకత్వం వహించే వంశం మహనీయ ముహమ్మద్(స) గారి వంశం అయిన ఖురైష్ వంశం పూర్తిగా నిరక్షరాసి. బహు కొద్దిమందికి మాత్రమే ఉత్తర ప్రత్యుత్తరాలు చేసుకో గలిగేటంత చదువు మాత్రమే వచ్చు. వారంతా నిరక్షరాస్యులే అయినప్పుడు ఇక పాఠశాల ఊసు ఎక్కడిది? వారికి విద్య నేర్పించే వారెవరు? మహనీయ ముహమ్మద్(స) కూడా నిరక్షరాసిగానే ఉండిపోయారు.*

*మక్కా నగరవాసుల వద్ద, చూద్దామన్నా నాలుగైదు పుటల ధార్మిక గ్రంథమంటూ ఒకటిలేదు. అదేకాక వారి దేవీదేవతల పౌరాణిక గాథలకు సంబంధించిన ఏ గ్రంథమూ లేదు. వాడుకలో ఉన్నవన్నీ కేవలం ఊహాజనితమైన గాథలే. అరబ్బు జాతి అంతా కూరుకు పోయిన ఆ రుగ్మతల్లో ఖురేషీయులు సైతం కూరుకుపోయినవారే.*

*ప్రపంచంలో ఎక్కడా కూడా సత్యధర్మమంటూ లేని కాలమది. ఈ వాతావర ణంలో, ఇలాంటి దేశాలను, జాతులనే కాకుండా ప్రపంచమంతటికినీ ఏకేశ్వర వాదాన్ని, సత్యధర్మాన్ని తెలుపటానికి, వారి నైతికతలను, ఆచరణల్ని సంస్కరించటానికి ప్రవక్త మహనీయ ముహమ్మద్(స)ను ఉద్భవింపజేశాడు దైవం. ఆయన హితబోధనలు, ఆదేశాల ద్వారా ఏకేశ్వరున్ని ఆరాధించే వర్గం ఒకటి ఉనికిలోనికి వచ్చింది. ఆ తరువాత 23 సంవ త్సరాల నిరంతర కృషి వల్ల ఓ బృహత్తరమైన, బహు ముఖమైన విప్లవం లేచి సత్యధర్మం స్థాపితమయింది. తద్వారా ఒక పవిత్రమైన సభ్యతా సంస్కృతి కలిగిన ఓ పటిష్టమైన ప్రభుత్వం ఉనికిలోకి వచ్చింది. ఇలాంటి విప్లవం ప్రపంచ మానవ చరిత్రలోనే కానరాదు. (మౌలానా అబూ ముహమ్మద్ ఇమాముద్దీన్, రాంనగరి)*

చెప్పవచ్చు. నేటి కాలంలో సామాన్యంగా ప్రపంచమంతటా అవినీతి, అధర్మమనే ఈ వ్యాధి వ్యాపించిపోయింది. ప్రత్యేకించి మన భారతదేశంలోనైతే ఇది అంటువ్యాధిలా ప్రబలిపోతోంది. దీనికోసం భగవత్ప్రసాదితమైన ఈ ఔషధాన్ని ఉపయోగించడం ఆవశ్యకం, అనివార్యం కూడాను. మన భారత ఉపఖండంలో ఓ మంత్రివర్యుని మొదలుకొని ఓ వాచ్‌మెన్ వరకు, అంగడి మొదలుకొని న్యాయస్థానాల వరకు- అందరూ అవినీతి అనే ఈ ఊబిలో కూరుకుపోతున్నవారే. ఏ కొందరినో మినహాయిస్తే తప్ప దాదాపు దేశమంతా కూడా నేరప్రవృత్తికి ప్రభావితమయ్యే ప్రమాదం ఏర్పడింది. ఇస్లామ్ ఏ ధర్మానికి విరోధి కాదు. మహనీయ ముహమ్మద్(స) కంటే పూర్వం ఉద్భవించిన ప్రవక్త లందరినీ అది గౌరవిస్తుంది. మహనీయ ముహమ్మద్(స) దేవుని చిట్టచివరి ప్రవక్త. ఆయనకు పూర్వం వచ్చిన ప్రవక్తల ద్వారా ఇవ్వబడిన దైవాదేశాలను అవినీతిపరులు, స్వార్థపరులు ఆయా పరిస్థితులకు ప్రభావితులై మార్పులకు, చేర్పులకు ఒడిగట్టారు. దాని ఫలితంగా ప్రజలు పెడమార్గం పట్టడం జరిగింది. ఇకిప్పుడు మార్పు చేర్పులకు వీలులేని దైవాదేశాలు దివ్యఖుర్ఆన్ రూపంలో ప్రసాదింపబడ్డాయనేది ఇస్లాం విశ్వాసం. శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణుడు, మూసాప్రవక్త, గౌతమ బుద్ధుడు, ఏసుక్రీస్తు మహనీయుల తరువాత మానవుల సాఫల్యం, మార్గదర్శకత్వ అవసరాన్ని తీర్చటానికి, దైవేచ్ఛ ప్రకారమే మహనీయ ముహమ్మద్(స) వారి ఉద్భవనం జరిగిందనేది వాస్తవం. 'దేవుడు ఒక్కడే, ప్రవక్త ముహమ్మద్(స) దేవుని దాసుడు, సందేశహరుడు' అనేది ఇస్లాం మౌలిక సద్వచనం. చారిత్రక దృష్ట్యా, వేదాలు అత్యంత ప్రాచీన గ్రంథాలు హిందూ సోదరుల విశ్వాసాన్ని బట్టి అవి దైవప్రసాదిత గ్రంథాలు, వైదిక విశ్వాసాన్ని బట్టి దేవుని ఏకత్వం నిరూపితమై వుంది. అందులో స్పష్టంగా 'ఏకమేవ ద్వితీయోనాస్తి' అని ప్రకటించబడింది. అంటే, దేవుడు ఒక్కడే, రెండవ వాడెవ్వడూ లేడు అని దీని అర్థం. దైవాన్ని విశ్వసించే ఇతర ధర్మాలు కూడా

దేవుని ఏకత్వాన్ని అంగీకరిస్తాయి. ఆ తరువాత వారి ఏకేశ్వరవాదం స్వచ్ఛంగా, నిర్మలంగా మిగుల లేకపోయిందనేది వేరే విషయం. అందుకని ఇస్లాం విశ్వాస వచనంలోని మొదటి భాగమైన ఏకేశ్వరవాదం సర్వసమ్మతమైనది. ఇక మిగిలినది ఆ విశ్వాస వచనంలోని రెండవ భాగం. అంటే ముహమ్మద్(స) దేవుని చివరి ప్రవక్త అనేది. ఇది కూడా నిరూపిత సత్యమే. దీనికోసం సాక్ష్యం అవసరమా? 'ప్రత్యక్షం కిమ్ ప్రమాణమ్?' (ప్రత్యక్షంగా కళ్ళకు కనబడేదానికి సాక్ష్యం అవసరం ఏమిటి?) బిందువు (Point) ను కొలవలేం అన్నది గణితం, సైన్స్ సూత్రం. దీని నిరూపణ కోసం, ఇది స్వయంగానే నిరూపితమైనదని (Axiom) చెప్పటం జరుగుతుంది. మహనీయ ముహమ్మద్(స) చివరి ప్రవక్త అనడానికి కూడా ఇదే వాస్తవం, ఇదే సూత్రం వర్తిస్తుంది. [2]

---

*2. వేదర్షుల భవిష్యవాణులు, మహనీయ గౌతమ బుద్ధుని సందేశం వెలుగులో, మహనీయ ముహమ్మద్(స) చివరి ప్రవక్త అనేది ఇప్పుడు నిరూపించబడింది కూడాను. ఈ విషయానికి సంబంధించిన వివరాలు తెలుసుకొనగోరేవారు డాక్టర్ వేదప్రకాశ్ ఉపాధ్యాయ్, ఎం.ఎ (సంస్కృత వేదం) డి.ఫిల్ (రిలీజియన్) డిప్ ఇన్ జర్మన్ గారు రచించిన గ్రంథం ' వేద్ కే అంతిమ్ ఋషి నరాషన్స్' ఆ గ్రంథానికి నేను రాసిన సంగ్రహణం 'ఖుర్ఆన్‌కే అంతిమ్ ఈశ్‌దూత్ ముహమ్మద్ సాహెబ్'లను అధ్యయనం చేయవలసిందే. ఈ పుస్తక పీఠికలో డాక్టర్ వేదప్రకాశ్ ఉపాధ్యాయ్ ఇలా వ్రాశారు :*

*'చారిత్రక విషయాలపై పరిశోధన చేయడం ఎప్పుడూ నాకు అత్యంత ఇష్టమైన పనే. వేదాల్లో, బైబిల్‌లో, బౌద్ధ గ్రంథాల్లో చివరి ఋషి రూపంలో ఎవరయితే రాబోతున్నారని భవిష్యవాణులు చెప్పబడ్డాయో, ఆ వ్యక్తి ముహమ్మద్(స) గానే నిరూపితమవుతోంది. ఇతరులకెంత రుచించక పోయినా సరే. ఈ వాస్తవాన్ని బహిర్గతం చేయటం అనివార్యమని నా అంతరాత్మ నన్ను ప్రేరేపించింది.'*

*'ధర్మాల్లో పరిమిత ఆలోచనల్ని నేను సమర్థించను. ఏ విషయమైనా, ఎక్కడైనా, ఒకవేళ అది సముచితంగా, సక్రమంగా చెప్పబడిందంటే, దాన్ని వ్యతిరేకించటానికి నేను సాహసించను. పన్నెండుగురు భార్యలు కలిగి, ఒంటెనధిరోహించే వ్యక్తి గురించి వేదాల్లో భవిష్యవాణి ఉంది. అతని పేరు 'నరాషన్స్', నరాషన్స్‌కు అర్థం చెబుతూ (ఒక సుప్రసిద్ధ హిందూ ధర్మాచార్యుడు) 'సాయణుడు' "మానవుల ద్వారా ఎవరయితే ప్రశంసించబడ్డాడో" అని వివరించాడు. ఈ విషయంలో నా అభిప్రాయం, సాయణాచార్యునికి భిన్నంగా ఉ*

ంది. నేననేదేమిటంటే 'నరాషన్స్' అనే పదం 'పొగడబడిన' ఒక 'నర్' (నరుడు) వ్యక్తిని గురించి సందేశమిస్తున్నది. ఇక 'ముహమ్మద్' అనే పదం 'నరాషన్స్' అనే పదానికి సిసలైన అరబ్బీ అనువాదం.'

"ముహమ్మద్" అనే పదానికి డాక్టర్ వేద్‌ప్రకాశ్ గారు తెలిపిన అర్థమే సరైనది. అయినా గాని, సాయణాచార్యుడు తెలిపిన అర్థాన్ని, భావాన్నే తీసుకున్నా, అది కూడా పూర్తిగా ముహమ్మద్ ప్రవక్త(స)కే వర్తిస్తుంది. కారణం ఏమిటంటే విశ్వమంతటిలోను, మహనీయ ముహమ్మద్(స)ను ఎంతగా ప్రశంసించటం జరిగిందో లేక జరుగుతున్నదో ఇతర ఏ వ్యక్తి కూడా అంతగా ప్రశంసించబడి ఉండలేదు, ప్రశంసించబడటం లేదు.

మహనీయ గౌతమ బుద్ధుని సందేశం గురించి వేద్‌ప్రకాశ్ గారు ఇలా వ్రాశారు: "బౌద్ధమతంలో ఋషిని 'బుద్ధుడు' అని పిలవడం జరుగుతుంది. గౌతమ బుద్ధుడు తన అంత్య సమయంలో తన ప్రియ శిష్యుడైన నందునితో ఇలా అన్నారు :

'నందా! ఈ విశ్వంలో నేను ప్రథమ బుద్ధుణ్ణి కాను, అంతిమ బుద్ధున్నీ కాను. ఈ విశ్వానికి సత్యం, సత్ప్రవర్తన, ఉపకారానికి సంబంధించిన బోధనలు ఇవ్వటానికి, తగిన సమయంలో ఇంకొక బుద్ధుడు వస్తాడు. అతను పవిత్రమైన ఆత్మను కలిగినవాడై ఉంటాడు. నిర్మల హృదయుడై ఉంటాడు. విద్యాజ్ఞానాలతో పరిపూర్ణుడై ఉంటాడు. ప్రజలందరికీ నాయకుడై ఉంటాడు. ప్రపంచానికి నేనేవిధంగానైతే అనశ్వరమైన సత్యబోధనలనిచ్చానో, అదేవిధంగా అతను కూడా ప్రపంచానికి సత్యబోధనలిస్తాడు. ప్రపంచానికి అతను సిసలైన పరిపూర్ణమైన జీవిత రాచబాటను చూపిస్తాడు. నందా! అతని పేరే 'మైత్రేయః'.

మహనీయ ముహమ్మద్(స)కు సంబంధించి అనేకానేక ప్రత్యేకతల్ని, సుగుణాల్ని తెలుపుతూ వివిధ ధార్మిక గ్రంథాల్లో వచ్చిన భవిష్యవాణులన్నింటిని వేదప్రకాశ్ గారు క్రోడీకరించారు. అవన్నీ ప్రవక్త మహనీయులకే వర్తిస్తున్నాయి. గౌతమ బుద్ధుడు చెప్పిన భవిష్యవాణుల్ని చూస్తే, అవన్నీ ప్రవక్త ముహమ్మద్(స)కు ఎంతగా సరిపోతున్నాయంటే, గౌతమ బుద్ధుడు స్వయంగా ముహమ్మద్(స)ను చూశారా అనిపిస్తుంది. బౌద్ధ ధార్మిక భాషలో 'మైత్రేయ' అంటే అర్థం దయ. ముహమ్మద్(స) ఒక ప్రత్యేక గుణం 'కరుణ' కలిగి ఉండేవారు. అంటే దీని అర్థం కూడా 'దయ' అనే అవుతుంది. ఈ సత్యాన్ని ఒక బౌద్ధ విద్వాంసుని వ్యాసం ద్వారా వేదప్రకాశ్ గారు నిరూపించారు. చివరి దైవగ్రంథమైన ఖుర్ఆన్‌లో ఒక ఆయత్ ఇలా వుంది : 'మేము నిన్ను సకల లోకాలకు కారుణ్యమూర్తిగా చేసి పంపాము. డాక్టర్ వేదప్రకాశ్ గారు ఈ వాక్యాన్ని తమ గ్రంథంలో పేర్కొనడం జరిగింది. (అబూ ముహమ్మద్ ఇమాముద్దీన్ రాంనగరి)

ప్రవక్త ముహమ్మద్(స) తరువాత ఒక కొత్త ధర్మాన్ని పరిచయం చేసి, ఇంతటి మహా గొప్ప సంఖ్యలో అనుచరుల్ని పొంది, వారి అసామాన్యమైన ప్రేమాభిమానాలు, భక్తి విశ్వాసాలు పొందిన వేరొక వ్యక్తి ఇంతవరకు పుట్టలేదు. ఇక పుట్టబోడు కూడా అనే విషయాన్ని ఒక సామాన్య ముస్లిమేతరుడు కూడా, సామాన్య నిజాయితీతో అంగీకరించగలుగుతాడు. ఇస్లాంకు ధీటుగా ఇంతటి పెద్ద సంఖ్యలో ప్రజల ప్రేమాభిమానాల్ని, విశ్వాసాల్ని చూరగొనే విశ్వవ్యాపిత ధర్మం ఇంకొకటి ఉనికిలోనికి వస్తుందని ఎవరైనా ధైర్యం చేసి ఊహించినా, ఇది అవివేకంగానే భావించబడుతుంది. క్షేత్ర గణితంలో ఏదైనా ఒక సిద్ధాం తాన్ని నిరూపించిన తరువాత చివరలో Q.E.D అంటే దేన్నైతే నిరూపించాల్సి ఉండిందో, అది నిరూపించబడింది అని వ్రాయబడుతుంది. అదేవిధంగా ఇస్లామీయ ధర్మం సద్వచనం అంటే 'దేవుడు ఒక్కడే, ముహమ్మద్ (స) దైవప్రవక్త' అనేది కూడా నిరూపితమైన సత్యం. ఇస్లాం గురించి ఇంతటి గట్టి సమర్థనకు ముస్లిమేతర సోదరులు అసంతృప్తికి లోనుకారాదు. పగలును పగలని, రాత్రిని రాత్రి అనటమే సమంజసం. నేను ప్రత్యేకించి నా శ్రేయోభి లాషులు, స్వధర్మీయులైన హిందూ సోదరులకు విన్నవించేదేమిటంటే, నేను ప్రదర్శించిన ఈ ఫలితాన్ని వారు తమ ప్రశంసనీయమైన పరమత సహనం, స్వతంత్ర భావనల్ని ఆహ్వానించే సత్సంప్రదాయాల వెలుగులోనే చూడాలి. ఇస్లాంను, దైవప్రవక్త ముహమ్మద్ (స)ను నిష్పక్షపాతంగా, మతస్పర్థలకు అతీతంగా ఉంటూ చూడటానికి ప్రయత్నించాలి. అంతేకాక ముస్లిముల పట్ల ఏర్పడిన నిరాధారమైన అనుమానాల్ని, అపార్థాల్ని కూడా దూరం చేసుకోవాలి. వారలా చేయగలిగితే, తమ ప్రాచీన, స్వాభావిక స్వతంత్ర ఆలోచనా విధానానికి గౌరవ ప్రతిష్ఠల్ని చేకూర్చినవారవుతారు. తమ ధర్మాన్ని అనుసరిస్తూ పాము, రావిచెట్టు లాంటి వాటికి దైవత్వం ఆపాదించి ఉదారతను చాటిచెప్పే వైఖరే

సరిపోదు. అలాగే మాంసం, సారాయి, కామోద్రేకాలు, ధనపుజారులు వగైరా లకు ధార్మిక వెసులుబాటు ఒసిగినంత మాత్రాన వారి స్వతంత్ర భావాలు, ఆలో చనలు ప్రశంసనీయమైనవి కావు. ఈ విశ్వానికే సంబంధించిన మహోన్నత దైవప్రవక్త, సాటిలేని సంస్కర్త, మహోన్నత మానవ శ్రేయోభిలాషికే మనం మన హృదయ మస్తిష్కాల్లో తగిన స్థానం ఇవ్వలేకపోతే అదో విషాదకర విషయంగానే భావించబడుతుంది. అనేక హిందూ ధార్మిక గాధల్లో మనం దేవతల ద్వారా, అవతారాల ద్వారా పాపుల్ని నిర్మూలించిన సంఘటనల్ని సగర్వంగా చెప్పుకుంటూ ఉంటాం. కాని ఈ మానవ మహోపకారి, చారిత్రా త్మక మహా పురుషుడైన ముహమ్మద్(స), పాపుల్ని నాశనం చేయటానికి బదులు వారి పాపాల్ని నాశనం చేసి అపురూపమైన తమ వ్యవహారశైలి ద్వారా, సామూహికంగా వారి హృదయ మస్తిష్కాలనే మార్చి, అతి స్వల్ప వ్యవధిలోనే ఈ పాపుల్ని, ఈ దౌర్జన్యకారుల్ని దైవభీతి పరాయణు లుగా, సచ్ఛీలురుగా తీర్చిదిద్దారు కదా!

వెయ్యి సంవత్సరాల నుండి హిందువులు ముస్లింలతో కలిసి సహ జీవనం సాగిస్తున్నారు. కాని,ఇస్లాం ప్రతిపాదించిన సామాజిక, నైతిక విలువల ద్వారా వారు తమ ధర్మానికి కావలసిన ప్రయోజనాన్ని పొందలేకపోవడమే విచిత్రం. భారతదేశంలో ఇస్లాం రాకకు పూర్వం వచ్చిన ధర్మాలు, సభ్యతా సంస్కృతులకు ప్రభావితులైన హిందువులు పూర్తిగా సర్దుబాటు, ఐక్యతా భావాలనే కలిగి వుండేవారు. అలా జరగకపోవడానికి గల కారణం, విజేతలు పరాజితుల మధ్య ఏర్పడే అసూయ, అసహనం, విద్వేషం, నిర్లక్ష్యమే అని అనుకుంటున్నాం. దీనికితోడు ముస్లింలు కూడా దీనికి బాధ్యతను వహించా ల్సిందే. సంబంధం, సహజీవనానికి సంబంధించిన ఈ సుదీర్ఘ కాలంలో, ముస్లింలు అత్యధికంగా తమ రాజకీయాలనే పరిచయం చేశారే తప్ప ముస్లిమేతరులకు నిజమైన ఇస్లామీయ ధర్మం ఏమిటో పరిచయం చేయలేదు.

భారతదేశానికి ముస్లింలు మాత్రమే వచ్చారు తప్ప ఇస్లాం రాలేదనేది ఒక చేదు నిజం.[3] ముస్లింలు తమ రాజకీయాలకు ప్రథమ ప్రాముఖ్యాన్ని ఇచ్చారు. ఇస్లామీయ నైతిక బోధనలకు, సభ్యతా సంస్కృతులకు ద్వితీయ స్థానమిచ్చారు. ముస్లింలు తాము స్వయంగానే పరిపూర్ణంగా ఇస్లామీయ నమూనాతో సరితూగలేకపోయారు. కనుకనే భారతదేశంలో ఇస్లాం ప్రచార, పరిచయాలు సక్రమంగాను, పరిపూర్ణంగాను జరగలేదు. అవినీతి అతిశయించిన ఈ తరుణంలో ఇస్లామీయ నైతికతల మూసలో పోతపోయబడేలా ముస్లింలు తమనుతాము పరిపూర్ణంగా తీర్చిదిద్దుకొని, తమ ఉన్నతమైన జీవన విధానం ద్వారా ముస్లిమేతర సోదరులకు నిజమైన, ఆకర్షణీయమైన ఇస్లాం రూపాన్ని చూపించాల్సిన అవసరం ఎంతో ఉంది. మానవత్వ సాఫల్యం కోసం ఇది అనివార్యమనే విషయం మరిచిపోరాదు. భారతావని ఈ సమయంలో అత్యంత అవినీతి అక్రమాల్లో మునిగిపోయింది. రాజకీయ నాయకుల ద్వారా నైతికతల పునరుద్ధరణ సంభవమయ్యే అవకాశం లేదు. జ్ఞానం, దూరదృష్టి గల హిందువులు, సత్ప్రవర్తన గల ముస్లింలు కలిసి ఐక్యంగా మన దేశంలో

---

*3. భారతదేశంలో ఇస్లాం ముస్లిం పాలకుల ద్వారా రాలేదనే విషయాన్ని బహుశా గ్రంథకర్త గుర్తు చేస్తున్నట్లుంది. వాస్తవానికి భారతదేశంలో ఇస్లాం, ముస్లిం పాలకుల ద్వారా కాకుండా ముస్లిం సూఫీలు, ఫకీర్ల ద్వారానే ప్రవేశించింది. ఈ మహానుభావులు నిజమైన ఇస్లాం రూపాన్ని ప్రదర్శించారు కూడా. వారు కుల మతాలను, జాతి వర్గాలను, నిమ్నోన్నతలను పాటించేవారు కాదు. వారు దళితుల్ని, వెనుకబడిన, అణచబడిన వర్గాల ప్రజల్ని లేపి తమ హృదయాలకు హత్తుకున్నారు. వారికి తోటి మానవుల స్థాయినిచ్చి, తమతో సమానంగా గౌరవించారు. వారు ఏ బస్తీలో బస ఏర్పరచుకున్నా, అక్కడి దొంగలు, దోపిడీదారులు, దౌర్జన్యపరులు, దుర్మార్గులు తమ పంథాను మార్చుకొని, దైవభీతి కలవారుగా, సజ్జనులుగా మారిపోయేవారు. అంతేకాదు, ఈ సత్పురుషుల మానవత్వానికి ప్రభావితులై, వారు ఇస్లాంను స్వీకరించేవారు. భారతదేశంలోని బహు కొద్ది మందిని మినహాయిస్తే ఇప్పుడున్న ముస్లింలందరూ, ఆ సూఫీలు, ఫకీర్ల చేతి మీదుగా ఇస్లాంను స్వీకరించిన ముస్లింల సంతానమే. (అబూ ఇమాముద్దీన్)*

వ్యాపించిపోయిన అవినీతిని, అనైతికతను, దుర్మార్గాన్ని పారద్రోలడానికి కలిసికట్టుగా ఒక ఉద్యమాన్ని చేపట్టి ముందుకు సాగాల్సి వుంది.

ఈ పుస్తకం గురించి తెలుపడం కూడా కొంత అవసరం అని భావిస్తున్నాను. ముస్లింలు, ముస్లిమేతర విద్వాంసులెందరో ఇస్లాంను ప్రశంసిస్తూ ఎంతో రాయడం జరిగింది. కరుడుగట్టిన పక్షపాత మనస్తత్వం కలిగిన కొందరు కాల్పనిక విజ్ఞానులు ఇస్లాంను, ఇస్లామీయ ప్రవక్తను విమర్శిస్తూ రాయడం జరిగింది. ఈ పుస్తకాన్ని చూసి, నాబోటి ఒక సామాన్య మనిషి ఇస్లాం గురించి ఏమి వ్రాయగలడనే ఆలోచన వచ్చే అవకాశం ఎంతైనా ఉంది. దీనికి సంబంధించి నేనొక విషయాన్ని విన్నవించుకోదలిచాను. ఒక సామాన్య వ్యక్తిలా నేను కూడా ఇస్లాం గురించి అధ్యయనం చేశాను. ప్రపంచంలోని సామాన్య వ్యక్తులు అభిమానించే ధర్మం ఇస్లాం. ఈ సామాన్య వ్యక్తుల మార్గదర్శనం కోసం, సామాన్య వ్యక్తుల్లో నుండే, దైవం మహనీయ ముహమ్మద్(స)ను తన ప్రవక్తగా ఎన్నుకున్నాడు. దైవాభీష్టం మేరకే సామాన్య జనులందరూ ఎలాంటి అవరోధం లేకుండా తన వరకు రాగలుగాలనీ, జీవితాంతం ఒక సామాన్య మనిషిగానే జీవితం గడిపారు ఈ మహోన్నత ప్రవక్త[4]. అందుకని నాలాంటి

---

4. అరబ్బు దేశమంతటిపై ప్రవక్త ముహమ్మద్(స) ప్రభుత్వం స్థాపితమయింది. ఆయన కోరి ఉన్నట్లయితే, తన కోసం ఓ రాజప్రసాదాన్ని నిర్మించుకొని ఉంటుండేవారు. రాజఠీవితో జీవితాన్ని గడిపేవారు. అసాధారణమైన ఇంత శక్తి ఉన్నప్పటికినీ అతి సామాన్యమైన ఆయన గారి జీవితంలో రవ్వంత మార్పు లేదు. మట్టిగోడలపై, ఖర్జూరపు ఆకులతో కప్పిన చిన్న చిన్న గదులు, ద్వారానికి తలుపులకు బదులు గోనెసంచుల పరదా, దొరికిన అతిసామాన్య తిండి, అత్యధికంగా పస్తులే, అతుకులు పడ్డ దుస్తులు, గోనెసంచి, గొంగళితో కూడిన పరుపు. ఖర్జూరపు ఆకులతో కప్పబడిన మసీదులో, చాపపై కూర్చుండి ఈ మహారాజు అరబ్బు దేశాన్ని ఏలుతుండేవారు. "ప్రభూ! నన్ను పేదల్లోనే ఉంచు, పేదల్లో నుండే నన్ను లేపుకో" అంటూ ఆయన దైవాన్ని వేడుకుంటుండేవారు. ప్రవక్తలకే శిరోమణి అయిన దైవప్రవక్త ముహమ్మద్ (స) పరిస్థితి ఇదీ. ఫకీరులాంటి ఈ పరిపాలకుని సామెత,

సామాన్య వ్యక్తి ఈ పుస్తకాన్ని సమర్పించటం ఎంతో కొంత విలువనే కలిగి వుంటుంది. ప్రత్యేకించి ఇది ప్రపంచంలో అత్యధికసంఖ్యలో నివసించే సామాన్య ప్రజల కోసమే. ఇంతకు క్రితం ఇస్లాం గురించి, అపోహల్ని, అపార్థాల్ని ఏర్పరచుకున్న ఇస్లాం విమర్శకులు, నా ఈ పుస్తకం ద్వారా ఇస్లాం, ఇస్లామీయ ప్రవక్త(స) గురించి వాస్తవాలు తెలుసుకున్న తరువాత తమ తప్పు భావనల్ని విడనాడగలరని ఆశించడమే కాదు, దృఢంగా విశ్వసిస్తున్నాను కూడా. ( రాజేందర్ నారాయణ్ లాల్, ఎం.ఎ. వారణాశి) జులై, 1987.



# 3. ధర్మం ఆవశ్యకత

ప్రశ్న : ఈ వైజ్ఞానిక యుగంలోనూ ధర్మానికి ప్రాధాన్యత ఏమైనా ఉందా?

**జవాబు :** నిస్సందేహంగా ఉంది. ధర్మం, విజ్ఞానం పరస్పరం వ్యతిరేకం ఎప్పుడూ కాదు. సైన్స్ నిరంతరం మారుతూ ఉండే చర్య. రాతియుగం నుండి ఆటమిక్, న్యూక్లియర్ కాలాల వరకు సైన్స్ అభివృద్ధి చెందుతూనే వచ్చింది. భవిష్యత్తులో కూడా మరింత అభివృద్ధి చెందగలదు. నేటి ఆధునిక యుగంలో అణుబాంబుకు ఉన్న విలువే రాతియుగంలో రాతి ఆయుధాలకుండేది. నేడు విమానానికి ఏ ప్రాముఖ్యత అయితే ఉందో, ఒకానొకప్పుడు ఎడ్లబండికి అదే ప్రాముఖ్యత ఉండేది. దీనిద్వారా ఒక వైజ్ఞానిక ఆవిష్కరణ ప్రాముఖ్యత, సమయాన్నిబట్టి తరుగుతూ పోతుంది. దీనికి భిన్నంగా సత్యధర్మానికి సంబంధించిన సూత్రాలు, నియమాలు శాశ్వతమైనవి, అనశ్వరమైనవి. విజ్ఞానశాస్త్రం మానవుని జీవిత సాధనాలను పెంచుతుంది. అంతేకాదు దీనిపై నియంత్రణే గనుక లేకపోతే మానవుడు ఓ క్రూర మృగంగా తయారవుతాడు. వేరొక వైపు ఒక నిజమైన పరిపూర్ణ ధర్మం, జీవన స్థాయి (Standard of living) తోపాటు, మానవుని జీవిత ప్రమాణాన్ని (Standard of Life) కూడా పెంచడానికి ప్రేరణనిస్తుంది మతం. సినిమాల ద్వారా జీవితంలో ఆనందం అనుభవించే అవకాశముండొచ్చు, దాన్ని కాదనలేం. అయితే భార్యాపిల్లల్ని పస్తులుంచి ఆనందం పొందడం కాదు. ప్రయాణానికి ఒక కారు అవసరమే. అయితే అది లంచాల ద్వారా సంపాదించింది మాత్రం కాకూడదు. బ్లాక్ మార్కెటింగ్ ద్వారా సంపాదించిన ధనంతో జీవనస్థాయిని పెంచుకోవడం పూర్తిగా తప్పైనదే. ఆశ్చర్యచకితులుగా చేసే గొప్ప గొప్ప వైజ్ఞానిక ఆవిష్కారాలు జరుగుతున్నప్పటికీ

నేడు మనిషిలో మానవత్వం అనేదే కరువైపోయింది. ఈ చేదు నిజాన్ని నిరాకరించేవారెవరు? మానవుడు ఎంతగా ఈ భౌతిక సుఖాల కోసం వెంపర్లాడుతున్నాడో, అతను నిజమైన, వాస్తవమైన శాంతిసుఖాలకు అంతగా వంచితుడైపోతున్నాడు. 'మనం భౌతిక సుఖంలో మైమరచిపోయామని 'వర్డ్స్‌వర్త్' (Wordsworth) చేసిన వ్యాఖ్య ఎంతో సుముచితమైనది.

సైన్సు అనేది రెండు వైపులా పదును గల ఖడ్గం లాంటిది. కరెంటు (విద్యుత్తు) నిస్సందేహంగా ఇంటిని దేదీప్యమానంగా వెలుగొందజేస్తుంది. కాని ఏ కొద్ది పొరపాటు జరిగి దాన్ని ముట్టుకున్నా, మనిషి జీవితమే శాశ్వతంగా సమాప్తమయిపోవచ్చు. అంతేకాదు, అతనిని కాపాడటానికి ప్రయత్నించిన వాడు కూడా తగిన జాగ్రత్త తీసుకోకపోతే తాను సైతం చనిపోవచ్చు. సైన్సులో మంచీ చెడు రెండూ ఉన్నాయి. కాని సైన్సులోని చెడుల్ని పరిపూర్ణ ధర్మం యొక్క బహుముఖమైన సర్వవ్యాపితమైన నియమాల ద్వారా నియంత్రించవచ్చు. అణుబాంబు, హైడ్రోజన్ బాంబు, న్యూట్రాన్ బాంబు సైన్సు ప్రసాదించిన అత్యంత ఘాతుకమైన ఆయుధాలు, కాని రెడ్‌క్రాస్, ఐక్యరాజ్యసమితులు ధర్మం ప్రసాదించిన వరాలు. ఏదేమైనప్పటికీ మనం బ్రతకాలి, ఇతరులను బ్రతకనివ్వాలి. అంటే శాంతి ఇచ్చిపుచ్చుకునే ధోరణి ద్వారానే మనం మన వ్యక్తిగత, సామూహిక, జాతీయ, అంతర్జాతీయ శాంతి సామరస్యాన్ని తప్పకుండా పొందగలుగుతాం. పరలోకం గురించి కూడా ఆలోచించాల్సి ఉంటుంది. సత్యధర్మం, దేవుని పేరు మీద వ్యక్తుల పరస్పర సంబంధాలను కలుపుతుంది. అందుకని సర్వాంతర్యామి, సర్వశక్తి సంపన్నుడు, అందరినీ పరివేష్టించి ఉన్న దేవుని కారుణ్యఛాయలో మనం మన జీవిత సౌధాన్ని నిర్మించుకోవలసి వుంటుంది. ఆ సౌధం, స్వరూపం ఎలాంటిదంటే దాని అంతస్తుల్లో మనకు, మన వంశానికి, మన దేశానికి, సర్వమానవాళికి స్థానముంటుంది. సత్యధర్మం ఈ సౌధానికి

పునాది కాగలుగుతుంది. ఏకేశ్వరవాదం అంతర్జాతీయ సౌభ్రాతృత్వం అనే మిశ్రమాలు కలిసిన సిమెంట్‌తో మాత్రమే ఇది నిర్మితమవుతుంది.

**ప్రశ్న : ప్రపంచంలోని ధర్మాలన్నీ పరస్పరం ఒకదానికొకటి వ్యతిరేకం. అందులో ప్రతి ఒక్కటీ తాను మాత్రమే సత్యాన్ని కలిగి ఉన్నానని,తాను మాత్రమే మహోన్నతమైనదని వాదిస్తుంది. ఈ సమస్యకు పరిష్కారమెలా సాధ్యం?**

**జవాబు :** దీనికోసం ప్రస్తుతమున్న ముఖ్యధర్మాలను తులనాత్మకంగా పరిశీలనాత్మకంగా, సహన దృష్టితో అధ్యయనం చేయాల్సి ఉంటుంది. ప్రపంచ మంతటికీ కేవలం ఒకే ధర్మముండే ఆస్కారమైతే లేదు. అయినా మనం వాటిలో అన్నిటికంటే ఉన్నతమైన, మేలైన సుగుణాలను ఎన్నుకొని వాటిని గౌరవించేవాళ్ళం కావాలి.

చైనాలో ప్రాచీన ధర్మమైన కన్‌ఫ్యూషన్ మతం ప్రస్తుతం దాదాపుగా కనుమరుగైపోయింది. జైన మతం హిందూ ధర్మంలో విలీనమైపోయింది. పారశీక మతం, సిక్కు మతం, యూదుత్వం, షింటో ధర్మం లాంటివి స్థానికమైన ధర్మాలు లేదా తమ అనుయాయుల సంఖ్య దృష్ట్యా, అంతగా పేర్కొనదగినవి కావు. అందుకని దీనికోసం హిందూ ధర్మం, బౌద్ధ మతం, క్రైస్తవం, ఇస్లాం ధర్మాల యొక్క తులనాత్మకమైన పరిశీలన చాలు. ఈ ధర్మాలన్నిటిని, 'స్వామి దయానంద సరస్వతి' గారు తన గ్రంథం 'సత్యార్థ ప్రకాశ్'లో సమీక్షించారని తెలుపడం సమంజసంగా భావిస్తున్నాను. అయితే విచారకరమైన విషయం ఏమిటంటే, స్వామిజీ తాము ముందే ఓ నిర్ణయాన్ని ఏర్పరచుకొని దానికే కట్టుబడిపోయారు. ఓ రకంగా పక్షపాత ధోరణినే అవలంభించారు. కేవలం తర్క వితర్కాలే తమ సమీక్షకు ఆధారంగా చేసేసుకున్నారు. ఫలితంగా స్వామిజీ ధర్మ సంస్కార అభిలాషను కలిగి ఉన్నప్పటికీ తమ ఉద్యమానికి విశాలత్వాన్ని సమకూర్చలేకపోయారు. ఇక ఆయనగారి ఆర్యసమాజం, ఆచరణలో

కాకపోయినా, సైద్ధాంతికంగానైనా ఆయన గారి ధార్మిక భావనల్ని, సిద్ధాంతాల్ని గుడ్డిగా విశ్వసిస్తోంది. ఆ కారణంగా స్వల్ప వ్యవధిలోనే అది తన ప్రాముఖ్య తను, శక్తిని, స్థిరత్వాన్ని కోల్పోయింది.

రాబోయే పేజీల్లో మేము వివిధ ధర్మాల సమీక్షను సమర్పిస్తున్నాము. అందులో పక్షపాతానికి గాని, స్పర్ధకుగాని లేక విషం వెదజల్లే వైఖరికిగాని ఎలాంటి తావు ఇవ్వడం జరగలేదు.



# 4. హిందూ ధర్మం

హిందూ ధర్మాన్ని స్థాపించినవాడెవరూ లేరు.[5] కాని ఈ ధర్మానికి 'వేద శాస్త్రాల'నబడే గ్రంథాలు మూలం. అంటే దైవగ్రంథాలు అన్నమాట. అయితే ఒక సామాన్య హిందువు ఎప్పుడైనా, ఒక్కసారైనా వేదాన్ని తన కళ్ళతో చూశాడో లేదో! ఇక అవి అతనింట్లో ఉంటాయనే ప్రశ్నే జనించదు. ఇలాంటి పరిస్థితిలో ఓ సామాన్య హిందువుకు దానిద్వారా దైవజ్ఞానాన్ని పొందే అవకాశమే లేదు. ఇంతేకాదు, అధిక సంఖ్యాకులైన హిందువుల ధర్మం సనాతన ధర్మం. అది బ్రాహ్మణులకు తప్ప వేరెవరూ వేదాలు పఠించరాదని నిషేధిస్తోంది. క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు లాంటి అత్యధిక సామాన్య హిందువులంతా తమ దైవం

---

*5. ఈ విషయానికి సంబంధించి ప్రఖ్యాత విద్వాంసుడు 'రాంధారి సింగ్ దినకర్' గారి పరిశోధనలు పరిశీలించదగ్గవి. ఆయన తన గ్రంథం 'సంస్కృతి కే చార్ అధ్యాయ్' (సంస్కృతికి సంబంధించిన నాలుగు అధ్యాయాలు)లో 'హిందూ సంస్కృతి నిర్మాతలు' అనే శీర్షిక కింద ఇలా రాస్తున్నారు.*

*'ఏసుక్రీస్తు క్రైస్తవానికి, మహనీయ ముహమ్మద్(స) ఇస్లాంకు జన్మనిచ్చినట్లు, హిందూ ధర్మం ఏదో ఒక వ్యక్తి ద్వారా ఉనికిలోనికి రావడం గాని, రూపొందించడం గాని జరగలేదు. ఈ కారణంగానే మీరు ఎవరైనా ఓ హిందువును 'నీ ధార్మిక గ్రంథమేది' అని ప్రశ్నిస్తే, అతను వెంటనే ఏదో ఒక పేరును చెప్పలేడు. అదేవిధంగా మీరతడ్ని 'నీ అవతారం, లేక ప్రత్యేక ధార్మిక గురువు, లేక ప్రవక్త లేక దైవ సందేశహరుడు ఎవరు?' అని ప్రశ్నించినా, అతను ఏదో ఒక అవతారం లేక ఒక మహాత్ముని పేరును సూచించలేడు. అలా చెప్పక పోవడం కూడా సమంజసమైనదే. దానికి కారణం, హిందూ ధర్మం ఏదో ఒక మహాత్ముని ద్వారానో, లేక ఒక వర్గం ద్వారానో ఉనికిలోకి రాలేదు. హిందూ ధర్మం ఏదో ఒక విశ్వాసంపై ఆధారపడినది కాదనేది వాస్తవం. దానికి భిన్నంగా అది అనేక విశ్వాసాల, భావనల సమూహం. ఆయా కాలాలందు భారతదేశానికి వచ్చిన వివిధ వర్గాలు, జాతుల కలయికతో ఏ విధంగానైతే భారతజాతి ఏర్పడ్డదో, అదేవిధంగా ఈ వివిధ వర్గాల, జాతుల ధార్మిక విశ్వాసాల కలయికతో లేక సమూహంతో హిందుత్వం (హిందూ యిజం) ఏర్పడింది.' (పేజి 73)*

ద్వారా సృష్టించబడిన వేదాలను చదవకుండా వంచించబడటం హిందూ ధర్మంలోని అత్యంత విస్మయం కలిగించే విషయం.

బ్రాహ్మణులు తప్ప మిగిలిన హిందువులంతా వేదాలు చదవకుండా వంచించబడిన ఈ నిషేధానికి, కారణం ఏమిటో ఒక సామాన్య హిందువుకు అసలు అర్థం కాని విషయం. క్లుప్తంగా చెప్పబోయేదేమిటంటే, దైవం ద్వారా విరచితమైన ఈ పవిత్ర గ్రంథాలు, సంస్కృత భాష కోసమే ప్రత్యేకింపబడిన గ్రంథాలయాల శోభను ఇనుమడింపజేస్తాయి. లేదా ఏదో ఒక నగరంలోని అతికొద్ది మంది బ్రాహ్మణోత్తముల ఇండ్ల ప్రత్యేక గదుల్లో మాత్రమే ఉంచబడతాయి. ఒక శతాబ్దానికి పూర్వం, ఈ మనస్తత్వానికి వ్యతిరేకంగా ఆర్య సమాజం ఒక ఉద్యమాన్ని నడిపింది, హిందువులందరికీ వేదాలు అధ్యయనం చేసే హక్కుండాలని నినదించింది. కాని ఆచరణలో మాత్రం దానివల్ల సామాన్య హిందూ ధర్మంపై ఎలాంటి ప్రభావం పడలేదు. దేవుని ద్వారా సృష్టించబడిన ధార్మిక గ్రంథాలైన ఈ వేదాల్ని ఇతర వర్గాలు, స్త్రీలు చదవరాదనే నిషేధం మనుస్మృతి పెట్టిన ఆంక్ష. ఇదీ హిందువుల పవిత్ర దైవగ్రంథాలైన వేదాల పరిస్థితి.

ఏకేశ్వరోపాసన ఒకప్పుడు వైదిక ధర్మానికి మూలభావనగా ఉండేది. అందులో విగ్రహారాధన అనేదే లేదు. మౌలికంగా పునర్జన్మ అనే సిద్ధాంతమూ లేదు.[6] నాలుగు వర్ణాలు అంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాల విభజన

---

*6. వైదిక కాలంలో పునర్జన్మ అనే భావనే లేదని చెప్పిన రాజేందర్ నారాయణ్ గారి ఈ వ్యాఖ్యలు విని పాఠకులు ఆశ్చర్య చకితులవుతున్నారేమో! ఈ విషయాన్ని కేవలం రాజేందర్ నారాయణ్ గారొక్కరే పేర్కొనలేదు. ఇతర విజ్ఞానులు, విద్వాంసులు కూడా ఇదే విషయాన్ని చెబుతున్నారు. శ్రీ రాంధారిసింగ్ దినకర్ తన గ్రంథం 'సంస్కృతి కే చార్ అధ్యాయ్'లో ఇలా వ్రాస్తున్నారు.*

*"నాస్తికులు, భౌతికవాదులు తప్ప, పరలోకం పట్ల భయభీతులు లేని హిందువులు బహు తక్కువ. ఈ భావన (పరలోక భావన) వైదిక కాలపు భావనకు భిన్నంగా ఉంది.*

వేదకాలపు ఋషులు, నాస్తికులు లేదా భౌతికవాదులైతే కారు. కాని మరణం అంటే భయమూ వారికి తెలియదు. స్వర్గం గురించే వారికి తెలుసు గాని, ఆత్మలకు యాతనలను అనుభవించే స్థానమైన నరకం కూడా ఒకటి ఉండొచ్చనే భావనే వారిలో కనిపించేది కాదు. నిజం చెప్పాలంటే ఆత్మ,పునర్జన్మ, కర్మలకు ఫలితంగా లభించే విషయంలో,వైదిక కాలపు ఋషులు అధికంగా ఆలోచించనేలేదు. *(పేజి. 85)*

ఇప్పుడు వాడుకలో ఉన్న పునర్జన్మ సిద్ధాంతానికి మూలాధారమైన భావన ఏమిటంటే, ప్రస్తుతం ఉన్న మానవులు, పశువులు, పక్షులు, క్రిమికీటకాదులు, చెట్లు చేమలు అన్నీ కూడా తమ పూర్వజన్మ కర్మల ఫలితంగా పుట్టినవే. దీన్ని నమ్మకపోతే దేవునిపై అన్యాయం చేశాడన్న నేరం పడుతుంది. ఒక ప్రాణికి ఆయన ఉన్నత స్థాయికి చెందిన శరీరమిచ్చాడని, ఇంకొక ప్రాణికి అధమస్థాయి శరీరాన్నిచ్చాడని, మానవుల్లో కూడా ఒకరిని బలవంతునిగా, ఇంకొకరిని బలహీనునిగా, ఒకరిని ధనవంతునిగాను, వేరొకరిని నిరుపేద గాను, ఒకరిని విధ్వాంసునిగాను, ఇంకొకరిని పామరునిగా పుట్టించడం దేవుడు చేసిన అన్యాయమని వేలెత్తే అవకాశం ఏర్పడుతుంది. దీని అర్థం ఏమిటంటే ప్రాణులన్నింటిలోను, మానవుడు ఉత్కృష్టమైనవాడు. మంచీ, చెడు, పాప పుణ్యాల నియమాలన్నీ మానవునికే వర్తిస్తాయి. ఈ నియమంపై ఇంకొక ప్రశ్న జనిస్తుంది. మానవుని కంటే ముందు భూమ్మీద చెట్లు ఆకులలములే లేకపోయి వుంటే మానవుడు తినేదేంటి? తినకపోతే బ్రతికేదెలా? దీనితోపాటే ఇంకొక ప్రశ్న జనిస్తుంది- సృష్టి ప్రారంభం అయినప్పుడు మానవుని గత జన్మకు సంబంధించిన శిక్షకు గాని, బహుమానానికి గాని అర్థమే లేదు.

విశ్వం ఆది నుండే ఉంది. దానికి ఆరంభం గాని, అంతం గాని ఏదీలేదు అని చెప్పబడుతోంది. అలాగైతే విశ్వసృష్టి, దాని రూపకల్పనకు సంబంధమైన విషయాలు వివరంగా చెప్పబడ్డాయి కదా? అని ప్రశ్నించినప్పుడు, అది పుట్టిపెరిగే క్రమం ఆది నుంచి జరుగుతోందని, శాశ్వతమైనదని సమాధానమిస్తారు. ఈ విశ్వం ఆది నుంచే నిర్మితమవుతూ వస్తుందని, చివరిదాకా నశిస్తూనే ఉంటుందని కూడా చెబుతారు. అయితే, ధార్మిక గ్రంథాలననుసరించి ఈ విశ్వం తనంతట తానుగా ఉనికిలోకి రాలేదని, దేవుడు దాన్ని సృష్టించాడని, ఆయనే ఒకానొక రోజు దీన్ని సమాప్తం చేస్తాడు కాబట్టి దాని ఆది అంత్యాల పరంపర ఎలా నిరూపించబడుతుంది అని ప్రశ్నించినప్పుడు 'దేవుడు ఆరంభం నుండే ఉన్నాడు. ఆయనకు అంతం అంటూ ఏదీలేదు కాబట్టి ఆయన కార్యం కూడా ఆదిదని, శాశ్వతమైనదని సమాధానమివ్వబడుతుంది.

దీనిపై కూడా ఒక ప్రశ్న జనించే అవకాశముంది. విశ్వ సృష్టి కూడా దైవంచే

కూడా ఓ రకంగా ఆర్థిక దృష్టితోనే విభజించినట్లు అగుపిస్తూ ఉంది. కాని ఈ నాలుగు వర్గాల్లోనూ పరస్పరం వివాహాలు జరుగుతుండేవి. విశ్వామిత్రుడు క్షత్రియుడై ఉండి కూడా తన తపోబలం వల్ల బ్రాహ్మణ ఋషిస్థానాన్ని పొందగలిగాడు. ఇదేవిధంగా పరశురాముడు బ్రాహ్మణ కుటుంబంలో జన్మించినప్పటికీ తాను చేసిన పనుల రీత్యా క్షత్రియుడనిపించుకున్నాడు. వశిష్ఠముని దాసి పుత్రుడని పేరుగాంచాడు. వాల్మీకి మహర్షి పిట్టలను వేటాడే వేటగాడుగా పేరుగాంచాడు.

శ్రీరామచంద్రునికి సంబంధించి ఆయన శబరి (శూద్రురాలు) ఎంగిలి చేసిన రేగుపళ్ళను ప్రీతితో తిన్నాడని చెప్పబడింది. శ్రీరామచంద్రుని అనుమతితో రావణుడు, వాలి వధించబడిన తరువాత వారి వితంతువులు వారి మరుదులతో వివాహమాడడం జరిగింది. అంతెందుకు? వేదాల్లో 'నియోగం' (అంటే సంతాన ప్రాప్తి కోసం స్త్రీలు పర పురుషులతో సంపర్కం ఏర్పరచుకోవడం) లాంటి విషయాలూ వర్ణించబడి ఉన్నాయి. శ్రీకృష్ణుని అనుమతితో ఒకే గోత్రంలో కూడా వివాహాలు జరిగేవి. శ్రీరామచంద్రుడు తన భార్యతో సంబంధాల్ని తెగదెంపులు చేసుకొన్నాడన్నది సముచితమైందా? కాదా? అనేది వేరే విషయం. దశరథ మహారాజు ముగ్గురు పట్టపు రాణులైన కౌసల్య, కైకేయి, సుమిత్రలు తమ భర్త చనిపోయినప్పుడు సతీసహగమనం చేయలేదు. అంతేకాదు, శ్రీకృష్ణుని కాలంలో ఆయనకు దగ్గరి బంధువు అయిన కుంతీ కూడా సతీసహగమనం చేసి ఉండలేదు.

వైదిక యుగం, రామాయణ మహాభారత కాలం నాటి ధర్మమూ,

---

*చేయబడ్డ కార్యమే కదా? మరి అది వినాశనం ఎలా అవుతుంది? మీరు ఎలాంటి దృష్టాంతము, సాక్ష్యము లేకుండానే విశ్వాన్ని అనాదియైనదని, అనంతమైనదని స్వీకరించినా కూడా పునర్జన్మ సిద్ధాంతం నిరూపితం కాదు. ఎందుకంటే ప్రతిసృష్టి సమయంలో అందు లోని అన్ని ప్రాణుల్ని సృష్టించే వ్యవస్థ ఉండాల్సి వస్తుంది. మరి వారి పూర్వజన్మ సంగతేమిటి అనే ప్రశ్న ప్రళయం వరకు నిరూపితం కాజాలదు.*

సంస్కృతులు మధ్యయుగం వచ్చేటప్పటికి తారుమారైపోయాయి. ఇక ప్రస్తుతం ఉన్న హిందూధర్మం, సంస్కృతులు మనకు ఆదర్శనీయమైన శ్రీరామచంద్రుని, శ్రీకృష్ణుని కాలపునాటి ధర్మమూ, సంస్కృతులకు పూర్తి వ్యతిరేకంగా ఉన్నాయి. అప్పుడప్పుడు భారతదేశానికి వచ్చి కలిసిపోయిన వివిధ వర్గాలు అనగా ఆర్యులు, ద్రావిడులు, సింధూ లోయ ప్రజలు, హూణులు, కుషానులు మున్నగు జాతుల పరస్పర కలయిక, చివరికి వారి ధార్మిక విశ్వాసాల ప్రభావం కారణంగా హిందూ ధర్మంలో మార్పులు, పరస్పర వ్యతిరేకతలూ వచ్చేశాయి. వేదాలు, ఉపనిషత్తులు ఆర్నీకుల ఏకేశ్వరవాదం క్రమక్రమంగా బహుదైవారాధనగా మారుతూ పోయింది. రుషుల ద్వారా సమర్పించబడిన స్మృతులకు, తాత్విక గ్రంథాలకు కూడా ధార్మిక ప్రామాణికత లభించింది. రామాయణం, మహాభారతం లాంటి కావ్య రచనలకు కూడా ధార్మిక హోదా లభించింది. ఆ తరువాత పద్దెనిమిది కాల్పనికమైన, కృత్రిమమైన పౌరాణిక గాధలకైతే అన్నిటికంటే మించిన ధార్మిక హోదా, ప్రమాణ పత్రం లభించి నట్లయింది. నాస్తికత్వం, జైన, బౌద్ధమతాలు కూడా హిందూ ధర్మంలో విలీనమై పోయాయి. ఇవేకాదు, వైష్ణవ, శైవ, శాక్త వర్గాలే కాకుండా వామ (బామ) భావనలు కూడా ధార్మిక స్వాతంత్ర్యం పేరుతో ధార్మికమైనవిగా అనిపించుకో బడ్డాయి. ఇవేకాకుండా అసంఖ్యాకమైన సాధువుల, సంతుల కావ్యాలకు వచనాలకు కూడా ధార్మిక ప్రామాణికత లభించింది. నాలుగు వందల సంవత్సరాల క్రితం, తన భార్య పట్ల కలత చెంది, తన ఆధ్యాత్మిక శాంతి కోసం ఆ కాలపు వ్యవహారిక భాషలో తులసీదాసు వ్రాసుకున్న 'రామ్‌చరిత్ మానస్' అనే గ్రంథానికి ఎంతో ధార్మిక ప్రాచుర్యం లభించింది. ఉత్తర భారతంలో హిందూ ధర్మానికి నేడది మూలస్తంభంగా భావించబడుతోంది. అయితే అది హిందీ భాషలో ఉన్నందున దక్షిణ భారతదేశం వారు దానిని అస్సలు ఇష్టపడరు. ఇదేకాదు, తులసీదాస్ రచించిన ఇతర గ్రంథాలకు కూడా ప్రత్యేకించి 'హను మాన్ చాలీసా'కు ధార్మికప్రామాణికత ఉంది. నాలుగు వందల సంవత్సరాల

క్రితం, ఆనాటి వ్యవహారిక భాష అయిన 'బ్రిజ్ భాష'లో 'సూర్‌దాస్' రచించిన 'సూర్ సాగర్'కు కూడా ధార్మిక ప్రామాణికత లభించింది. ఇంకా కొంగ్రొత్త దేవీ, దేవతల్ని ఆవిష్కరించే పరంపర కొనసాగుతూనే ఉంది. అందులో ఆధునిక ఆవిష్కరణలో 'సంతోషిమాతా' పేరు ఒకటి. ధార్మిక సాహిత్యాన్ని అత్యధికంగా కలిగి ఉన్నట్లు హిందూ ధర్మం వాదిస్తోంది. రుగ్వేదం, యజుర్వేదం, సామ వేదం, అథర్వణ వేదమనే నాలుగు వేదాలు దైవగ్రంథాలుగా భావించబడు తున్నాయి. వీటిలోనున్న అంశాలు, విషయాలు, వ్యాసాలు తొంభై తొమ్మిది శాతం మంది హిందువులు అసలే ఎరుగరు. అనేక స్మృతులున్నాయి, అయితే వాటి దృక్పథాలు పరస్పరం ఒకదానికొకటి విరుద్ధం. అనేక ఉపనిషత్తులు, ఆర్యనికాలు, యోగ వైశిష్ట్యాలు, ఆరు దర్శన శాస్త్రాలు కూడా ఉన్నాయి. కాని వాటన్నింటి భావాలు పరస్పరం విరుద్ధంగా ఉన్నాయి. ఏ కొందరో విద్యాధికులు తప్ప, అత్యధిక హిందువులు ఈ గ్రంథాల విషయ సూచికల్ని సైతం ఎరుగరు. రామాయణాలు కూడా రెండు. ఒకటి వాల్మీకి రామాయణం, మరొకటి తులసి రామాయణం. (*ఇవికాక వివిధ ప్రాంతాల్లో వివిధ దేశాల్లో అనేక రామాయ ణాలు ఉన్నాయి. వాటన్నిటిలో పరస్పరం వ్యతిరేకత కనబడుతుంది.*) అందు లోని పాత్రలు కూడా విభిన్నంగా ఉన్నాయి. పద్దెనిమిది పురాణాలు ఉన్నాయి. వీటి ప్రకారం శంకరుడు భంగ్ (గంజాయి) త్రాగేవాడని తెలుస్తోంది. దేవతలకు రాజైన ఇంద్రుడు గొప్ప రసికుడు అనే విషయం కూడా వాటిలో చర్చించ బడింది. సామాన్య హిందువులకు తెలియని ఇంకా ఆరు గ్రంథాలు కూడా ఉన్నాయి. హిందూ ధర్మంలో ఐదుగురు ప్రత్యేక ఆచార్యులు (ఆధ్యాత్మిక గురు వులు) ఉన్నారు. వారు శంకరాచార్యుడు, రామానుజాచార్యుడు, వల్లభా చార్యుడు, మాధవాచార్యుడు, నింబార్కాచార్యులు. వీరందరి ప్రవచనాలు, ఆదర్శాలు, విశ్వాసాలు, ధ్యేయాలు, ఆశయాలు పరస్పరం వ్యతిరేకం. వీరేగాక లెక్కలేనంత మంది ధర్మాచార్యులున్నారు. వైష్ణవులు, శైవులు, శాక్తులు అనేవి

మూడు ప్రముఖ వర్గాలు. ఇవన్నీ పరస్పరం ఒకదానికొకటి విరుద్ధం. అత్యంత ఆస్తికుడు (దైవాన్ని విశ్వసించేవాడు) అయిన శంకరాచార్యుని శిష్యులు కూడా హిందువులే. అత్యంత నాస్తికులైన జైనులు, బామ్ మార్గీయులు కూడా హిందువులే. ఉల్లి, వెల్లుల్లిని సైతం స్వీకరించని వారూ హిందువులే. అసలే తినరాని వస్తువుల్ని సైతం తినే సంస్కారహీనులూ హిందువులే. పీతాంబరాల్ని (పసుపు పచ్చని వస్త్రాలు) ధరించే సాధువులు హిందువులే, అసలు వస్త్రాలే ధరించక దిగంబరంగా ఉండే సాధువులూ హిందువులే. వైష్ణవ వర్గంలో మాంసాహారం నిషేధితం. శాక్తుల్లో మాంసాహారం అనుమతించబడింది. హిందువులు సైద్ధాంతికంగా ఏకేశ్వరవాదులు. కాని ఆచరణ రీత్యా బహు దైవారాధకులు. సైద్ధాంతికంగా హిందువుల ధార్మిక గ్రంథం వేదం. కాని వాస్తవంలో, క్రియారూపంలో ఉత్తర భారతదేశంలో 'రామ్‌చరిత్ మానస్'కే ఈ స్థానముంది. దక్షిణ భారత హిందువుల విశ్వాసాలు పూర్తిగా భిన్నంగా ఉన్నాయి. సంస్కృతి పేరుతో హెూలీ సమయంలో బూతులు తిట్టుకోవడం, దీపావళి పండుగ నాడు జూదమాడటం, శివరాత్రి నాడు గంజాయి సేవించడం ధార్మిక కార్యాలుగా గుర్తించబడ్డాయి. రామ్‌చరిత్ మానస్‌లో బ్రాహ్మణత్వానికి ప్రస్ఫుటంగా ఉన్నత స్థానం ఇవ్వడం జరిగింది. ఏపాటి సుగుణం లేని బ్రాహ్మణుడు సైతం ఆరాధ్యుడే. కాని సద్గుణాలు కలిగిన శూద్రుడు దీనికి అర్హుడు కాడు. అన్ని స్మృతులకన్నా మనూస్మృతే శూద్రులకు విరోధిగా కనబడుతుంది. శూద్రులకు వ్యతిరేకంగా రాసిన గ్రంథాలు, నిజంగానే తులసీదాస్, మనూలు వారిని దృష్టిలో ఉంచుకొని రాయకపోయినా, ఈ సువిశాల హిందూధార్మిక సాహిత్యంలో ఏమంత లోటు కనిపించకపోయేది. పురాణాలది కూడా ఇదే పరిస్థితి. ఇక పరలోక భావనలకు సంబంధించి కూడా హిందూ ధర్మంలో పరస్పరం వ్యతిరేక**తలు** కనబడతాయి. వారు స్వర్గ నరకాలనూ విశ్వసిస్తారు, దానితోపాటే పునర్జన్మ సిద్ధాంతాన్నీ విశ్వసిస్తారు. శిఖా

సూత్రం కూడా ఊహాజనితమైనదే. అసలు హిందూధర్మాన్ని నిర్వచించడమే కుదరని విషయం. దాన్ని విశదీకరించలేం. క్లుప్తంగా చెప్పాలంటే హిందూ ధర్మం ఒక విచిత్రాతి విచిత్రమైన వ్యతిరేకతకు మారుపేరు. ఎందుకంటే ఇందులో ఏకకాలంలో ఏకేశ్వరవాదం, బహుదైవారాధన, ఆస్తికత్వం, నాస్తికత్వం, అద్వైతవాదం, ద్వైతవాదం, విశిష్ట ద్వైత వాదం[7], ద్వైతాద్వైతవాదం[8], హింస, అహింస, జన్మపరంపర (పునర్జన్మ) సిద్ధాంతం[9], స్వర్గం, నరకం, దేవుని సాకారత, నిరాకారత, పురాణవాదం, దర్శనశాస్త్రం (తత్వశాస్త్రం), ప్రవృత్తి వాదం (ఇచ్ఛాకోరికలు కలిగి ఉండటం), నివృత్తివాదం (వైరాగ్యం), ఆశావాదం, నిరాశావాదం, తీవ్రవాదం, సహనత్వం, మాంసాహారం, శాఖాహారం- అన్నీ కలగాపులగమై పోయాయి. హిందువుల ఈ సువిశాల ధార్మిక సాహిత్యం, పరస్పర వ్యతిరేకత గురించి డాక్టర్ రాధాకృష్ణన్ లాంటి విద్వాంసులకు ఈ వాదాలు పరిశోధన (రీసెర్చి) చేయటానికి తగినంత సామాగ్రిని సమకూర్చితే సమకూర్చి ఉండొచ్చు. అలాగే స్వామి వివేకానందుని లాంటి మహా ఉన్నత సాధువుకు, ఇతర మహా సంస్కర్తలకు ఇందులో నుండి ఆధ్యాత్మిక తను వెలికి తీసేటంతటి సామర్థ్యమూ, సంస్కరణకు సంబంధించిన గౌరవాదరాభిమానాలు పొందే అవకాశాలు లభించి ఉండొచ్చు. కాని సాధారణ చింతన, యోచన కలిగిన ఓ హిందువుకు మాత్రం ప్రస్తుత హిందూ ధర్మంలో లభించేదీ ఏదీ ఉండదు. వీటన్నిటినీ అతను కేవలం కనికట్టుగాను, గారడిగాను, మోసం (Hocuspocus) కలగూర గంప (Hotchpotch) గానే భావించటానికి వివశు డై పోతాడు. దీని మారు పేరే బ్రాహ్మణవాదం (Brahmanism). సామాన్య హిందువులకు వ్యయంతో కూడిన కర్మకాండలు, ధార్మిక ఆచారాలు, ముఖ్యంగా

7. *ఆత్మ, విశ్వం, బ్రహ్మ నుండి వేరైనప్పటికీ, దాన్ని అన్యముగా భావించకుండా ఉండే సిద్ధాంతం.*

8. *ఆత్మ, విశ్వాన్ని, బ్రహ్మతో వేరుగా, ఇతరముగా విశ్వసించుట.*

9. *ఆత్మ పదేపదే శరీరాల్ని మార్చే భావన. (ఆవాగమనము)*

శూద్రులకు అత్యంత మూర్ఖమైన అవహేళన, అవమానాలు దీని పునాదిగా ఉన్నాయి. వీటిని తుదముట్టించడానికి (25) వందల సంవత్సరాలకు పూర్వం గౌతమ బుద్ధుడు, ప్రస్తుత కాలంలో మహాత్మాగాంధీ ఎంతో ప్రయత్నించి, విఫలమైపోయారు. చివరికి డాక్టర్ అంబేద్కర్ లాంటి ఆధునిక భావనలు కలిగిన వాడు హిందూ ధర్మాన్ని విడిచిపెట్టాల్సి వచ్చింది. ఆ మహోన్నత శూద్ర నాయకుడు పునాప్యాకెట్ (ఒప్పందం)తో హరిజనులకివ్వబడిన స్వతంత్ర ఎన్నికల హక్కును మహాత్మాగాంధీ నడిపిన నిరాహారదీక్ష కారణంగా త్యజించి, హిందూ జాతిపై మరువరాని మేలు చేసిపోయిన నాయకుడు. ఆయన హిందూ ధర్మాన్ని విడిచి బౌద్ధ ధర్మాన్ని స్వీకరిస్తున్నప్పుడు ఒక చారిత్రక వాస్తవాన్ని తెలుసుకోలేకపోవడం విచారకరమనే చెప్పాలి.

బౌద్ధ ధర్మం భారతదేశంలో ఎంత బలహీనపడిపోయిందంటే, బ్రాహ్మణులు వారి తిరుగులేని తెలివితేటలను ఉపయోగించి గౌతమబుద్ధునికి హిందూ ధర్మంలో అవతార పురుషుని స్థానమిచ్చారు. బౌద్ధ ధర్మానికి జన్మ స్థలమైన భారతదేశం నుండే దాన్ని నామరూపాల్లేకుండా గెంటివేయడం అంబేద్కర్‌కు తెలియదంటే ఆశ్చర్యపడవలసిన విషయమే. డాక్టర్ అంబేద్కర్ సమానత్వాన్నే గనుక కోరి ఉండినవాడైతే ఆఫ్రికాలో నీగ్రోలపై జరుగుతున్న హింసా దౌర్జన్యాలపై మహాత్మాగాంధీ వెలిబుచ్చిన ఈ అభిప్రాయాలను కనీసం ఆలోచించైనా ఉండాల్సింది. ఆ అభిప్రాయం ఏమిటంటే, 'ఒక ఆఫ్రికన్ వ్యక్తి క్రైస్తవాన్ని స్వీకరించినప్పటికీ తెల్లజాతి క్రైస్తవులు అతనికి తమతో సమానమైన హోదానివ్వరు. కాని అదే జాతి నీగ్రో ఎప్పుడైతే ఇస్లాంను స్వీకరిస్తాడో, వెంటనే అతనికి ఉన్నత స్థాయి, ముస్లింలతో సమానమైన, పరిపూర్ణ సమానత్వం లభిస్తుంది.[10]

---

*10. పైన మేము శ్రీ రాంధారి దినకర్ గారి 'సంస్కృతి కే చార్ అధ్యాయ్' అనే పుస్తకం ఆధారంగా, నేటి హిందు సమాజం విభిన్న జాతుల సమూహమని, నేటి హిందూ ధర్మం విభిన్న జాతుల ధార్మిక విశ్వాసాల సమూహమని నిరూపిస్తూ వచ్చాం. ఇకిప్పుడు*

ఆ స్వచ్ఛమైన వైదిక ధర్మం, బహు దైవారాధనా ధర్మంగా ఎలా మారింది? వైదిక ధర్మంలో దేవీదేవతల ఓ సైన్యానికి సైన్యమే ఎలా వచ్చిచేరింది? ప్రతి వస్తువు ఎలా పూజనీయమై పోయింది? దీనికి సంబంధించిన వివరాలు కూడా 'సంస్కృతి కే చార్ అధ్యాయ్' అనే పుస్తకంలోనే లభిస్తాయి. ఈ వివరాలు తెలిపే పేరాగ్రాఫ్‌లను గురించి తెలిపేముందు కొన్ని శీర్షికలపై దృష్టి సారించండి. ● ఆర్యులు, ఆర్యుల తరువాతి సంస్కృతుల సమ్మేళనం ● వివిధ జాతుల మధ్య వివాహాదులు ● ఐక్యతకు కృషి ●శివునికి ఆర్యులు, ద్రావిడులు పెట్టుకున్న పేర్లు ●శ్రీరామచంద్రుని ప్రాతిపదికగా ఏకత్వం, ఐకమత్యాలకు కృషి ● ద్రావిడ భక్తి ఉద్భవనం ● ఇతర జాతుల ధర్మం. ఇకిప్పుడు పేరాగ్రాఫ్‌లను పరిశీలించండి.

"బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యుల మధ్యనైతే పరస్పరం వివాహాది సంబంధాల ఆచారం ఉండనే ఉండేది. ఇతరులకు, శూద్రులకు మధ్య కూడా వివాహాలకు ఎలాంటి ఆంక్షల్లేవు." *(పేజి. 55)*అని చెప్పిన తరువాత దినకర్ గారు 'ఐక్యతకు కృషి' అనే శీర్షికలో ఇలా రాశారు :

'ఆర్యుల ద్వారా పరిచయం చేయబడిన వర్ణ వ్యవస్థను భారతదేశంలోని ఇతర జాతులు స్వీకరించాయి. ఇది మనదేశంలో సంస్కృతుల కలయికకు మొదటి మెట్టు అయింది. దీనిద్వారా ఆర్యులు, ద్రావిడులు, నీగ్రోలు, మంగోలు జాతుల అన్ని వంశాలు కలిసిపోయి ఈ సమాజ సభ్యులుగా మారిపోయారు. ఇదే ఇంకాస్త ముందుకుపోయి, హిందూ సమాజంగా పిలువబడింది. ఐక్యతకు సంబంధించిన వ్యవహారాలు ఇంతటితోనే ఆగిపోలేదు, ఆర్యులు తమ సభ్యతా సంస్కృతుల్ని ఇతర జాతులపై రుద్ది ఊరుకోలేదు. ఫలితంగా అన్ని జాతులతో కూడిన ఒక సమాజం ఏర్పడింది. అందరి అలవాట్లు అభిరుచులు, ఆచార వ్యవహారాలు, ధర్మాలు పరస్పరం ప్రభావితమయ్యాయి. ఈ ప్రభావం నుండి ఆర్యులు సైతం తప్పించుకోలేకపోయారు." *(పేజీ : 48)*

'కేవలం వేదాల అధ్యయనం ద్వారా హిందూ ధర్మ పురోగతికి సంబంధించిన సమస్యలన్నీ పరిష్కరించబడవు. ఉదాహరణకు శివుని ఆరాధనకు సంబంధించిన ఏ రూపాలైతే హిందూ సమాజంలో నేడు ఆచారంలో ఉన్నాయో, శివుని ఆ రూపం వేదాల్లో కనిపించదు. వేదాల్లో కనిపించే రుద్ర శివుడు ప్రకృతి యొక్క తీవ్ర ప్రకోపాల రూపం (ఉదాహరణకు ప్రచండ వాయువులు, తుఫాను, వరద భీభత్సాలు, పిడుగులు, రాళ్ళ వర్షాలు, అంటువ్యాధులు, భూకంపాలు మొదలైనవి)తో కనిపిస్తాడు. అయితే ఆయన గంజాయి, ధత్తూరము ఎందుకు సేవించవలసి వచ్చింది? కపాలహారమెందుకు తొడగవలసి

వచ్చింది? చితిభస్మాన్ని ఎందుకు శరీరంపై పులుముకోవలసి వచ్చింది? ఎడ్లను ఎందుకు అధిరోహించ వలసి వచ్చింది? పాముల్ని శరీరానికి ఎందుకు చుట్టుకోవాల్సి వచ్చింది? ఆయన పేరు మీద లింగం (శిశ్నము)ను ఎందుకు పూజించాల్సి వచ్చింది. ఈ సమస్యలన్నింటికీ పరిష్కారం మనకు వేదాల్లో లభించదు. అందుకని శివుని భావనకు సంబంధించి వ్యాపించిన గాథను అర్థం చేసుకోవటానికి మనం ఆర్యుల సమాజానికి ఆవల ద్రావిడ, ఆస్ట్రిక్ సమాజాల్ని పరిశీలించక తప్పదు."( పేజీ : 56)

ఆర్యుల జాతి భావావేశాలు కల జాతి, వారు ప్రకృతిని ఆరాధించే మనస్తత్వం గలవారు. అగ్ని, ఇంద్రుడు, వరణుడు, పుష్షుడు, సోముడు, ఉషా, వర్జాన్యుడు వారి ప్రత్యేక దేవతలు. వేదాల్లోని ఈ దేవతల పూజ అలా ఎందుకు ఆగిపోయినట్లు? వారికి బదులు హిందూ సమాజపు ప్రముఖ దేవతలైన శివుడు, విష్ణువు ఎలా ఉనికిలోనికి వచ్చారు? ఇంకా వారి సారధ్యంలో 33 కోట్ల దేవతలు అదనంగా వచ్చిచేరారు. వేదాల్లో పేర్కొనబడిన కొంతమంది దేవతల స్థానంలో, ఏ విధంగానైతే 33 కోట్ల దేవతలకు స్థానం లభించిందో, అదేవిధంగా హిందూసమాజంలో వందలాది వ్రతాలు, మొక్కుబడులు, పూజలు, ఇతర అనేక ధార్మిక కార్యకలాపాలు చోటుచేసుకున్నాయి. వీటి ఉనికి వేదాల్లో అసలే కనిపించదు. ఇదే విధంగా వేదాల తరువాత, ఎప్పుడైతే పురాణాల కాలం ప్రారంభమైందో ఈ పురాణాల్లో చిత్రవిచిత్రమైన అనేక గాథలు వెలిశాయి. ఈ కథలు, గాథలు కేవలం ఆర్యుల మేధోజనితాలే కావు. ఇందులో ద్రావిడులు, ఆస్ట్రికులు, నీగ్రోలు, ఇంకా ఆ తరువాత వచ్చిన మంగోలులు, గ్రీకులు, శాక్తులు, ఆహీర్లు, ప్రాచుర్యంలో ఉన్న వివిధ జాతులకు సంబంధించిన విషయాలు కూడా సందర్భాన్ని అనుసరించి వాటికి కొత్తకొత్త రూపాల్ని ఇవ్వడం జరిగింది." (పేజీ : 56)

దినకర్‌గారు రామావతారం, కృష్ణావతారం, వాల్మీకి రామాయణం రాధాకృష్ణులకు సంబంధించిన గాథలు మున్నగు అన్ని అంశాలను సుదీర్ఘంగా సమీక్షించారు. వాల్మీకి రామాయణంలో కూడా ఎన్నో విషయాలు పెరిగినట్లు ఆయన తెలిపారు.



# 5. బౌద్ధ ధర్మం

హిందూ ధర్మం ద్వారా రకరకాల రూపాలను ధరించడానికి పూర్వం, బౌద్ధ మతం మౌలికంగా ఒక మతం (Theology) కాకుండా, కేవలం నైతిక బోధన (Ethics)ల సమూహంగా ఉండేదని అనడం అర్థరహితమైందేమీకాదు. ఆ కాలంలో అత్యంతగా భ్రష్టుపట్టి చెడిపోయిన హిందూధర్మం (అంటే బ్రాహ్మణ వాదం) పట్ల గౌతమ బుద్ధుడు ప్రదర్శించిన నిరసనగా, వ్యతిరేకతగా దీన్ని పేర్కొనవచ్చు. ఆ కాలపు బ్రాహ్మణులు సంస్కృతాన్ని తమ ధార్మిక భాషగా చేసుకొని, సామాన్య ప్రజల్ని దోచుకుని లాభపడేవారు. హిందూ ధర్మంలో ఆ కాలంలో యజ్ఞాలు మితిమీరిపోయాయి. ఈ యజ్ఞాల్లో చాలా పెద్దసంఖ్యలో పశువులు అతి కిరాతకంగా వధించబడుతూ ఉండేవి. పశు బలులే కాకుండా, అత్యంత ఖర్చుతో కూడుకున్న ధార్మిక ఆచారాలు హిందూ ధర్మంలో పరిపాటి అయిపోయాయి. దళిత, వెనుకబడిన జాతుల పట్ల అత్యంత ద్వేషం ప్రదర్శించబడేది. గౌతమ బుద్ధుడు చిన్నప్పటినుంచే అత్యంత దయార్ద్ర హృదయుడు, ఎప్పుడూ చింతాయోచనల్లో మునిగి ఉంటుండేవాడు. స్వతహా గానే ఆయన దౌర్జన్యానికి వ్యతిరేకి. సంస్కరణా స్వభావం కలిగి ఉన్నవాడు. ఆయనకైతే అన్నిరకాల సుఖసౌఖ్యాలు ప్రాప్తమై ఉన్నాయి కాని రోగుల్ని, వృద్ధుల్ని, మృతుల్ని చూసి ప్రపంచం పట్ల ఆయనకు వైరాగ్యం కలిగింది.

కనుక ఒకరోజు ఆయన ఇంటిని, భార్యాపిల్లల్ని వదిలేసి వెళ్ళిపోయారు. కఠోర తపస్సు తరువాత ఆయనకు జ్ఞానోదయం అయింది. కోరికే దు:ఖానికి కారణమని, ముక్తి కోసం దీన్ని త్యజించాల్సి ఉంటుందని ఆయన ప్రకటించారు. దేవుని పేరు మీద అత్యధిక సంఖ్యలో పశుబలులకు వ్యతిరేకంగా వైదిక ధర్మం ముసుగులో నిమ్నజాతులపై జరుగుతున్న దౌర్జన్యానికి వ్యతిరేకంగా ఆ జాతుల పట్ల ప్రేమ వాత్సల్యాలకై అహింసను ప్రేరేపించారాయన. తన నైతిక బోధనల

ప్రచారం కోసం ఆయన వ్యవహారిక భాషను ఉపయోగించారు. వేదాల్ని తిరస్కరించారు. 'దేవుని పేరు మీద జరిగే దౌర్జన్యాలకు ప్రతిచర్యగా ఆయన తన ధర్మంలో దేవునికే ఎలాంటి స్థానం ఇవ్వలేదు. హిందూ ధర్మంలో సంస్కరణ జరగాలనేది గౌతమ బుద్ధుని లక్ష్యమే అయినప్పటికీ, దీనికోసం ఆయన నైతిక విలువల సహాయం తీసుకున్నాడనే విషయాన్ని ఇక్కడ గుర్తుంచుకోవాలి. కాని ఒకవిధంగా చూస్తే ఆయన ఆలోచనల్లో, హిందూ ధర్మం విశ్వాసాల పట్ల ఆయనకు మౌలికమైన వ్యతిరేకత ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకనే హిందూ మతానికి వ్యతిరేకంగా బౌద్ధ మతం ఒక స్వతంత్ర మతం రూపంలో బయల్పడింది. గౌతమ బుద్ధుడు స్వయంగా రాజకుటుంబానికి చెందిన వ్యక్తి. అందుకని ప్రజలపై ఆయన వ్యక్తిగత ప్రభావం పడటం అనివార్యమే. దీనికితోడు నిమ్నజాతుల పట్ల కనికరం, ప్రచారం కోసం వ్యవహారిక భాషను ఉపయోగించడం వలన, స్వల్ప వ్యవధిలోనే ఆయనకు విజయం లభించింది. ప్రజలు ఆయనకు అనుచరులుగా మారారు. ఆయన తన ధర్మాన్ని ఒక ప్రబోధన, సందేశ ధర్మం (Missionary Religion) గా రూపొందించారు. ముందు కాస్తా తటపటాయించినా, చివరికి స్త్రీలకు కూడా ఆయన తన ధార్మిక వ్యవస్థలో ప్రచారం కోసం స్థానమిచ్చారు. ఆయన గృహస్థులైన ప్రజల కోసం, భిక్షకులైన స్త్రీ పురుషుల కోసం వేరువేరు నియమాలను ఏర్పరిచారు. ఆయన తరువాత, రాజ్య సంరక్షణ పొంది బౌద్ధ ధర్మం బాగా వ్యాపించిపోయింది. అశోక చక్రవర్తి, కనిష్కుడు, హర్షవర్ధనుడు దీని ప్రచారంలో గొప్ప సహాయ సహకారాలందించారు. ఈ చక్రవర్తుల ధార్మిక ప్రచారంతో ఉత్తేజం పొంది, బౌద్ధ ధర్మం భారతదేశం ఆవల కూడా వ్యాపించింది. దీన్ని ఎదుర్కొనే వేరొక ప్రముఖ ధర్మం అక్కడ లేకపోవడం దీని వ్యాప్తికి ఇంకొక కారణం. కాలం గడిచిన కొద్ది బౌద్ధ ధర్మంలో ఎంతగా చెడు ప్రవేశించిందంటే, భారతదేశంలో దాని క్షీణత ప్రారంభమయింది. భిక్షువులైన స్త్రీ, పురుషుల్లో వ్యభిచారం ప్రాకిపోయింది. రాజ్య

సంరక్షణ సమాప్తం కాగానే ఇంకా వేరే చారిత్రాత్మక కారణాల మూలంగా, తన జన్మస్థలంలోనే బౌద్ధ ధర్మం సమాప్తమైపోయింది. టిబెట్‌లో కూడా అకస్మాత్తుగానే ఇది పతనమైపోయింది. ఇంకెక్కడైనా బౌద్ధ ధర్మం మిగిలి ఉన్నా, అది అచేతనావస్థలోనే ఉంది. అందులో ఎలాంటి బలంగాని, శక్తిగాని లేవు. భారతదేశంలో, అంటే తన జన్మస్థలంలోనే అది అభివృద్ధి శిఖరాల కెగసి ఒకేసారి అకస్మాత్తుగా కానరాకుండా పోయిన నేపథ్యంలో, బౌద్ధ ధర్మం యొక్క ప్రయోజనం కలిగించే యోగ్యత, దాని శక్తిసామర్థ్యాలు ఏపాటివో ఊహించ వచ్చు. విగ్రహారాధనను స్వయంగా గౌతమ బుద్ధుడే వ్యతిరేకించాడు. కొంత కాలం గడిచిన తరువాత ఆయన అనుచరులు, ఆయన్ను దైవంగా విశ్వసించి, ఆయనదో మూర్తి (విగ్రహాన్ని) తయారుచేసి పూజించనా రంభించారు. ఏ మూఢాచారాలకు వ్యతిరేకంగా గౌతమ బుద్ధుడు ఉద్యమాన్ని నడిపాడో, ఆ మూఢాచారాలు హిందూధర్మం కంటే అధికంగా బౌద్ధుల మహాయాన తెగలో, టిబెట్‌లోని లామావాద వర్గంలో చొరబడ్డాయి. బౌద్ధ ధర్మంలోని కొన్ని ఆకర్షణీయమైన అహింసా లాంటి సిద్ధాంతాల్ని, హిందూ ధర్మంలో విలీనం చేసి బ్రాహ్మణులు, అత్యంత చాకచక్యంతో గౌతమ బుద్ధునికి తమ ధర్మంలో అవతార పురుషుని స్థానమిచ్చి ఎంతోయుక్తిని ఉపయోగించి భారతదేశం నుండి బౌద్ధ ధర్మాన్ని సమాప్తం చేసేశారు.[11]

అతి స్వల్ప వ్యవధిలో ఇస్లాం ఒక విశ్వవ్యాపిత ధర్మంగా రూపొందటం చరిత్రలో ఒక మహత్యమైతే, బౌద్ధ మతం తన జన్మస్థానంలో ఇంత శీఘ్రంగా, అకస్మాత్తుగా సమాప్తమైపోవటం ఇంకొక వింతగా పేర్కొనవచ్చు. దైవభీతికి బదులు, వృద్ధాప్యం, వ్యాధి, మరణాల భీతి పునాదులపై బౌద్ధ మతం పైకొచ్చింది. పునాదులు లేకుండా ఒక సౌధాన్ని నిర్మించటమనేది ఒక కల, ఊహ

---

*11. దీనితోపాటుగా శంకరాచార్యులు, బౌద్ధ ధర్మానికి వ్యతిరేకంగా ఉద్యమం నడిపి భారతదేశం నుండే దీన్ని సమాప్తం చేసేశారు.*

తప్ప ఇంకేమీ కానట్లే దైవభావన, దైవ ఉనికి అనే పునాదులు లేకుండా ఏ ధర్మమూ నిలదొక్కుకోజాలదు. బౌద్ధ ధర్మానికి పది నైతిక నియమాలున్నాయి. 1) అహింస 2) సత్యం 3) దొంగతనానికి దూరంగా ఉండటం 4) బ్రహ్మచర్యం 5) అపరిగ్రహము (ధన వస్తువుల్ని త్యజించటం) 6) సంగీత, నృత్యాలను త్యజించటం 7) అలంకరణ, సింగారం, ఫలాలు, సువాసన కలిగిన తైలాల్ని త్యజించటం 8) సమయంగాని సమయాల్లో భోజనం మానేయటం 9) మెత్తని పరుపును త్యజించటం 10) అందమైన స్త్రీలతో పడుకోవటాన్ని త్యజించటం.[12]

ఈ నియమాలు అత్యంత కఠినమైనవిగాను (కొన్నింటిని మినహాయించి) మానసికేతరమైనవిగాను నిరూపితమయ్యాయి. ఇంకా బౌద్ధ ధర్మంలో దైవాన్ని నిరాకరించటం వల్ల ఈ నియమాల్లో దాగివున్న నైతిక విలువలు నిరర్థకమై పోయాయి. దీనికి కారణం కూడా స్పష్టమైనదే. దైవభీతి లేకుండా ఈ నైతికతలను ఆచరించటం అసంభవమేకాదు, కేవలం వదురుడు మాత్రమే. దైవాన్ని విశ్వసించని ధర్మం, నిరాశావాదాన్ని సమర్థించే ధర్మం మనిషికి, మానవ సమాజానికి సంక్షేమ సాఫల్యాలను ప్రసాదించటంలో ఎంతవరకు సహకరిస్తుంది? అనేది ఒక సామాన్య మనిషి కూడా అర్థం చేసుకోగలడు. మానవునికి, మానవజాతికి, తమ ఉనికి కోసం పరిశ్రమించటం (Struggle for existence) అనివార్యం. అర్హమైనది,ఉపయుక్తమైనదే మనగలుగుతుంది (Survival of the fittest) అనేది ఒక వైజ్ఞానిక సత్యం. బక్తియార్ ఖిల్జీ కేవలం కొద్దిమంది సైనికులతో మాత్రమే వస్తున్నాడని తెలియగానే, బీహారును పాలిస్తున్న ఆ కాలపు బౌద్ధ రాజు కాలికి చెప్పులు కూడా వేసుకోకుండా రాజధాని

12. *జీవితాంతం బ్రహ్మచర్యాన్ని పాటించాలని బోధించే నియమాలు కలిగిన ధర్మం మానవ నైజానికే విరుద్ధమైనది. దైవంపై విశ్వాసం కలిగి ఉన్నప్పటికీ అది మానవులందరి ధర్మం కాజాలదు. అలాగైతే అది స్థిరంగా ఉండజాలదు. అంతేకాక ఈ నియమాలను పరిపూర్ణంగా ఆచరించటం కూడా అసంభవమే.*

నుండి పలాయనం చిత్తగించాడు. అదే విధంగా చైనా దాడి జరిగినప్పుడు, టిబెట్ తరఫున ఏమాత్రం ఎదుర్కోకపోవడం అన్నది జీవిత ప్రయత్నం (పరిశ్రమ)లో బౌద్ధ ధర్మం యొక్క అయోగ్యతకు చారిత్రక సాక్ష్యం. నాస్తికత్వం (Atheism), నిరాశావాదం (Pessimism) మానవ జాతి సంక్షేమ సాఫల్యాల కోసం ఎలాంటి గ్యారంటీ ఇవ్వవు. నైతికతల ప్రయోజనం రీత్యా లేక జీవన పోరాటంలో విజయం సాధించటానికి అవి ఏవిధంగాను లాభదాయకం కావు.[13]

---

13. *లోతుగా ఆలోచిస్తే, అసలు బౌద్ధమతం, మతాల కోవలోనికే రాదు. దేవుడు, దేవుని ద్వారా ప్రసాదించబడిన జ్ఞాన విశ్వాసాలే ఓ మతానికి మూల స్తంభాలు. గౌతమ బుద్ధుడు హిందూ ధర్మానికి చెందినవాడైనప్పటికీ ఆయన దేవుణ్ని, వేదాల్ని విశ్వసించడానికి నిరాకరించాడు. అందుకని ఈ దైవ నిరాకరణ, వేదాల నిరాకరణ ఆయన మతానికి అసలైన పునాదులు. అలాంటప్పుడు ఆయన తపస్సు, చింతా యోచనలకు అర్థం ఏమిటి? అంతేకాదు, ఈ తపస్సు చింతాయోచనల ద్వారా ఆయనకు ఏ జ్ఞానోదయమైతే కలిగిందో, అది ఎవరి ద్వారా? ఎక్కడి నుంచి కలిగింది? విద్యాజ్ఞానాల ఉత్పత్తి స్థానం దేవుడే. అయితే, గౌతమ బుద్ధుడు దేవుణ్ని అంగీకరించలేదు, దైవాన్ని ఆరాధించమనీ బోధించలేదు. నిజానికి ఈ వాస్తవాలే జీవిత సంక్షేమం, సాఫల్యం, పరలోక జీవితంలో ముక్తికి ఆధారాలు. ఈ ముఖ్య విషయాలే గౌతమ బుద్ధుని బోధనల్లో కనిపించవు.*

*ప్రపంచాన్ని త్యజించటం, బ్రహ్మచర్యం– ఇదే బౌద్ధ ధర్మం అసలు బోధనలు. ఈ బోధనల్ని అనుసరించి విశ్వం, దాని జననమే అర్థరహితం. ఇలాంటి మతం సకల మానవ జాతి మతం కాజాలదు. మానవ జీవిత నియమాల్ని పరిపూర్ణంగా పరివేష్టించి ఉన్నదే సర్వమానవుల పరిపూర్ణ ధర్మం కాగలుగుతుంది. అందులో ఈ ప్రపంచ జీవితానికి సంబంధించిన నియమాలూ ఉండాలి. పరలోకానికి సంబంధించిన బోధనలూ ఉండాలి. అంతేకాదు, ఈ రెండు రకాల బోధనల్లో పరస్పరం సంబంధం, సమతౌల్యమూ ఉండాలి. బౌద్ధ మతం ఒక రకమైన విధానం మాత్రమే. గౌతమ బుద్ధుడు సత్స్వభావం, దయార్ద్ర హృదయం గల మనిషి, ఆయన*

కాలంలో మతాన్ని అక్రమంగా వాడుకుంటూ ఉండేవారు. కృత్రిమమైన, ఆడంబరమైన కార్యాలే నలువైపులా వ్యాపించి ఉండేవి. నైతికతలు, నడవడికలు ప్రయోజనం లేనివైపోయాయి. ఇవన్నీ కూడా మతం పేరుతోనే జరిగేవి. ధార్మిక వర్గాలు కూడా ఇలాంటి పాత్రనే పోషించేవి. దేవదాసీల రూపంలో యువతుల్ని దేవతల పేరు మీద మందిరాలకు అప్పగించడం, వారి నాట్యగానాలు, రుచికర పదార్థాల్ని సమర్పించడం, గంజాయి, భంగు లాంటి మత్తు పదార్థాల సేవనం లాంటివి ధార్మిక కార్యకలాపాలుగా పరిగణింపబడినప్పుడు ధర్మానికి పవిత్రత, గౌరవనీయత ఎక్కడుంటుంది? ఇదేగాక యజ్ఞాలు, అత్యధిక సంఖ్యలో పశువుల బలి– ఈ పరిస్థితులన్నీ కలిసి గౌతమ బుద్ధుడ్ని మత వ్యతిరేకిగా మార్చేశాయి.

ధర్మంలో భౌతికత్వం ప్రవేశించిందని గౌతమ బుద్ధునికి అనిపించింది. అందుకని ఆధ్యాత్మికతను ఆయన తన పద్ధతికి పునాదిగా ఏర్పరిచారు. ప్రపంచాన్ని త్యజించడం, బ్రహ్మచర్యం, సహృదయం, ప్రేమ, అభిమానం, మృదువర్తనం, వాత్సల్యాల ప్రచారం ప్రారంభించారు. సమాజంపై దీని ప్రభావం అత్యధికంగా పడింది. బౌద్ధ ధర్మం భారతదేశం నుండి ఇతరదేశాలకు వ్యాపించినప్పుడు, అక్కడ కూడా దానికి ఘన స్వాగతం లభించింది. అయితే ఈదేశాలన్నీ కూడా అనేక దేవుళ్ళను పూజించే దేశాలే. బౌద్ధ ధర్మం వారి భావనలు, విశ్వాసాలతో సంధి చేసుకుంటూ పోయింది. చివరికి జరిగిందేమిటంటే– వారు కూడా స్వయంగానే బౌద్ధ ధర్మస్థాపకుడైన గౌతమ బుద్ధుని విగ్రహాన్ని మలిచి పూజించనారంభించారు. దేవదాసీల, దైవపూజారుల కలయిక వల్ల ఏ ఫలితం అయితే బయల్పడిందో, ఈ బ్రహ్మచారులు, భిక్షువులు, భిక్షకురాళ్ల కలయిక వల్ల కూడా అదే ఫలితం బయటపడింది. దీనివల్ల కూడా బౌద్ధధర్మ గౌరవానికి పెద్ద దెబ్బే తగిలింది. ఆ తరువాత శంకారాచార్యులు బాహాటంగా ఒక ఉద్యమాన్నే లేపి, బౌద్ధ ధర్మాన్ని భారతదేశం నుంచి బహిష్కరించారు. బౌద్ధ విహారాలను నేలమట్టంగావించారు. ఈవిధంగా ఆ కాలంలో నేలమట్టమైన మందిరాల కూల్చివేత నేరం నేడు భారతదేశాన్ని పరిపాలించిన ముస్లిం పాలకుల నెత్తిన రుద్దడం జరుగుతోంది.

బౌద్ధ ధర్మంలో ఇంకెన్నో బలహీనతలున్నాయి. గౌతమ బుద్ధుడు దేవుణ్ణే విశ్వసించనప్పుడు, మరి ఈ విశ్వసృష్టి ఎలా జరిగింది?ఎవరి ద్వారా జరిగిందనే

ప్రశ్న ఉదయిస్తుంది. ఆయన చేసిన ఆరాధన లేక తపస్సుకు అర్థం ఏమిటనేది రెండవ ప్రశ్న. ఆరాధనా లేక తపస్సు అనేది దైవాన్ని నమ్మే కదా చేసేది! ఇక మూడవ ప్రశ్న, దేవుడే విద్యాజ్ఞానాలకు ఉత్పత్తి స్థానం అయితే, గౌతమ బుద్ధుడు దేవుణ్నే విశ్వసించనప్పుడు ఆయనకు అబ్బిన విద్యాజ్ఞానాలకు పునాది ఏది? ఆయనకు ఈ జ్ఞానోదయం ఎవరి ద్వారా, ఎలా ప్రాప్తమయింది? ఏ సన్నివేశాలను చూసి ప్రభావితుడై, ఆయన ప్రపంచ సౌఖ్యాలను విడనాడాడో, వాటి ప్రకారమే ఆయన కొన్ని నియమాలను నిర్ణయించాడు. ఇవి పూర్తిగా ప్రపంచ త్యాగం, బ్రహ్మచర్యంపై ఆధారపడ్డవే. ఇలాంటి ధర్మం పూర్తి జీవిత ధర్మమూ కాజాలదు. దాని నియమాలననుసరించి జీవితం గడపడమూ సాధ్యపడదు. ఇక నాలుగవ ప్రశ్న ఏమిటంటే, మత సిద్ధాంతాల ప్రకారం శరీరంతోపాటు శరీరాన్ని కలిగిన వ్యక్తిత్వమూ నశించిపోతుంది. శిక్షా బహుమానాల సిద్ధాంతం ప్రకారం రెండవ శరీరం ఉనికిలోనికి వస్తుంది. ఇక అదే నిజమైతే నిర్యాణం, ముక్తి లేక మోక్షానికి అర్థమేమిటి??



# 6. క్రైస్తవం

మహనీయ ఏసుక్రీస్తుపై దైవం తరఫున అవతరించిన ఇంజీల్ (బైబిల్) దైవ బోధనలే క్రైస్తవానికి మూలాధారంగా ఉండేవి. యూదుల ధార్మిక గ్రంథం 'తోరా' (Tora)లో మార్పులు చేర్పులు జరిగాయి. మహనీయ మూసా(అలై) (మోజెస్) ప్రవక్త బోధనల నుండి యూదులు ఎంతో దూరమైపోయారు. వారిలో వ్యాపించిపోయిన ఈ రుగ్మతల్ని దూరం చేయడానికి ఏసుక్రీస్తు దైవప్రవక్తగా, దైవసందేశ వాహకునిగా అరుదెంచారు. ఇంజీల్ (బైబిల్) గ్రంథం 'తోరా' గ్రంథం యొక్క సంస్కరించబడిన గ్రంథంగా ప్రపంచానికి లభించింది. ప్రపంచ సాఫల్యం కోసం మహనీయ ఏసుక్రీస్తు ఆశ్చర్యకరమైన త్యాగాలు చేశారు. ఆయన కోరిన సాఫల్యం ఆయన బ్రతికుండగా లభించనప్పటికీ, ఆ తరువాత క్రైస్తవం ఒక విశ్వవ్యాపిత ధర్మంగా, స్థాపిత మతంగా ప్రసిద్ధిగాంచింది. కన్య అయిన 'మేరీ' గర్భాన జన్మించారాయన. దైవ మహత్యాలపై విశ్వాసం ఉంచేవారు, దీన్నో మహిమగా అంగీకరిస్తారు, తప్పకుండా అంగీకరించాలి కూడా.

ఆది మానవుని సృష్టి విజ్ఞాన శాస్త్రం కోసం ఒక చిక్కుముడిగానే మిగిలిపోయింది. ఇదేవిధంగా ప్రతి వస్తువు యొక్క ప్రథమ బీజము, ఫలము లేక మూలము కూడా సైన్సుకు ఎదురయ్యే ఒక చిక్కు ప్రశ్నే. అయితే ధర్మాన్ని నమ్మేవారు దీన్ని దేవుని అద్భుత కార్యంగా విశ్వసిస్తారు. అతి ప్రాచీనమైన హిందూధర్మం కూడా ఇలాంటి పుట్టుకనే సమర్థిస్తుంది. స్వయంగా శంకరుడు కూడా తల్లిదండ్రులు లేకుండానే జన్మించాడు. అయితే ఆయనకు కార్తికేయుడు, వినాయకుడు అనే ఇద్దరు కుమారులుండేవారు. శ్రీకృష్ణునికి బంధువు అయిన 'కుంతీదేవి'కి కన్యత్వంలోనే కర్ణుడనే కొడుకు లభించాడు. ఇలాంటి జననాలన్నీ కూడా హిందూధర్మంలో పవిత్రమైనవిగా అంగీకరించబడతాయి. ఏసుక్రీస్తు

నిస్సందేహంగా దైవ సందేశహరుడు అయినప్పటికీ క్రైస్తవంలో చెడులు చోటుచేసుకున్నాయి. హిందువుల్లోని త్రిత్వం (Trinity) బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు కన్నా కూడా క్రైస్తవుల్లోని త్రిత్వం (దేవుడు, దైవకుమారుడు, పరిశుద్ధాత్మ) అత్యంత హేయకరమైనది. హిందువుల్లో వ్యాపించిపోయిన ఈ త్రిత్వం నిజానికి మౌలికంగా దేవుని యొక్క గుణవాచక నామాలై ఉండేవి. బ్రహ్మ (సృష్టికర్త- Creator) అంటే విశ్వాన్ని సృష్టించినవాడు, విష్ణు (Protector) అంటే విశ్వానికి ప్రభువు, పోషకుడు. మహేశ్వరుడు (Destroyer) అనగా విశ్వాన్ని సమాప్తం చేయువాడు. కాలక్రమేణా జైనుల సాంగత్యం వల్ల, హిందువుల్లో విగ్రహారాధన (మూర్తి పూజ) మొదలయింది. అప్పుడు ఈ ముగ్గురికి శారీరకంగా రూపాలు కల్పించబడ్డాయి. యదార్థమేమిటంటే, మౌలికంగా అవి నిరాకారుడు అయిన దేవుని గుణవాచక నామాలే. అంటే దేవుని యొక్క గుణాల్ని సూచించే పేర్లు. కాని క్రైస్తవుల్లోని త్రిత్వం, నిరాకారుడైన దేవుని గుణవాచక నామాలు కాకుండా, స్వతంత్రమైన శాశ్వత ఉనికిని కలిగివున్నాయి. ఏసుక్రీస్తు దేవుని కుమారుడనే భావన, హిందువుల్లోని 'అవతారవాద' భావననే పోలి వుంది. ఈ భావన, విశ్వాసం కారణంగానే క్రైస్తవం ఏకేశ్వరవాదం నుంచి దూరమైపోయింది. దీని ఫలితంగా హిందూధర్మంలో చొరబడినట్లే మూఢాచారాలు, విగ్రహారాధనల్లాంటి చెడులు క్రైస్తవంలో ప్రవేశించాయి. కాలక్రమేణా 'మేరిమాత' యొక్క ఆరాధన సైతం చేరిపోయింది. ఇక కేవలం ఏసుక్రీస్తుపై విశ్వాసం, పాపపరిహారంపైనే అత్యధికంగా శ్రద్ధచూపడం జరుగుతోంది. మరణానికి ముందు, క్రైస్తవ మతగురువు సమక్షంలో పాపాల్ని అంగీకరించటమే ముక్తికి ఆధారంగా ఒప్పుకోబడింది. పౌరాణిక హిందూధర్మంలాగానే, క్రైస్తవంలో కూడా దేవుడ్ని ప్రథమ (Primary) స్థానం నుంచి ద్వితీయ (Secondary) స్థానానికి దిగజార్చడం జరిగింది. క్రైస్తవంలో నైతికతలపై అతి తక్కువ శ్రద్ధ చూపటం

జరిగింది. ఈ కారణంగానే అమెరికా, ఐరోపా దేశాల్లో మద్యపాన సేవనం, జూదం, వ్యభిచారం[14] శిఖరాన్నందుకున్నాయి. ఆఫ్రికాలో తెల్లజాతి, నల్లజాతి క్రైస్తవుల్లో బేధభావం, నల్లజాతి క్రైస్తవులపై తెల్లజాతి క్రైస్తవుల దౌర్జన్యాలు, హిందువుల్లో శూద్రులపై జరిగే దౌర్జన్యాల్లాంటివే. హిందూ ధర్మంలాగానే, క్రైస్తవంలో కూడా సామాజిక దృక్పథం, సమానత్వం, సోదరత్వ భావనల్ని సృష్టించే యోగ్యత, శక్తిలేకుండాపోయాయి. అందుకోసమే గడిచిన అన్ని ధర్మాల్లో చోటుచేసుకున్న రుగ్మతల్ని దూరపరిచి, సర్వజనులకు సంక్షేమ సాఫల్యాలు సమకూర్చడానికై దైవం తన అంతిమ ప్రవక్త ముహమ్మద్(స)ను ఈ ప్రపంచానికి పంపించాడు. ఖుర్‌ఆన్ ద్వారా ఇవ్వబడిన అంతిమ మరియు సందేహాలకు తావులేని దైవబోధనల ద్వారా, ప్రపంచంలో వ్యాపించివున్న సర్వ రుగ్మతలు, చెడులు, బలహీనతలు శాశ్వతంగా దూరమైపోవాలనేది దైవాభీష్టం.



---

*14. ఇకిప్పుడైతే స్వలింగ సంపర్కం (Homo Sexuality and lesbianism), దానికి సంబంధమున్న వారిలో పరస్పర వివాహాలకు కూడా సామాజిక పరంగాను, చట్టపరంగాను అనుమతించడం జరుగుతున్నది. (ప్రకాశకులు)*

# 7. ఇస్లామ్

ఇస్లామ్ విలువను, దాని ప్రాముఖ్యాన్ని సమీక్షించే ముందు దైవాదేశాలు ఖుర్‌ఆన్ రూపంలో ఎవరి ద్వారానైతే చివరిగా ఈ లోకానికి పరిచయం చేయ బడ్డాయో, ఆ ఇస్లాం ప్రవక్త అయిన ముహమ్మద్(స) వారి వ్యక్తిత్వంపై ఒకసారి దృష్టి సారించడం ఎంతో అవసరం. శ్రీరామచంద్రుడు, గౌతమ బుద్ధుడు, మహావీరుని లాగా ముహమ్మద్(స) ఏదో ఓ రాచకుటుంబంలోనో జన్మించలేదు. ఆయన జన్మించినందుకు సంబరాలూ జరుపుకోబడలేదు. ఆయన పోషణ సుఖభోగాల వాతావరణంలోనూ జరుగలేదు. అంతేకాదు- విద్యాబుద్ధులకు సంబంధించి కూడా ఆయన గారికి ఎలాంటి ఏర్పాట్లు జరుగలేదు. తల్లి గర్భంలో ఉండగానే ఆయన తండ్రి పరమపదించారు. ఆరు సంవత్సరాల ప్రాయానికి చేరగానే తల్లిని కూడా పోగొట్టుకున్నారు. ఎనిమిది సంవత్సరాల వయసులో తాతగారి నీడ కూడా కరువైపోయింది. కేవలం బాబాయి అయిన అబూతాలిబ్ ఆయనపై దయ, వాత్సల్యాలు కనబరిచారు. ఈ విధంగా ఆయన విద్యా సంస్కారాలకు, సుఖ సౌఖ్యాలకు అస్సలు నోచుకోనే లేదు. నలభై సంవత్సరాల వయసు వచ్చేవరకు ఆయన నిరంతర నిజాయితీగా, సత్య సంధతతో, సచ్ఛీలమైన జీవితం గడుపుతూ సాదిక్ (సత్యసంధుడు), అమీన్ (నిజాయితీపరుడు) అనే పేర్లతో పిలువబడ్డాడు. ప్రారంభం నుంచి దైవదౌత్య బాధ్యత చేపట్టేవరకు, ఆ తరువాత ఇస్లామీయ ధర్మాన్ని పరిపూర్ణంగా స్థాపించి నప్పటినుంచి పరమపదించే వరకు ఆయన నిరక్షరాసే. నలభై సంవత్సరాల వయసులో ఆయనకు దైవజ్ఞానం ప్రాప్తమయింది. అందరికంటే ముందుగా ఆయన సతీమణి ఖదీజా, పిన్న వయస్కుడైన బాబాయి కుమారుడు అలీ, బానిస జైద్, ఆయన మిత్రుడైన అబూబకర్(ర)లు ఆయన బోధనలకు ప్రభావితులై ఇస్లాం స్వీకరించారు. ఆ తరువాత ఆయన దగ్గరి సంబంధం గల వాళ్లు ఇస్లాం

ధర్మాన్ని స్వీకరించనారంభించారు. దీనితోపాటుగా అవిశ్వాసుల వ్యతిరేకత కూడా పెరుగుతూ పోయింది. ఆ వ్యతిరేకత రోజురోజుకు తీవ్రం కాసాగింది. అరేబియా దేశపు రాజు హెూదాను కట్టబెడతామని, ఇలాంటివే రకరకాల ఆశలు, ప్రలోభాలు చూపినప్పటికీ ఆయన తన సత్యధర్మ ప్రచారాన్ని నిలిపి వేసేందుకు అంగీకరించలేదు. దానికి వారు ఆయన్ను, ఆయన అనుచరుల్ని రకరకాలుగా హింసకు గురిచేయసాగారు. చివరికి ఈ హింసా దౌర్జన్యాలు ఎంతగా పెరిగిపోయాయంటే, ఆయన అనుచరులు తమ దేశాన్ని విడిచి విదేశమైన అబిసీనియా (Ethopia)కు వెళ్ళి తలదాచుకోవాల్సి వచ్చింది. అక్కడ కూడా వారి వ్యతిరేకులైన ఖురైష్ వర్గీయులు వారిని వెంబడించటం మానుకో లేదు. కాని అక్కడి పరిపాలకుడే (నజాషి పేరుతో ప్రఖ్యాతిగాంచిన క్రైస్తవ రాజు) ఇస్లామీయ ధర్మం యొక్క సత్యానికి ప్రభావితుడై, ఈ ముస్లిం శరణార్థులను ఖురేష్ వారికి అప్పగించ నిరాకరించాడు.

ఇక ఇటు మక్కా నగరంలో ప్రవక్త, ఆయన అనుచరులపై హింసా దౌర్జ న్యాలు తారాస్థాయికి చేరుకున్నాయి. చివరికి ప్రవక్తను కూడా హతమార్చటానికి కుట్ర జరిగింది. దైవాదేశాన్ని అనుసరించి ఆయన మక్కా విడిచి మదీనాకు వలసపోవలసి వచ్చింది. ఈ సంఘటనను ఇస్లామీయ పరిభాషలో 'హిజ్రత్' అని అంటారు. అంటే ధర్మాన్ని రక్షించుకునేందుకు మాతృభూమిని సైతం విడిచి పెట్టడం అన్నమాట. కాని అక్కడ కూడా ఈ ఖురైషీ వారు ముస్లింలను నిశ్చిం తగా కూర్చుండనివ్వలేదు. వారిపై సాయుధ దాడులు మొదలయ్యాయి. ఈ పరిస్థితుల్లో ప్రవక్త, ముస్లింలకు ఖుర్ఆన్ ఆయత్‌ల ద్వారా, తమ సంరక్షణార్థం వారినెదుర్కొని, యుద్ధం జరపాల్సిందిగా దైవం ఆదేశాలను అవతరింప జేశాడు. చివరికి అతి స్వల్ప వ్యవధి అనగా హిజ్రత్ తరువాత కేవలం తొమ్మిది సంవత్సరాల్లోనే మొత్తం అరేబియా దేశమే దైవప్రవక్త(స), ఇస్లాం అధీనంలోకి వచ్చేసింది. అంటే అరబ్బుజాతి, నిరక్షరాస్యత, విశృంఖలత్వం, మూఢాచారం,

జూదం, దోపిడీ దొంగతనాలు, వ్యభిచారం, చివరికి తండ్రి చనిపోతే సవతి తల్లితో సైతం వివాహం చేసుకునే ఆచారం, మదుసేవనం, కొట్లాటలు, కలహాలు, విధ్వంసాలు, కుమార్తెల్ని సంహరించటం, వంచన, మోసం, దౌర్జన్యం, క్షోభ, స్త్రీల పట్ల కిరాతకం, బానిసల పట్ల దౌర్జన్యం, అనాధల హక్కుల్ని కొల్లగొట్టడం, విగ్రహారాధన- ఇంకా ఇలాంటివే అసంఖ్యాక నైతిక, భౌతిక రుగ్మతల్లో పీకలదాకా కూరుకుపోయిన తరుణంలో ప్రవక్త మహ నీయులు దైవదౌత్యం చేపట్టిన ఇరవై సంవత్సరాల స్వల్ప వ్యవధిలోనే, ఇస్లామీయ ధార్మిక బోధనల ఫలితంగా ఏకేశ్వరవాదిగాను, సత్యధర్మాన్ని తు.చ తప్పకుండా అనుసరించేవర్గంగాను మారిపోయింది. అయితే ఇలాంటి శీలరహితమైన పీకలదాకా పాపాల్లో కూరుకుపోయిన జాతిని ఇతర మతగ్రంథాలు రాక్షసులుగా పిలిచి ఏ దేవత ద్వారానో, ఏ అవతారం ద్వారానో సంహరించి సమాప్తం చేశారని వర్ణించి వుండేవి. కాని పాపాల్లో కూరుకు పోయిన ఇలాంటి జాతిని, సర్వనాశనం చేయకుండా, ఈ పాపాత్ముల పాపాల్ని నాశనం చేయటం ఒక చారిత్రక మహాత్యం. ఇది చరిత్రలో ప్రవక్త ముహమ్మద్(స) ద్వారా మాత్రమే సాధ్యమైంది. ఈవిధంగా 'పాపులను కాకుండా, వారి పాపాలను మాత్రమే ద్వేషించండి' అనే లోకోక్తిని, ఇస్లాం ఆధారంగా దైవప్రవక్త క్రియారూపంలో ఆచరించి మరీ చూపారు. క్లుప్తంగా చెప్పాలంటే, నేరప్రవృత్తి మనస్తత్వం కలిగి, మొండి (Chronic) వ్యాధికి గురై ఉన్న ఈ అరబ్బుజాతిని ఆయన స్వల్ప కాలంలోనే సంపూర్ణ ఆరోగ్యవంతమైన జాతిగా మార్చేశారు. సామూహిక నేర ప్రవృత్తి, నేర మనస్తత్వం కలిగిన వీరికి సంపూర్ణ స్వస్తతను చేకూర్చారు. అరబ్బు జాతి సర్వాయవాల్లో వ్యాపించిపోయిన ఈ వ్యాధి ఆ జాతిలోనే జన్మించిన ఒక వైద్యుని ద్వారా దూరం కావటం ఒక అపూర్వమైన చారిత్రక మహాత్యంగా పేర్కొనవచ్చును. నేర మనస్తత్వం కలిగి, పాపపంకిలంలో కూరుకుపోయిన జాతిలోనే ఆ వైద్యుడు ఉధ్భవించినప్పటికీ,

ఆలోచనా వాక్కాయకర్మలలో వారికి పూర్తిగా భిన్నంగా ఉండేవాడు. ఇస్లాం నైతికతలతో రూపొందించిన ఓ దివ్యౌషధం. ఇలాంటి రుగ్మతల్లో, వ్యాధుల్లో చిక్కుకుపోయిన ఏ జాతి అయినా సరే, దానికి వెంటనే తగిన చికిత్స చేయటానికి ఇదొక పరీక్షించబడిన రిజిష్టర్డ్, పేటెంట్ అయిన తిరుగులేని చిట్కా (Registered and Patent Prescri-ption) అనటంలో ఏమాత్రం సందేహం లేదు. ఇస్లాంకు పూర్వపు అరబ్బు జాతిలో, ఇస్లాం అవలభించిన తరువాత వచ్చిన మహోన్నత, అపురూపమైన మార్పు ఆ జాతి చారిత్రాత్మక పునరుజ్జీవనం (Renaissance)గా పేర్కొన వచ్చు. అన్నిటికీ మించిన ఆశ్చర్యజనకమైన విషయం ఏమిటంటే, దైవప్రవక్త(స) నాయకత్వంతో మక్కా నగరం జయించబడిన రోజున ఒక్క మనిషి కూడా వధింపబడలేదు. (అత్యంత తలబిరుసుతనం గల ఇద్దరు లేక ముగ్గురు తప్ప). దైవప్రవక్త ఆయన అనుచరగణం తమపై జరిగిన హింసా దౌర్జన్యాలకు ఎలాంటి ప్రతీకారం తీర్చుకోకుండానే శత్రువుల నందరినీ వదిలేశారు. ఎంతటి ఔదార్యం, ఎంతటి క్రమశిక్షణ!! యుద్ధంలో విజయానంతరం విజేతల ద్వారా పరాజితులకు ఈ విధమైన సామూహిక క్షమాభిక్షనివ్వటం, చరిత్రలో ఓ సాటిలేని విషయం. దీనికి భిన్నంగా ధార్మిక పురాణ గాథల్లో దేవతలు, అవతారాల ద్వారా, వ్యతిరేకుల భయానక సామూహిక సంహార సంఘటనలు పేర్కొనబడ్డాయి. ఇస్లామీయ ధర్మపు నిర్మల కాంతితో పునీతులైన అరబ్బులు కేవలం తామొక్కరే అజ్ఞానాంధకారాల చీకటి నుండి బయటపడలేదు. తమతోపాటు ఒక్క శతాబ్దంలోపే, అత్యంత శీఘ్రంగా భూమి సువిశాల భాగాల్ని సైతం కళ్లు మిరిమిట్లు గొలిపే ఇస్లామీయ ధార్మిక కాంతితో ప్రకాశవంతం చేయగలిగారు. ధనవంతురాలైన మహిళతో వివాహం జరిగిన తరువాత కూడా ప్రవక్త(స) జీవితంలో ఎలాంటి మార్పు రాలేదు. అంతేకాక దైవదౌత్యం, ప్రావక్త్యం, ఆ తరువాత మొత్తం అరేబియా దేశానికే అధిపతి అయిన తరువాత కూడా ఆయన జీవితంలో రవ్వంత మార్పు రాలేదు.

ఆయన తన పూర్తి జీవితాన్ని అత్యంత నిరాడంబరంగా గడిపేశారు. ఆయన ఎలాంటి పక్షపాతం లేకుండా అన్ని ధర్మాలు, వర్గాల ప్రజల శ్రేయాన్ని కోరేవారు. ఆయన ఎంతటి ఉదార స్వభావుడంటే అప్పు చేసైనా సరే. ఇతరుల అవసరాలు తీర్చేవారు. ఆయన అన్నిరకాల నైతికమైన భౌతికమైన దోషాలకు అతీతుడు. ఆయన ఆపాదమస్తకం సత్యసంధత, నిజాయితీ, శుచిశుభ్రత, పరిశుద్ధత, నిర్మలత, దయ, కనికరాలు, శాంతిశ్రేయాల సందేశకుడు. దానధర్మాలు కరుణామృతాలు వెదజల్లే ఆదర్శమూర్తి. పరుల శ్రేయస్సు,మేలు కోసమే ఆయన జీవించారు. ఆయన ఉపకారం, సాధుత్వాలకు ఒక హద్దూ అంటూలేదు. ఆయనలోని మేలు స్వభావం అపరిమితమైనది. కష్టాలు, శ్రమల్లో గల ఔన్నత్యం కోసం, ప్రజల్లో సమానత్వం, సోదరత్వం, పరస్పర సహకార గుణాన్ని పెంపొందించడం కోసం, ఆయన నిరంతరం కృషి చేశారు. అది యుద్ధ సమయం గాని, శాంతి సందర్భంగాని, ఎల్లవేళలా ఆయన తనకెలాంటి ప్రాముఖ్యత ఇవ్వలేదు. ఎవరికి కూడా అలా ఆలోచించే అవకాశమే ఇవ్వలేదాయన. సమరంలోగాని, శాంతి సమయంలోగాని ఆయన అద్భుతమైన మృదుత్వాన్ని, దయార్ద్రతను, క్షమా గుణాన్నే ప్రదర్శించారు. తమ దైనందిన ప్రైవేట్ జీవితంలో కూడా ఆయన ఎల్లప్పుడూ దైవాన్ని స్మరిస్తూనే ఉండేవారు. సతతం దైవాన్ని గుర్తు చేసుకుం టుండేవారు. ఆయన అందరి కోసం, చివరికి తన శత్రువులకు సైతం శ్రేయ సాఫల్యాలను ప్రసాదించాలని దైవాన్ని వేడుకుంటుండేవారు. రాత్రివేళల్లో తరచుగా నమాజు చేసుకుంటుండేవారు. ఒకసారి ఆయన తన పరుపు మీద లేకపోయేసరికి ఆయన సతీమణి హజ్రత్ ఆయెషా(ర) గారికి ఆయన తన ఇంకొక భార్య వద్ద ఉంటారేమోననే అనుమానం కలిగింది. అయితే ఆమె లేచి చూడగా గదిలో ఆయన గారు భూమికి నొసలు ఆనించి దైవారాధనలో లీనమై ఉన్నారు. అదిచూసి ఆవిడ గారు తనకు వచ్చిన ఆలోచనకు ఎంతగానో నొచ్చు కున్నారు. ఆయన

సంపూర్ణంగా తనను దైవానికి అర్పించుకున్నారు. దైవంపై ఆయనకు అచంచల విశ్వాసముండింది. ఓ సాధారణమైన స్వల్పవిషయానికి కూడా ఆయన దైవాన్నే నమ్ముకునేవారు. కేవలం దైవానికే అర్పితమైన ఆయన ప్రైవేట్ జీవితం, వాస్తవంలో దైవభీతి, ధర్మనిష్ట, నిగ్రహాలతో నిండి ఉండేది. ఆయన జీవితం ఎప్పుడూ 'నీటిపై తేలియాడే తామరాకు' చందంగా ఉండేది. నిజానికి ఇదే సిసలైన తపస్సు, ఆరాధన. ఆయనకు లభించిన సాటిలేని విజయం. ఆయనతెచ్చిన ఇస్లామీయధర్మానికి లభించిన విశ్వవ్యాపిత జన ప్రియత్వం, ఆయన దైవదౌత్యానికి ప్రబల సాక్ష్యం. ప్రారంభంలో ఆయన నిరక్షరాసి కావటం వలన, దైవం ఆయనకు ఖుర్‌ఆన్ లాంటి అనంతమైన జ్ఞాన సంపదతో సత్కరించాడనేది నిరూపిత సత్యం. ప్రవక్త మహనీయులు, ఇస్లామీయ ధర్మం యొక్క ప్రాముఖ్యత, ఔన్నత్యం, దాని విప్లవాత్మక ప్రభావాలు, నిరూపించబడిన చారిత్రక సాక్ష్యాల ద్వారా కూడా దృవీకరింపబడతాయి. ఇస్లామీయ చరిత్రలో 'ఉమర్ ది గ్రేట్'గా ప్రఖ్యాతి గాంచిన ప్రవక్త గారి రెండవ ఖలీఫా అయిన ఉమర్(రజి) ప్రారంభంలో కొన్ని అనుమానాలు, వంశపరమైన ఆచారాల కారణంగా ప్రవక్త గారిని వ్యతిరేకించారు. వ్యతిరేకించడమేకాదు, ఒకరోజు నగ్న ఖడ్గధారి అయి ప్రవక్తగారిని సంహరిస్తాననే ఉద్దేశ్యంతో ఇంటినుంచి బయలుదేరుతారు. కాని మార్గమధ్యలో ఖుర్‌ఆన్‌లోని కొన్ని ఆయత్‌లు ఆయన చెవిన పడగానే ఆయన హృదయం ద్రవించిపోయింది. కళ్ళ ముందు ఏర్పడిన పొరలు తొలగిపోయి కళ్ళ నుండి అశ్రుధారలు ప్రవహించ సాగాయి. వెంటనే ఆయన ప్రవక్తగారి వద్దకు వెళ్ళి చేతనున్న ఖడ్గాన్ని క్రింద పడేసి, ఇస్లాంను స్వీకరించి ప్రవక్త ప్రియశిష్యుల్లో ఒకరుగా చేరిపోయారు. తుఫేల్ బిన్ ఉమర్‌దోసి కథ కూడా ఇలాంటిదే. ప్రవక్త గారి మాటలు చెవుల్లో పడకూడదనే ఉద్దేశ్యంతో ఆయన చెవుల్లో దూదిని కుక్కుకొని కాబా గృహానికి వస్తుండేవారు. కాని ఒకరోజు కాకతాళీయంగా ప్రవక్తగారి నోటినుంచి వెలువడిన కొన్ని

ఖుర్ఆన్ ఆయత్‌లు ఆయన చెవిన పడగానే ఆయన ప్రపంచమే మారిపోయింది. వెంటనే ఆయన ఇస్లాం స్వీకరించేశారు. అనాథగా, నిరాశ్రయునిగా జీవితాన్ని ప్రారంభించి, జీవితాంతం ప్రాపంచిక విద్యలకు నోచుకోకుండా కేవలం దైవజ్ఞానంతో శోభాన్వితులైన ప్రవక్త ముహమ్మద్(స), దౌర్జన్యాల్ని సహిస్తూ కూడా ఆ దౌర్జన్యకారుల శ్రేయం కోసం దైవాన్ని ప్రార్థిస్తుం డేవారు. ఆయన అత్యంత దీనస్థితిలో, దైవాదేశాన్ని అనుసరించి ఆత్మరక్షణ కోసం యుద్ధం చేస్తారు. ఆ పిదప సంపూర్ణ విజయం లభించిన తరువాత కూడా తనపై తన అనుచరవర్గంపై ఘోర దౌర్జన్యాలు చేసిన శత్రువుల్ని సాము హికంగా క్షమించి వదిలిపెడతారు. ఆయన తన జీవిత కాలంలోనే రాక్షసులుగా పిలువబడగలిగే క్రూర అరబ్బుల్ని పుణ్యాత్ములు గాను, నీతిమంతులుగాను తీర్చిదిద్దారు. ఆయన తరువాత కేవలం ఒక్క శతాబ్ద కాలంలోనే ప్రపంచంలోని అత్యధిక భాగంలో ఇస్లాం గౌరవోన్నతుల పతాకం ఎగురసాగింది. నేటి ఈ ఆధునిక కాలంలో సైతం, ఇస్లామే విశ్వవ్యాపిత ధర్మంగాను, అత్యధిక జన ప్రియత్వం గల ధర్మంగాను పురోగమిస్తుంది. వీటివల్ల ప్రవక్త ముహమ్మద్(స), ఇస్లామీయ ధర్మం ఔన్నత్యం తనంతట తానే నిరూపితమవుతున్నది. ఆయన నిరంతర హింసాదౌర్జన్యాలను భరిస్తూనే, అత్యంత ఓర్పు,సహనాలతో, దైవకృప వల్ల ముందుకు సాగుతూ అభివృద్ధి నొందసాగారు. చివరికి అసామాన్యమైన ఈ జగడాలు, సంఘర్షణల్ని అధిగమిస్తూ విజయం పొందారు. సత్యధర్మంగా ఇస్లాంను స్థాపించడమే ఆయన లక్ష్యం (మిషన్). ఒకవేళ వైజ్ఞానిక సిద్ధాంతాలైన 'ఉనికి కోసం పోరాటం' (Struggle for existance), ఉపయుక్తమైనదే మనగలుగుతుంది. (Survival of fittest) అనేవే వాస్తవాలై ఉంటే- నిజానికి కూడా ఇవి సైంటిఫిక్ నియమాలే- ఈ నియమాలపై వ్యక్తిగతంగాను, దైవ ప్రవక్తగాను ముహమ్మద్(స) కచ్చితంగా సరితూగుతారు. ఇక ఒక ధర్మంగా ఈ నియమాలపై ఖచ్చితంగా సరితూగగల శక్తి ఒక్క ఇస్లాం ధర్మంలోనేఉంది.

సంఘర్షణల్లోను, ప్రమాదకర పరిస్థితుల్లోను, యుద్ధ మైదానంలో సైతం నైతికతను విడనాడకపోవడం అనే మహోన్నత విశిష్ట గుణం దైవప్రవక్తలోనే కనబడుతుంది. శ్రీరామచంద్రుడు వాలిని సంహరించటానికి, చెట్టు చాటున ఉండి బాణం వదిలారు. రావణున్ని సంహరించటానికి, అతని నాభిలో అమృత భాండముందన్న రహస్యాన్ని తెలుసుకోవటంలో అతని సోదరుడు విభీషణుని సహకారం తీసుకున్నారు. ఈవిధంగా తమ రాజకీయాన్ని ప్రదర్శించారు. ఇదేవిధంగా శ్రీకృష్ణుడు ద్రోణాచార్యుని చంపటానికి, అశ్వథామ పేరు గల ఒక ఏనుగును చంపి, ధర్మరాజు ద్వారా 'అశ్వథామ హతహ' అనే పదాన్ని గట్టిగాను 'కుంజరహ' అనే పదాన్ని మెల్లిగాను చెప్పించి ద్రోణాచార్యులకు ఆయన కుమారుడు అశ్వత్థామ మరణపు అసత్య వార్తను వినిపింపజేశాడు. దీనితో ఆయన వైరాగ్యం చెంది అస్త్రాలను విసర్జించాడు. ఈవిధంగా ద్రోణాచార్యుడు అస్త్రవిహీనుడైన సమయంలో ఆయన్ను చంపించాడు. ద్రోణాచార్యుని లాగానే మయప్రధుని సంహరించే ఉద్దేశ్యంతో, సాయంకాలం కాకపోయినా కృత్రిమంగా సాయం కాలం లాంటి సమయాన్ని సృష్టించి రాజకీయ చాతుర్యాన్ని చూపటం జరిగింది. దీనికి భిన్నంగా దైవప్రవక్త గారు 'బద్ర్' యుద్ధ సమయంలో తమ సైనికుల సంఖ్య అత్యంత తక్కువగా[15] ఉన్నప్పటికీ ఇద్దరు అనుచరులు (సైనికులు) వారెంతగా కోరినా, బ్రతిమాలినా, వారి సైనిక సేవల్ని స్వీకరించ టానికి ఆయన గారు నిరాకరించారు. దీనికి కారణం ఏమిటంటే, అంతకుముందు వీరిద్దరు శత్రువులకు పట్టుబడి, ప్రవక్త తరఫున తాము యుద్ధంలో పాల్గొనబోమని వాగ్దానం చేసిన పిదప విడువబడ్డారని ఆయన గారికి తెలుసు. ఇదండీ! ప్రవక్తగారి నైతికతల్లోని ఔన్నత్యం. ఇదెంతటి

*15. ముస్లిం సైనికుల సంఖ్య దాదాపు 313. దీనికి భిన్నంగా శత్రుపక్షం సైనికుల సంఖ్య దాదాపు వేయి వరకుంది. ముస్లిం సైన్యంలో ఆయుధాలు, యుద్ధ పరికరాలు బహు తక్కువగా ఉన్నాయి. దీనికి భిన్నంగా శత్రు సైన్యం, అన్నిరకాల యుద్ధ సామాగ్రిని కలిగివుంది.*

విచిత్రమైన నైతిక వర్తనమో మీరే ఆలోచించండి. 'న్యాయమైన లక్ష్యం కోసం కూడా సక్రమమైన పద్ధతినే అవలంభించాలి' అనే సూత్రానికి ఆయన ప్రతిరూపం. ఒకప్పుడు ఆయన గారి కుమార్తెను ఒంటెపై నుంచి కింద పడేసి తీవ్రంగా హింసించిన క్రూరుడ్ని కూడా మక్కా విజయం రోజు ఆయన క్షమించి వదిలేశారు. ఇలాంటి అపురూపమైన క్షమా, మన్నింపుల ఉదాహరణ చరిత్రలో మనకు కానరాదు. నిస్సందేహంగా ప్రవక్త ముహమ్మద్(స), ప్రవక్తలందరి లోకెల్లా అత్యుత్తమమైన ప్రవక్త.

ఇస్లాం అనే పేరులోనే దాని ప్రాముఖ్యత, దాని సార్ధకత నిరూపితమవుతుంది. ఇస్లాం అనే పదానికి శాబ్దిక అర్థం, 'దైవాభీష్టానికి తనను తాను సంపూర్ణంగా సమర్పించుకోవడం.' అంటే అన్నివిధాలుగా దైవానికి విధేయుడై ఆయనకు లోబడిన దాసునిగా మారిపోవటం. ఈవిధంగా ఇస్లాం ప్రారంభంతోనే ఏకేశ్వరవాదానికి ప్రతీకగా నిలబడుతుంది. ఇస్లాం 'ముహమ్మదనిజం'[16] కాదు. అది దైవప్రసాదితమైన ప్రాచీన ధర్మం. మహనీయ ముహమ్మద్(స) దేవుని చిట్టచివరి ప్రవక్త. ఇస్లాం అంటే ఏమిటో తన పేరు ద్వారానే నిరూపితమవుతున్నది. దీనికి భిన్నంగా హిందూధర్మానికి ప్రత్యేకమైన గట్టి అర్థం ఏదీలేదు. బౌద్ధ మతం, క్రైస్తవ మతం, వాటి స్థాపకులతో సంబంధాన్ని తెలుపుతాయి. అంతేకాక ఇవి విశాలమైన, విశ్వవ్యాపిత మార్గదర్శకానికి

---

*16. క్రైస్తవ ప్రపంచం, ఇస్లాంలోని సార్వజనీనతను, దాని విశాలతను దాని అసంఖ్యాకమైన సుగుణాల్ని,ప్రత్యేకతల్ని పరిమితం చేసేందుకుగాను, ఈ ప్రాచీనమైన దైవధర్మాన్ని ఒక వ్యక్తిత్వం 'ముహమ్మద్'కు అంటగట్టే దురుద్దేశ్యంతో 'ముహమ్మదనిజం' అనే పారిభాషిక పదాన్ని (Terminology) వాడుకలోకి తేవడం జరిగింది. అంటే దీని అర్థం ఇస్లాం అనేది ఒక ధర్మం కాదని, ఒక వ్యక్తి ద్వారా ఆవిష్కరింపబడిన ఒక ఆలోచనా, లేక ఒక సిద్ధాంతం (Ism) అని చెప్పడం అన్నమాట. ఇదేవిధంగా ఏసుక్రీస్తు ద్వారా పరిచయం చేయబడిన మతానికి 'క్రైస్తవం' అని నామకరణం చేసి, అదొక మానవుని ద్వారా నెలకొల్పబడిన ధర్మంగా ప్రాచుర్యాన్నిచ్చి వాడుకలోకి తీసుకురావడం జరిగింది. (ప్రకాశకులు)*

అనువైనవిగా కనబడవు. ఇస్లాంలోని ఇంకొక ప్రత్యేకత ఏమిటంటే, అది ఏ ఒక సత్యధర్మాన్ని కూడా నిరాకరించి, నిరసించే చర్యకు బహుదూరంగా ఉంటుంది. దీనికి బదులుగా, ప్రపంచంలోని వివిధ దేశాలు, ప్రాంతాల్లో, ప్రవక్త ముహమ్మద్(స)కు పూర్వం వచ్చిన దైవప్రవక్తలు, దైవసందేశహరులందరినీ అది గౌరవిస్తుంది. (వారి పేర్లు తెలిసినా, తెలియకపోయినా, వారందరినీ విశ్వసించి తీరాల్సిందేనని, వీరిలో బేధభావాన్ని పాటించరాదని అది ముస్లింలకు గట్టిగా హితబోధ చేస్తుంది)

మౌలికంగా ధర్మాలన్నీ ఒకటే అనేది ఇస్లామ్ వాదన.[17]

కాలం గడిచిన కొద్ది వివిధ ధర్మాల్లో చేర్పులు జరిగినందున, బయటి విషయాలు అందులో జొప్పించబడినందున అందులో మార్పులు, సంస్కరణలు జరిగినందున, దేవుని నిజ బోధనల నుండి ప్రజలు దూరమైపోయిన కారణంగా దేవుడు తన ఆదేశాల్ని చివరిసారిగా, ఖుర్ఆన్ రూపంలో ప్రవక్త ముహమ్మద్ (స)పై అవతరింపజేశాడు. **'లా ఇలాహ ఇల్లల్లాహ్ ముహమ్మదుర్ రసూలుల్లాహ్'** (అల్లాహ్ తప్ప వేరే దైవం లేదు, ముహమ్మద్ అల్లాహ్ ప్రవక్త (సందేశహరుడు) అనేది ఇస్లాం మౌలిక సద్వచనం. ఈ సద్ వచనాన్ని ఈ పుస్తక ప్రారంభంలో క్షేత్రగణిత సిద్ధాంతం (Geometrical Theorem) రూపంలో నిరూపించాము. ఇస్లాంకు ఐదు మూలస్తంభాలు (విధులు) ఉన్నాయి. 1) తౌహీద్ (ఏకేశ్వర

17. *ప్రతి కాలంలోనూ, ప్రతి ప్రవక్త ద్వారాను తేబడిన ప్రాచీనమైన, సిసలైన ధర్మం 'ఇస్లాం' మాత్రమే. (అంటే దేవుని విధేయత, దైవాదేశాల శిరోధార్యం) ఆయా కాలాల్లో, ఆయా ప్రాంతాల్లో, ఆయా ప్రజలు తమ మాతృభాషలో దీనికి ఇంకేదైనా పేరుతో పిలుచుకొని ఉంటే ఉండొచ్చు. అది అసహజం, అసమంజసమేమీ కాదు. అయితే దానిలోని మౌలిక విషయాలు ఏకేశ్వరవాదం, దైవదౌత్యం, పరలోకం అనేవి మాత్రం ఒక్కటే. ఈ మూడు పునాదులపైనే అన్ని ధర్మాలు ఆధారపడి ఉండేవి. ఇంకా ఈ ధర్మాలన్నింటిలోనూ, ఎల్లప్పుడూ కూడా దైవానికి విధేయులై, ఆయనకు లొంగిపోయి తలొగ్గడమనే భావనే దాగి వుండేది.*

వాదం) అనగా దేవుడు కేవలం ఒక్కడే అనే విశ్వాసం[18] 2) నమాజ్- ఆరాధన- ప్రార్థన- అనగా శారీరక ప్రార్థనా, వేడుకోలు 3) జకాత్- అనగా నిర్బంధంగా, తప్పనిసరిగా ఇవ్వబడే దానం 4) రోజా- (ఉపవాసం), అనగా రమజాన్ నెలంతా తప్పనిసరిగా పాటించాల్సిన ఉపవాసం 5) హజ్- అనగా జీవితంలో ఒకసారి మక్కాలోని కాబాలయ సందర్శనం.

బౌద్ధ ధర్మం దేవుణ్నే అంగీకరించదు. కనుక ఏకేశ్వరవాదంతో దానికి ఎలాంటి సంబంధం లేదు. ఇక మిగిలిన ధర్మాల్లో కూడా ఈ అంశాలు (విధులు) స్పష్టమైన ఆదేశాల రూపంలో అసలే కానరావు. సంజ్ఞల్లో, సూచనల్లో, నైతిక విలువల రూపంలో, ఏదోవిధంగా సాగదీసి, వెదికి అన్వయించుకోవడం వేరే విషయం. ఇంచుమించు క్రైస్తవానిది కూడా ఇదే పరిస్థితి. ఏసుక్రీస్తును దేవుని కుమారునిగా స్వీకరించిన తరువాత, ఒకే ఒక దేవునిపై ఉండవలసిన విశ్వాసం క్రైస్తవుల్లో సమాప్తమైపోయింది. ఇస్లాంలోని ఈ ఐదు మూల స్తంభాలు (విధులు) ప్రాచీన హిందూధర్మంలో కన్పిస్తుంటాయి. చెదిరిపోయిన రూపంలో గాని, చిక్కుముడిగా ఉన్న రూపంలో గాని, లేక మరోరకంగా మరుగు పరచబడిన రూపంలోగాని, ఏదో ఒక రూపంలో మిగిలే ఉన్నాయి. ఇస్లాంలో నైతే వాటిని సంక్షిప్తపరిచి, నియమ నిబంధనల ఓరూపమిచ్చి, సులభంగా తెలుసుకునే అవకాశం కల్పించబడింది. అంతేకాకుండా ప్రత్యేక పరిస్థితుల్లో వాటిని మినహాయించడం, మాఫీ చేయటం కూడా జరిగింది. హిందూ ధర్మంలో ఈ ఐదు నియమాలు కేవలం వ్యక్తిగతమైనవిగానే (individual) కనిపిస్తాయి. కాని అదే ఇస్లాంలో వీటికి సామూహికత్వం, సామాజిక స్థానం

---

*18. మౌలికంగా ఇస్లాంలోని ఈ మొదటి అంశం విశ్వాసం మాత్రమే కాదు. మిగిలిన నాలుగు స్తంభాలు (విధుల)లాగే ఇది కూడా వాక్కు ద్వారా బలపరిచే క్రియ. దీన్నే 'షహాదత్' (సాక్ష్యం) అంటారు. అంటే నోటి ద్వారా 'అల్లాహ్ తప్ప వేరెవ్వరూ దైవం కాదు, ముహమ్మద్(స) దేవుని ప్రవక్త' అని సాక్ష్యం పలకడం అన్నమాట.*

ఒసగబడింది. ఈ విధంగా ఈ నియమాలు ఇస్లాంలో అత్యంత స్వచ్ఛమైన, నిర్మలమైన, సులభమైన పద్ధతిలో సమర్పించటం వలన, అవి ఈ ధర్మాన్ని సరళమైన, జనప్రియమైన, ఆచరించడానికి అనువైన విశ్వవ్యాపిత ధర్మంగా రూపొందించడానికి సహాయబడ్డాయి. ఇక సామాజిక దృష్టితో కూడా ఈ నియమాల్లోని ప్రత్యేకతల కారణంగా, ధర్మాలన్నింటిలోనూ దీనికి మేలైన ధర్మంగా గుర్తింపు వచ్చింది. మానవ సంస్కృతి ప్రారంభంలోనే ప్రాచీన వైదిక సాహిత్యం ఏకేశ్వరవాదాన్ని ప్రకటించింది. 'ఏకమేవ ద్వితీయో నాస్తి' అనగా దేవుడు ఒక్కడే. వేరొకడు లేడు' అనేది ఏకేశ్వరవాదానికి మచ్చుతునక. శ్రీకృష్ణుని నోట వెలువడిన 'భగవద్గీత'లో దేవుణ్ని 'జ్యోతిషామ్ పితజ్యోతి' అంటే 'కాంతికే కాంతి' అనటం జరిగింది. దేవుని ఈ సుగుణాన్నే ఖుర్ఆన్ 'నూరున్ అలా నూర్' అంటే 'అల్లాహ్ భూమ్యాకాశాల వెలుగు (జ్యోతి) (అన్నూర్ : 35) అని వక్కాణించింది. ఉపనిషత్తుల్లో 'తమసోమా జ్యోతిర్గమయ' అంటే 'మమ్మల్ని చీకటిలో నుండి కాంతిలోకి తీసుకురా' అని పదేపదే చెప్పబడింది. దైవప్రవక్త ముహమ్మద్(స) ప్రత్యేక వేడుకోలు కూడా ఇదే.[19]

గీతలో దేవుణ్ని 'విశ్వతో ముఖం' అని చెప్పటం జరిగింది. అంటే దేవుని ముఖం నలువైపులా ఉంది అనటం జరిగింది. ఖుర్ఆన్‌లో కూడా 'మీరు మీ ముఖాన్ని ఏ దిక్కుకూ తిప్పినా, అక్కడ మీకు అల్లాహ్ సమ్ముఖం లభిస్తుంది.' (అల్ బఖర : 115). గీత, దేవుణ్ని 'సర్వలోక మహేశ్వరం'అని పేర్కొంటుంది. అంటే సర్వలోకాలకు ప్రభువు అని అర్థం. ఖుర్ఆన్‌లో దేవుని కోసం అచ్చం

---

*19. "ఓ ప్రభూ! నా హృదయంలో కాంతిని సృష్టించు. నా చెవుల్లో, నా కళ్లల్లో కాంతిని నింపు. నా కుడివైపు, నా ఎడమ వైపు కూడా కాంతివంతంగా చెయ్యి. నా ముందూ, నా వెనుక కూడా జ్యోతిర్మయం చెయ్యి. నాపైనా నా క్రింద కూడా కాంతిని పరివేష్టింపజెయ్యి. ప్రళయం రోజు నా కాంతిని బాగా పెంపొందించు.' (హదీసు)*

*"(ఓ పరిపోషకుడా!) మాకు సన్మార్గాన్ని చూపించు' (అల్ ఫాతిహా : 5)*

ఇదే పదాలు వాడబడ్డాయి. 'రబ్బుల్ ఆలమీన్' ఆయన సకల లోకాలకూ ప్రభువు. (అల్‌ఫాతిహా : 1) భగవద్గీతలో దేవుడ్ని 'సత్య' అనటం జరిగింది. ఖుర్‌ఆన్‌లో కూడా దేవునికి హఖ్ 'సత్యం' అనే పిలవటం జరిగింది. గీత, ఖుర్‌ఆన్ రెండింటిలోనూ దేవుడి కోసం 'ఆయనను పోలిన వస్తువు సృష్టిలో ఏదీలేదు. (అష్షూర : 11) అనే పదాలు ఉపయోగించబడ్డాయి. గీత, ఉపనిషత్తుల్లో 'సర్వ విశ్వం దేవుని పరిధి(వలయం)లో ఉంది' అని చెప్పబడింది. అచ్చం ఇదే రీతిలో ఖుర్‌ఆన్ లో 'అల్లాహ్ ప్రతివస్తువును పర్యవేష్టించి ఉన్నాడు.' (అన్‌నిసా : 126) అనటం జరిగింది. గీతలో దేవుడ్ని 'అక్షర్' అంటే అంతం లేనివాడు, మిగతావన్నీ 'క్షర్' అంటే 'నశ్వరం' (అంతమైపోయేవి) అనటం జరిగింది. ఈ విషయాన్నే ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది : 'ఈ పుడమిపై ఉన్న ప్రతి వస్తువు నాశనమైపోయేదే. కేవలం మహోన్నతుడు, మహోపకారి అయిన నీ ప్రభువు మాత్రమే మిగిలి ఉండేవాడు. (అల్‌రహ్మాన్ : 26) గీతలో దేవుని 'అచింత్య' అంటే బుద్ధిజ్ఞానాలకు అందనివాడు. 'అనిర్వచనీయుడు' అంటే 'వర్ణించ, వివరించనలవిగాని' వానిగా పేర్కొనడం జరిగింది. ఖుర్‌ఆన్‌లో కూడా దేవుని గురించి (మానవ) చూపులు ఆయన్ను అందుకోలేవు. ఆయన సూక్ష్మగ్రాహి, సర్వజ్ఞాని' (అల్ అన్‌ఆమ్ : 103) అని ఉంది.

ఆ కాలపు అరబ్బుల ధర్మానికి, ధార్మిక ఆలోచనలకు, వారి విశ్వాసాలకు వైదిక సాహిత్యం, భగవద్గీతతో ఎలాంటి దూరపు సంబంధం కూడా లేదనేది చారిత్రక సత్యం. ఈ చారిత్రక వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకొని, ఏకేశ్వరవాదానికి సంబంధించి గీత, ఖుర్‌ఆన్‌లో కనబడే ఈ అపూర్వ పోలికలు ఎంత ఆశ్చర్యకరమైనవి! ఈ పోలికులు కేవలం ఏకేశ్వరవాదం వరకే పరిమితమై లేవు, గీతలో పేర్కొనబడిన ధర్మయుద్ధం, ఖుర్‌ఆన్‌లోని జిహాద్ కోసం ఒకే విధమైన మూలాలు, పరిస్థితులు కనబడతాయి. వీటికోసం ఇవ్వబడిన ప్రేరణ, ఆదేశోపదేశాలన్నీ ఒకేవిధంగా ఉండటం ఆశ్చర్యాన్ని కలిగి

స్తున్నాయి. మహనీయ ముహమ్మద్(స) వారి దైవ దౌత్యానికి భగవద్గీత ఓ ప్రబల నిదర్శనంగా నిలబడుతుంది.

ఇక రెండవ మూలస్తంభం లేక నియమం నమాజ్, ఆరాధన, వేడుకోలు ప్రాముఖ్యతను గురించి హిందూ ధార్మిక సాహిత్యంలో కూడా పేర్కొనడం జరిగింది. అయితే ఇస్లాంలో ఈ ఆరాధన లేక వేడుకోలుకు ఒక ప్రత్యేక రూపం ఇవ్వబడింది. అందులో దానికి సామూహికతను చేర్చి నిర్దిష్టమైన నియమ నిబంధనల ద్వారా దాన్ని పటిష్టపరిచి అత్యంత ప్రయోజనకారిగా రూపొందించడం జరిగింది.

హిందువుల్లో దానధర్మాలకు అత్యంత ప్రాముఖ్యత ఉంది. దాని ఉత్కృష్టతను కూడా పేర్కొనడం జరిగింది. అయితే ఈ దానధర్మాలకు కేవలం బ్రాహ్మణులే అర్హులని భావించడం జరిగింది. కాని అదే ఇస్లాంలో జకాత్ (విధి దానం)ను విధిగా నిర్ణయించి, పేదలను, ఆగత్యపరులను, దీనికి అర్హులైన వారిని హక్కుదారులుగా నిర్ణయించి, నిజమైన సామాజిక న్యాయానికి పునాది వేయడం జరిగింది. ఇస్లామీయ ధర్మంలోని ఈ విధి దానం (జకాత్) అపూర్వమైనది, సాటిలేనిది.

రోజాకు (ఉపవాస వ్రతం) కూడా హిందూ ధర్మంలో ప్రాముఖ్యత ఉంది. ఒక నెల రోజులపాటు పాటించే 'చంద్రామతి' అనే వ్రతం ఒకటుంది. చంద్రకళలను బట్టి ఇది ప్రారంభమై అదే క్రమంలో సమాప్తమూ అవుతుంది. ఇది రమజాన్ నెల ఉపవాసాల లాంటిదే. ఇప్పుడైతే ఇది దాదాపుగా కనుమరుగైపోయింది. అయినా ఇప్పటికీ అనేక వ్రతాలు ఆచరణలో ఉన్నాయి. అందులో 'నిర్జల వ్రతం' (నీరు లేకుండా) ' ఏకాదశి వ్రతం' మొదలైనవి కొన్ని. కాని హిందువుల్లోని ఈ వ్రతాలు వివిధ సందర్భాల్లో, వివిధ రూపాలు సంతరించుకుంటాయి. కేవలం ఇవి స్త్రీల వరకే పరిమితం. దీనికి భిన్నంగా ఇస్లాంలోని ఉపవాసం (రోజా) స్త్రీ పురుషులందరికీ విధిగా చేయటం జరిగింది. దీనిది

ఒక ప్రత్యేక విధానం, ఒక నిర్దిష్ట సమయం ఒక నిర్ణీత కాలం, దీని సార్వజనీనత, అలాగే దీనికి ఇతర నియమ నిబంధనలను జోడించి సమన్వయ పరచటం కారణంగా ఇది ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకొని గర్వించదగినదిగా రూపొందింది. ఉపవాసానికి ఇస్లామీయ ధర్మంలో ఒక సామూహిక, సామాజిక దృక్పథం కూడా ఉండటం మరో ప్రత్యేకత. దీనికి భిన్నంగా హిందువుల్లోని వ్రతం, వ్యక్తిగత లక్షణాన్ని కలిగి ఉంటుంది. ఇక ఇస్లామీయ ఉపవాసాల విషయానికొస్తే అవి సమాప్తమైన సందర్భంగా పెద్దసంఖ్యలో సామూహిక ప్రార్థనలు, పరస్పర శుభాకాంక్షలు తెలుపుకోవడం, సమానత్వాన్ని సోదరభావాన్ని ప్రదర్శించే అపురూపమైన సన్నివేశం ప్రదర్శించబడుతుంది.

హజ్ అనేది పవిత్ర స్థల సందర్శనానికి మరో రూపం. హిందువుల్లో అసంఖ్యాక తీర్థ స్థానాలున్నాయి. అయితే వీటి సంబంధం కేవలం విశ్వాసాలు లేక పురాణాలపై ఆధారపడిన భావనలపై ఆధారపడ్డవే. దీనికి భిన్నంగా ఇస్లాంలోని హజ్ అనేది సామూహికత్వానికి, సౌమ్యానికి, గాంభీర్యానికి, ధార్మికతకు ప్రతిబింబంలా కనబడుతుంది. దీనితోపాటే అది చారిత్రక వాస్తవాలతో ముడిపడి వుంది.

క్లుప్తంగా చెప్ప వచ్చిందేంటంటే ఇస్లాంలోని ఈ ఐదు మూల నియమాలు మౌలికంగా హిందూ ధర్మంలో కూడా ఉన్నాయి. ఇక హిందూ ధర్మం ప్రాచీనమైనదనే విషయం తెలిసిందే కదా. మరి హిందూ ధర్మంలో ఈ నియమాలు ఎక్కడి నుంచి వచ్చాయి? అందుకని ఈ కోణం కూడా మహనీయ ముహమ్మద్(స) దైవదౌత్యానికి సజీవ సాక్ష్యం. కాకపోతే హిందూ ధర్మం నిర్లిప్తంగా, అస్పష్టంగా, మరుగునపడి ఉన్న ఈ నియమాల్నే ఇస్లాం అర్థవంతమైనవిగా, ప్రభావితమైనవిగా రూపొందించి ప్రదర్శించింది. ఇంకా వీటిని సమాజం కోసం అద్భుతమైన రీతిలో ప్రయోజనకారిగా, లాభదాయకమైనవిగా, అత్యంత శుభకరమైనవిగా తీర్చిదిద్దింది. అన్నిటికన్నా హర్షించదగిన విషయం

ఏమిటంటే ఇస్లాంలో ఏకేశ్వరవాదం అనే ప్రథమ నియమం తప్ప, మిగిలిన ఈ నాలుగు నియమాలకు ఆపద సమయాలు, క్లిష్ట పరిస్థితులు, బాధ లాంటి అనివార్య పరిస్థితుల్లో ప్రత్యేక సడలింపు ఇవ్వడం జరిగింది. ఏకేశ్వరవాద నియమం మాత్రం మేధామస్తిష్కాలతో, ఆత్మతో, సర్వశక్తి సంపన్నుడైన దేవునిపై విశ్వాసంతో ముడివడి వుంది. అందుకని దానిలో సడలింపు లేదా మినహాయింపు అనే ప్రశ్నే ఉత్పన్నం కాదు. దీనిలో సడలింపు ఇవ్వటం అంటే అది బహుదైవారాధనను ఆహ్వానించినట్లే. ఏకేశ్వరుని విశ్వాసంపై సడలింపు లేక మినహాయింపు అంటే ఏకైక దేవుణ్ణి నిరాకరించడం లాంటిదే. దేవుడు ఒక్కడే అనే విశ్వాసంలో సడలింపు అంటే దైవం ఒక్కడే కాడు అని అనడంతోటే ఏకేశ్వరవాద సౌధం ఒక్కసారే కుప్పకూలిపోతుంది. అందుకని దీని గురించి ఆలోచించటానికైనా ఆస్కారం లేకుండా దాన్ని పటిష్ట పరచడం జరిగింది. ఇతర ధర్మాల్లో, ఈ ఏకేశ్వరవాదంలో సడలింపు లేక మినహాయింపు, సవరణలేక మార్పు కారణంగానే చెడుగు జొరబడింది. ఇస్లాం, బహుదైవారాధనను అది ఏ రూపంలో ఉన్నా సరే, దాన్ని (షిర్క్) దైవత్వంలో ఇతరుల భాగస్వామ్యంగానే గుర్తిస్తుంది. ఇస్లాం ఏకేశ్వర విశ్వాసాన్ని అత్యంత కట్టుదిట్టంగా, పటిష్టపరిచి, సురక్షితంగా ఉంచింది. ఇదే ఇస్లామీయ ధర్మంలోని ప్రత్యేకత, విశిష్టత. కాబట్టి ఇస్లాంలోని ఇతర నియమాలు అంటే నమాజ్ (ఆరాధన), జకాత్ (విధి దానం), రోజా (ఉపవాసం), హజ్‌లకు కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో ఉదాహరణకు శారీరక వ్యాధుల్లో, ఆర్థిక బలహీనతల్లో మినహాయింపు ఇవ్వడం జరిగింది. ఉదాహరణకు జకాత్ (విధి దానం) చెల్లించే స్తోమత లేని వ్యక్తికి, దీని ప్రత్యామ్నాయంగా అతను క్షోభ, కలతలు, కొట్లాటల నుండి దూరంగా ఉంటే సరిపోతుంది. ఇదే అతని జకాత్ అంటుంది ఇస్లాం. ఇస్లాం ప్రతిపాదించిన ఈ నియమ నిబంధనలు అత్యంత క్లుప్తంగాను, సరళంగాను, సుబోధకంగాను ఉండి సామాన్య మనిషి మొదలుకొని ప్రత్యేక వర్గాల వరకు

కూడా ఆచరించ టానికి అనుకూలంగా ఉన్నాయి. తౌహీద్ (ఏకేశ్వరోపాసన) తప్ప మిగిలిన నియమాల్ని– అనగా జకాత్, రోజా, హజ్‌ను శారీరక, ఆర్థిక బాధల్లో మినహా యింపు ఇచ్చిన కారణంగా పేదలకు, రోగులకు, అంగ వైకల్యులకు కూడా ఇస్లాం ఒక కారుణ్య వ్యవస్థగా మారింది. కాకపోతే ఇతర ధర్మాల్లో వారు అత్యంత అల్పులై, పూర్తిగా విస్మరించబడ్డారు. ఇక ఇస్లాం ఖర్చులతో కూడిన ఆచారాల్ని, సంప్రదాయాల్ని, కార్యకలాపాల్ని పూర్తిగా రూపుమాపింది. తన క్రియాపూర్వక నియమాల్ని ఇతర లైంగిక, సామాజిక సహాయక నియమాలతో సమ్మిళితం చేసి ఒక శాశ్వతమైన, నిరంతరమైన, విశ్వవ్యాపితమైన ధర్మంగా, సకల మానవాళి ధర్మంగా పరిచయమయింది. స్త్రీలు, పురుషులు, వెనుకబడిన వారు, దళితులు, అనాథలు, నిరాశ్రయులు, దీనులు, రిక్తులు, అగత్యపరులు, అంగవైకల్యం గలవారు అందరూ– ఇంకా ఏ వంశం, వర్గం, జాతి, దేశానికి చెందినవారైనా సరే. ఈ ధర్మంలో నిర్భయంగా, నిశ్చింతగా, నిక్షేపంగా చేరి పోవచ్చు. చెప్పొచ్చేదేమంటే– మానవునికి ఎదురయ్యే సమస్త సమస్యలను సముచితంగా పరిష్కరించే స్థోమత, యోగ్యత కలిగిన ధర్మం కావటం వల్ల ఇస్లాం అన్నింటికీ మించిన శ్రేయోసాఫల్యాలు సమకూర్చే బాధ్యతను స్వీకరించింది. ఇస్లాంలోని కొన్ని ముఖ్యమైన లక్షణాల్ని, ప్రత్యేకతల్ని క్లుప్తంగా ఈ క్రింద వివరిస్తున్నాము.

1. స్వచ్ఛమైన ఏకేశ్వర విశ్వాసం ఇస్లాంలోని ప్రధానమైన ప్రత్యేకత. హిందూధర్మానికి చెందిన దైవగ్రంథాలైన వేదాల్లోని ఏకేశ్వర విశ్వాసం కాల క్రమేణా బహుదైవారాధనా భావనలతో కలిసి పూర్తిగా కనుమరుగైతే కాలేదు కాని బహుదైవారాధన, అవతార వాదపు భావనల వల్ల దైవాన్ని ద్వితీయ స్థానానికి చేర్చటం జరిగింది. క్రైస్తవ ధర్మంలో కూడా ఇదే జరిగింది. త్రిత్వం అంటే, ముగ్గురు దైవాలు అనగా దేవుడు, దైవకుమారుడు, పరిశుద్ధాత్మల భావన కారణంగా, దైవం మొదటి స్థానంలోకాక ద్వితీయ స్థానానికి చేర్చబడ్డాడు.

హిందూధర్మంలో ఈ పరిస్థితి అవతారవాదం వల్ల ఏర్పడింది. దీనికి భిన్నంగా ఇస్లాం ఏకేశ్వర విశ్వాసంలో ఎలాంటి సవరణ గాని మార్పు గాని జరగలేదు. అందులో ఎన్నడూ చెడు ప్రవేశించలేకపోయింది. అదెంతటి పటిష్టమైన, దృఢమైన పునాదులపై లేపబడిందంటే, అసలందులో మార్పులు చేర్పులు జరగడం సంభవమే కాదు. ఇస్లాం మౌలిక వచనమే దీనికి ప్రధాన కారణం. అది 'అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహు వ రసూలుహు.' (ఒక్క అల్లాహ్ తప్ప వేరెవ్వరూ దైవం కాదని నేను సాక్ష్యమిస్తున్నాను. ముహమ్మద్(స) అల్లాహ్ యొక్క దాసుడు, సందేశహరుడు అని నేను సాక్ష్యమిస్తున్నాను). ఖుర్ఆన్‌లో అత్యధిక స్థానాల్లో ముహమ్మద్(స)ను 'అబ్ద్' అనే పేర్కొనడం జరిగింది. అబ్ద్ అంటే శిరసావహించే, విధేయత చూపే దాసుడు అని అర్థం. అందుకని దేవుని దాసుడు, బానిస, దేవుని అవతారం లేక దైవం ఏనాటికి కాజాలడు.

2. 'సారాయి'ని ఇస్లాంలో పాప జననిగా, అన్ని చెడులకు మూలంగా పేర్కొనటం జరిగింది. కనుకనే మధుపాన సేవనం ఇస్లాంలో కేవలం ఒక నైతిక దుర్గుణంగా పేర్కొని ఊరకుండా లేదు. దీనికి భిన్నంగా అదొక తీవ్రమైన, శిక్షార్హమైన నేరంగా కూడా చెప్పబడింది. మధుసేవనం చేసినవానికి వంద కొరడాలు కొట్టే శిక్ష నిర్ణయించబడింది. మౌలికంగా ఇస్లాంలో సారాయి, కల్లు, గంజాయి, నల్లమందు ఇంకా ఇలాంటి మత్తును కలిగించే పదార్థాలన్ని నిషేధించబడ్డాయి. ఇదిలావుండగా హిందూ ధర్మంలో వీటిపై నిషేధం ఉండి కూడా లేనట్లే. విష్ణువును పూజించేవారు సారాయిని నిషిద్ధ పదార్థంగా గుర్తిస్తారు. కాని కాళిమాత పూజారులు దీన్ని ధార్మిక వస్తువుగా భావిస్తారు. శివుని లాంటి దేవతను, గంజాయి, ధత్తూరమును ఉపయోగించేవానిగా చూపించటం జరిగింది. శివుడు కూడా గంజాయి మొదలైన వాటిని ఉపయోగించాడు.

3. జకాత్ అనేది విధి దానం. దాని మూల స్తంభాలు లేక మౌలిక నియమాలైన దైవం గురించిన సాక్ష్యం, నమాజ్, ఉపవాసం, హజ్‌లలో ఒక మూల స్తంభంగా జకాత్‌ను నిర్ణయించే గౌరవం ఇస్లాంకే దక్కుతుంది. పేదలు, రిక్తులు, బలహీనులు, రుణాన్ని తీర్చే స్థోమత లేని రుణగ్రస్తులు, ఏదైనా ఓ వ్యాపారం చేసి తమ భుక్తిని సంపాదించుకునేంత ఆర్థిక వనరులు లేని వారికి సైతం ఈ జకాత్ వ్యవస్థలో అర్హత కల్పించబడింది. ఒక నియమానుసారం, చట్టం ప్రకారం ధనవంతుల ధన సంపత్తిలో నిరుపేదల, రిక్తుల హక్కును నిర్ణయించింది. దీనిలోని ఇంకొక ప్రత్యేకత ఏమిటంటే, ఈ జకాత్‌లో ఎవరికైతే అర్హత, హక్కు కల్పించబడిందో వారు బిచ్చగాళ్ళలాగా, జకాత్ కోసం, ధన వంతుల వద్దకు వెళ్లి యాచించే అవసరం లేదు. ధనవంతుల నుండి జకాత్‌ను వసూలు చేసి అర్హులకు, పేదవారికి చేర్చే ఏర్పాట్లు చేయటం ఒక ఇస్లామీయ ప్రభుత్వపు మౌలిక బాధ్యత, విధి కూడాను. ఈ విధంగా పేదలు, రిక్తుల్లో అగత్యపరుల్లో న్యూనతాభావం ఏర్పడకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసింది. పేదలు, అగత్యపరుల కోసం ఇంతటి చింత, వారి గౌరవ మర్యాదల్ని కాపాడే ఇంతటి చక్కటి వ్యవస్థ ఏ ఇతర ధర్మంలోను కనిపించదు.

4. జూదం, అది ఏ రూపంలో ఉన్నా ఇస్లాంలో హరాం, నిషిద్ధం. అదిలా ఉండగా హిందూధర్మంలో దీపావళి సందర్భంలో జూదమాడటం ఒక ధార్మిక కార్యం.

ఇక క్రైస్తవంలో జూదంపై ఎలాంటి నిషేధం లేదు.

5. వడ్డీ, వడ్డీ వ్యాపారం అనేది ధనికుల్ని మరీ ధనవంతులుగాను, పేద వారిని, అగత్యపరుల్ని మరింత పేదవారుగా మార్చే ప్రక్రియ. సమాజాన్ని ఈ రుగ్మత నుంచి రక్షించటానికి ఏ ధర్మమూ వడ్డీపై ఆంక్ష విధించి ఉండలేదు. కేవలం ఇస్లామీయ ధర్మం ఒక్కటే వడ్డీని చెడ్డదనీ, క్రూరమైనదని దాన్ని సంపూ ర్ణంగా నిషేధించింది. ఖుర్‌ఆన్‌లో వడ్డీని నిషేధిస్తూ, నిషేధానికి పూర్వపు వడ్డీని

కూడా వదిలివేయాలని ఆదేశించటం జరిగింది. అలా వదిలి వేయకపోతే అది దైవం, దైవప్రవక్తతో యుద్ధానికి సిద్ధం అయినట్లుగా భావించబడుతుందని హెచ్చరించటం జరిగింది. (అల్ బఖర : 279)

6. ధార్మికంగా లంచాన్ని నిషేధించిన గౌరవం కూడా ఒక్క ఇస్లామ్ ధర్మానికే దక్కుతుంది. (అల్ బఖర : 188) లంచం ఇచ్చేవాడూ, పుచ్చుకునే వారిద్దరినీ దైవప్రవక్త ముహమ్మద్ (స) శపించారు.

7. స్త్రీలకు మొట్టమొదటిసారిగా ఆస్తిలో హక్కు కల్పించిన ధర్మం ఇస్లాం. మృతుని ఆస్తి పంపకం (వారసత్వం)లో కూడా స్త్రీలకు వాటా కల్పించ బడింది.[20] (అన్నిసా : 11, 12, 33, 176)

భర్త చనిపోయి వితంతువు అయిన స్త్రీ, పునర్వివాహం గురించి హిందూ ధర్మంలో ఎలాంటి నియమం, ఆదేశాలు లేవు. అంతేకాదు, చనిపోయిన భర్తతో, ఈ వితంతువును కూడా సజీవంగా దహనం చేసే (సతీ సహగమనం) ఆచారం ఉండేది. ఇక ఎవరైతే ఈవిధంగా 'సతి'కాకుండా బ్రతికుండేవారో వారికి మంచి తిండి లభించేది కాదు. వారు మంచి దుస్తులు ధరించడానికి వీల్లేదు. అలంకరించుకొని శుభకార్యాల్లో పాల్గొనగలిగేవారు కాదు. వితంతువు అన్నిరకాలుగా ఛీత్కరించబడేది. జీవితమే ఆమెకో మోయరాని భారంగా పరిణమించేది.

ఇస్లాంలో ఇలాంటి ఆంక్షలేవీ లేవు. భర్త మరణించిన నాలుగు నెలల పదిరోజుల తరువాత (అనగా 130 రోజుల తరువాత) ఆమె పునర్వివాహం చేసుకోవచ్చు.

---

*20. ఈ హక్కుల్ని, నియమాల్ని నిర్ణయించిన తరువాత 'ఇవి దైవం నిర్ణయించిన హద్దులని, వీటిని ఉల్లంఘించిన వాడు పరలోక జీవితంలో ఘోర శిక్షకు గురికావాల్సి ఉంటుందని, అందులో అతను చిరకాలం ఉంటాడని, అదెంతో కఠినమైన శిక్ష అని ఖుర్ఆన్ చెబుతుంది.*

8. అనివార్య పరిస్థితుల్లో, గత్యంతరం లేనప్పుడు తన భర్తతో విడాకులు (ఖులా- వేర్పాటు) తీసుకునే హక్కును ఇస్లాం స్త్రీలకు ప్రసాదించింది. హిందూ ధర్మంలో స్త్రీలకు అలాంటి ఏ హక్కూ లేదు. అయితే ఇప్పుడిప్పుడే మన దేశంలో చట్టాల్ని రూపొందించి స్త్రీలకు అనేక హక్కులు, సౌకర్యాలు కల్పించబడ్డాయి.

9. ఎవరైనా, స్త్రీల శీలంపై అపనింద మోపితే, దానికి నలుగురు సాక్షుల్ని ప్రవేశపెట్టడం అనివార్యం అనే సూత్రాన్ని ప్రతిపాదించిన ధర్మం ఇస్లామే. ఒకవేళ నిందమోపిన వాడు నలుగురు సాక్షుల్ని ప్రవేశపెట్టకపోతే అతనికి/ ఆమెకు ఎనభై కొరడా దెబ్బల శిక్ష నిర్ణయించింది. ఈ సందర్భంలో శ్రీరామచంద్రుడు, ప్రవక్త ముహమ్మద్(స) పద్ధతుల్లో గల తేడా గమనార్హం. ప్రవక్తగారి సతీమణి హజ్రత్ ఆయెషా(రజి)శీలంపై కూడా నిందవేయడం జరిగింది. అది (ప్రవక్తగారి ఆదేశంపై కాక, భౌతిక విచారణ, పరిశీలన, పరిశోధనల ఫలితంగా) తుచ్ఛమైనదిగా తేలిపోయింది. తత్ఫలితంగా హజ్రత్ ఆయెషా(రజి) నిర్దోషి అని నిరూపితమయింది. కాని శ్రీరామచంద్రుడు కేవలం శంక, అనుమానాల ఆధారంగా అగ్ని పరీక్షలో నెగ్గి తన సౌశీల్యాన్ని నిరూపించుకున్న తరువాత కూడా సీతమ్మను తన నుండి దూరం చేసేశారు. ఒకవేళ సామాన్య ప్రజలే కనుక శ్రీరామచంద్రుని ఈ ఆదర్శాన్ని అనుసరిస్తే అనేకమంది స్త్రీల జీవితాలు నాశనమయిపోతాయి. ఇస్లామీయ ధర్మం, అమాయక స్త్రీలపై నిందారోపణలను కేవలం నైతికంగా ఖండించి, గర్హించి ఊరకుండలేదు. దీన్ని ఒక శిక్షార్హమైన నేరంగా పరిగణించి స్త్రీ జాతిపై ఎనలేని మేలును చేసింది. దీనికోసం స్త్రీ జాతి ఇస్లామీయ ధర్మానికి ఎంతో రుణపడి వుంది. దీనికి మహిళా లోకం ఎంతగా కృతజ్ఞతలు తెలుపుకున్నా తక్కువే.

10. తూకంలో, కొలతల్లో మోసాన్ని శిక్షార్హమైన నేరంగానే కాక ధార్మికంగా పాపమని హెచ్చరించింది కూడా ఇస్లాం ధర్మమే. దీని గురించి పరలోకంలో సంజాయిషీ అడగబడుతుందని భయపెడుతోంది.

11. అన్యాయంగా అనాథల ఆస్తుల్ని, సంపదను కాజేయడం అత్యంత పాపమని ప్రకటించింది. (అన్‌నిసా : 10, 12)

12. మీరు నిజంగానే దైవాన్ని ప్రేమించేవారైతే, ఆయన సృష్టితాల్ని ప్రేమించమని ఇస్లాం చెబుతుంది.

13. ఆయన దాసులతో (మానవులతో) ఎవరైతే అత్యంత మేలుగా ప్రవర్తిస్తారో, అటువంటి వారినే దైవం ప్రేమిస్తాడని ఇస్లాం బోధిస్తుంది.

14. ఎవరైతే జీవకోటిపై దయ, కనికరం చూపుతారో, దైవం వారినే కనికరిస్తాడనేది ఇస్లాం బోధన.

15. దయ అనేది విశ్వాస చిహ్నమని, ఎవరిలో దయాగుణం లేదో వారిలో విశ్వాసం లేదని తెలిపింది.

16. తన తోటివాడిని తనతో సమానంగా గుర్తించనంతవరకు, అతని విశ్వాసం పరిపూర్ణం కాజాలదనేది దాని ఆదేశం.

17. ఇస్లాం బోధనల దృష్ట్యా ఒక ఇస్లామీయ ప్రభుత్వం, దైవ తిరస్కారాన్ని భరిస్తుంది కానీ, హింసా దౌర్జన్యాలను మాత్రం భరించలేదు.

18. ఏ ముస్లిమ్ దుర్మార్గం నుంచి అతని పొరుగువాడు సురక్షితంగా ఉండలేడో ఇస్లామ్ దృష్టిలో అతను విశ్వాసి కాజాలడు.[21]

---

*21. ప్రవక్త ముహమ్మద్(స) పొరుగువారితో అత్యంత మేలైన తీరులో ప్రవర్తించాలని గట్టిగా హితబోధ చేశారు. ఈ పొరుగువారిలో ముస్లిం, ముస్లిమేతరుడనే బేధభావం లేదు. ఆయన(స) గారు, 'జిబ్రాయీల్(అలై) దైవదూత తనకెప్పుడూ పొరుగువారి మేలు గురించి, వారి హక్కుల గురించి హితబోధ చేస్తూనే ఉండేవారని, చివరికి వారసత్వంలో కూడా పొరుగువారికి హక్కు కల్పించబడుతుందేమోననే అనుమానం నాకు వచ్చేదని' పలికారు.*

*ఒక ప్రఖ్యాత ఇస్లామీయ తత్వవేత్త ఇమామ్ ఇబ్నెహజర్, దైవప్రవక్త(స) గారి ఈ ఆదేశాన్ని విశ్లేషిస్తూ ఇలా రాశారు: పొరుగువారంటే ముస్లిం, ముస్లిమేతరుడు,*

19. ఒకరికి చెందిన జానెడు స్థలాన్నైనా సరే అన్యాయంగా కబళించిన వ్యక్తి ప్రళయం రోజున భూమి ఏడు అంతస్తుల్లోకి అణగదొక్కబడతాడు.

20. ఇస్లాం ధర్మంలో కనిపించే సమానత్వం, సోదరత్వం ప్రపంచంలోని ఏ ఇతర ధర్మంలోనూ లేదు. హరిజనులు హిందూ ధర్మంలో అసహ్యించుకో బడేవారుగా, నీచులుగా భావించబడతారు. క్రీ.పూ. దాదాపు 2500 సంవత్సరాలకు పూర్వం ఈ భావనకు వ్యతిరేకంగా గౌతమబుద్ధుడు గళమెత్తి నిలబడ్డాడు. అప్పటి నుంచి నేటివరకు అనేకమంది సంస్కర్తలు ఈ భావనను రూపుమాపడానికి గట్టి కృషి చేస్తూనే ఉన్నారు. ఆధునిక యుగంలో మహాత్మాగాంధీ హిందువుల ఈ భావనను రూపుమాపడానికి ఎంతో కృషి చేశారు. కానీ అందులో విజయంసాధించలేకపోయారు. ఇదేవిధంగా క్రైస్తవుల్లో నలుపు, తెలుపుజాతి అనే భేదభావం కనబడుతుంది. తెల్లవారి చర్చీలు వేరుగా, నల్లవారి చర్చీలు వేరుగా ఉంటాయి. తెల్లవారి చర్చీలో ఆరాధన కోసం నల్లవారు ప్రవేశించలేరు. ఈ కాలంలో సైతం దక్షిణాఫ్రికాలో, తెల్ల క్రైస్తవులు, నల్ల క్రైస్తవులపై హింసా దౌర్జన్యాలు జరుపుతూనే ఉన్నారు. నలువైపులా సామాజిక న్యాయం అనే నినాదాలు విన్పిస్తున్నా, అన్ని రాజ్యాలు ఐక్యరాజ్యసమితి నియంత్రణలో నడుస్తున్నప్పటికీ, దీన్ని అది రూపుమాపలేకపోయింది. అయితే ఈ బేధభావాన్ని ఇస్లాం కూకటివేళ్ళతో సహా పెకిలించి వేసింది. ఇదే దక్షిణాఫ్రికాలో ఒక జులూ, ముస్లింగా మారగానే, ముస్లిం సమాజంలో అతనికి ముస్లింల లాంటి సమాన స్థాయి లభిస్తుంది. దీనికి భిన్నంగా ఒక జులూ (దక్షిణాఫ్రికా స్థానిక నివాసి) క్రైస్తవాన్ని స్వీకరించినప్పటికీ

*మిత్రుడు, శత్రువూ అందరూ వస్తారు. ఇదే విధంగా దయ, కనికరాల గురించి కూడా ఆయన గారు బాగా నొక్కి చెప్పారు. ఆయన(స) గారు ఇలా ఉపదేశించారు : 'నేను గర్హించే, దూషించే వానిగా కాకుండా, కారుణ్య మూర్తిగా చేసి పంపబడ్డాను. దయ, కనికరాల్లో కూడా ముస్లిం, ముస్లిమేతరులు, సర్వప్రాణులు చేరిపోతాయి.*

సమాజంలో అతనికా స్థానం లభించదు. ఇస్లాంలోని ఈ భావనకు, సమానత్వాన్ని సృజించే, పెంపొందించే ఈ శక్తికి మహాత్మాగాంధీ తన హృదయ పూర్వక జోహార్లు అర్పించారు.[22]

---

*22. సామాన్య మనిషి ఈ విషయాలను అవలీలగా అర్థం చేసుకోవాలని శ్రీ రాజేందర్ నారాయణ్ గారు సంక్షిప్తం చేశారు. కాని సమానత్వం, సోదరత్వానికి సంబంధించి ఇస్లాం ప్రతిపాదించిన కొన్ని సూత్రాలను, సామెతల్ని పాఠకులకు అందించటం అసందర్భం కాదనకుంటాము.*

*మౌలికంగా ఇస్లాం మానవత్వంలో ఎలాంటి భేదభావాన్ని సహించదు. మానవులంతా ఒకే తల్లిదండ్రుల సంతానమనేది దాని సిద్ధాంతం. ఖుర్ఆన్‌లో దైవం ఇలా ఆదేశిస్తున్నాడు :*

*"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులు గాను, తెగలుగాను చేశాము. వాస్తవానికి మీలో అందరికంటే ఎక్కువ భయభక్తులు గలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు. నిశ్చయంగా అల్లాహ్ సర్వజ్ఞాని, సకల విషయాలూ తెలిసినవాడూను." (అల్ హుజురాత్ : 13)*

*ఇది ఎంతో అర్థవంతమైన ఆయత్. ఇందులో మూడు అంశాల్ని ప్రత్యేకంగా పేర్కొనడం జరిగింది. దాన్ని గ్రహించకపోవడం వల్లనే మానవత్వం, వంశాలుగా, సంతతులుగా, వర్గాలుగా, జాతులుగా, దేశాలుగా విభజించబడిపోయింది. తామంతా ఒకే తల్లిదండ్రుల సంతానమనే విషయాన్ని మానవుడు మరిచిపోయాడు. మానవ చరిత్ర పగ, ద్వేషం, అసూయ, ఘర్షణ, శత్రుత్వం, హత్య, రక్తపాతంలాంటి ఏ రుగ్మతలతో నిండివుందో, నేటి ఆధునిక యుగంలో కూడా అవి ఇంకా మనకు కనబడుతున్నాయో, వాటన్నింటికీ మూల కారణం ఈ వ్యత్యాసమే, ఈ బేధభావమే పై ఆయత్ ద్వారా మానవునికి మొట్టమొదటగా ఈ వాస్తవమే తెలుపడం జరిగింది.*

*తెలుపబడిన రెండవ విషయం ఏమిటంటే– వంశం, గోత్రము, సంతతి, జాతి, దేశాలకు సంబంధించిన వ్యత్యాసానికి అర్థం ఒకరు తక్కువ, ఇంకొకరు ఎక్కువ, ఒకరు ఉన్నతులు, వేరొకరు నిమ్నులు, ఒకరు గౌరవనీయులు, ఇంకొకరు అధములు, నీచులు అనేది ఎంతమాత్రం కాదు. అందరూ సమానమే. మానవులందరూ*

భూమిపైని ఒకే భాగంలోనైతే ఇమడజాలరుగా. అంతేకాక ఒకేచోట అందరికీ భుక్తి, ఉపాధి, జీవనం గడపటానికి కావలసిన వనరులు లభించవు కదా! అందుకని వారు వివిధ దేశాలుగా, జాతులుగా, వర్గాలుగా ఏర్పడ్డారు. వంశాలూ, గోత్రాలు ఏర్పడ్డాయి. ఇవన్నీ ఒకరినొకరు గుర్తుపట్టడానికి, పరస్పరం హక్కులు నెరవేర్చ డానికి మాత్రమే. ఈ విధంగానే ఒక విధమైన నియంత్రణ, పరిపాలనా వ్యవస్థ ఏర్పడే అవకాశముండేది.

మూడవ అంశం దేనిమీదైతే మానవుల దృష్టి మరల్చడం జరిగిందో, అది సంతతి, వంశం, కుటుంబం, తెగ, రంగు, జాతి, దేశం అనే వాటికి ఎలాంటి ప్రత్యేకత లేదు, గౌరవోన్నతులకు ఇవి ప్రమాణాలు ఎంతమాత్రంకావు, దీనికి భిన్నంగా ఔన్నత్యానికి, గౌరవనీయతకు దైవభీతి, సచ్ఛీలత, ఉన్నత నైతికత, సత్ప్రవర్తనే అసలైన గుర్తింపు, దైవభీతి పరాయణుడు, సౌశీల్యవర్తనుడు, సత్ప్రవర్తన గల మనిషే. అతను ఏ వంశం, ఏ కులం, ఏ గోత్రం, ఏ జాతి, ఏ దేశంలో పుట్టినాసరే, గౌరవనీయుడు, ఉన్నతుడు. దీనికి భిన్నమైన గుణాలు కలిగిన అనగా దైవవిద్రోహి, శీలరహితుడు, దుర్మార్గుడు, దుష్ప్రవర్తన కలవాడు, తాను ఏ తెగ, కులం, వంశం, గోత్రం, జాతి, దేశంలో పుట్టివున్నా సరే, అతను అధముడు, అల్పుడు, హీనుడు, నీచుడు, ప్రవక్తమహనీయులు(స) అరేబియాలోని ఖురైష్ తెగలో జన్మించారు. ఈ తెగవారికి తమ గౌరవోన్నతులపై, తమ వంశ మర్యాదలపై ఎంత గర్వం ఉండేదంటే, ఇతర తెగల వారిని, జాతుల వారిని, తమను సమీపించే అర్హతే లేదని విర్రవీగేవారు. మక్కా నగరాన్ని జయించిన చారిత్రాత్మక రోజున ప్రవక్త మహనీయులు తన ఖురైష్ వర్గీయుల్ని సంబోధిస్తూ ఇలా ఉపదేశించారు :

"ఖురైష్ ప్రజలారా! అజ్ఞాన కాలపు అహంభావాల్ని వంశం, గోత్రంపై గర్వపడటాన్ని అల్లాహ్ రూపుమాపాడు. ప్రజలారా! ప్రజలంతా రెండే వర్గాలుగా విభజించబడ్డారు. దైవభీతి,సచ్ఛీలత, సత్రవర్తన కలిగి దైవం వద్ద గౌరవోన్నతులు పొందినవారి వర్గం ఒకటి. దుర్మార్గం, దుర్వర్తనం, శీలరాహిత్యం కలిగి దైవం దృష్టిలో అధములు, అల్పులు, నీచులు అయిన వారిది మరోవర్గం. మానవులంతా ఆదం సంతతి లోనివారే. ఇక ఆదంను దైవం మట్టితో సృజించాడు.'

ప్రవక్త మహనీయులు(స) తన జీవితపు చివరి హజ్ సందర్భంలో, అరబ్బు దేశం నలువైపుల నుంచి ముస్లింలు మక్కా నగరం చేరినప్పుడు తమ ప్రసంగంలో ఇలా హితబోధ చేశారు.

"ప్రజలారా! జాగ్రత్త!! మీ అందరి ప్రభువు ఒక్కడే. అరబ్బు వ్యక్తికి అరబ్బేతరునిపై గాని, అరబ్బేతరునికి అరబ్బుపై గాని, ఏ తెల్లవానికి నల్లవానిపై గాని, ఏ నల్లవానికి తెల్లవానిపై గాని ఎలాంటి ఆధిక్యత లేదు. మీలో అందరికంటే ఎక్కువ భయభక్తులు కలవాడు, సశ్శీలుడైన వ్యక్తే దైవం దృష్టిలో అందరికంటే ఉత్తముడు."

ఇలాంటి ఆదేశ ఉపదేశాలు, ప్రసంగాలకు, మౌఖిక ఆదేశాలకు సిద్ధాంతాలకు మాత్రమే పరిమితమై ఉండిపోలేదు; ఆయన అనుచరవర్గంలో అరబ్బులు, అరబ్బేతరులు అందరూ ఉన్నారు. వీరిలో బానిసలూ ఉన్నారు. ఈ బానిసలకు ఖురైష్ వారితో సమానత్వమే కాదు, వీరి తరువాత ఇస్లాం స్వీకరించిన ఖురైష్ వారిపై ఆధిక్యత కూడా లభించి ఉండేది. వంద, రెండు వందల సంవత్సరాల తరువాత, ముస్లింలుగా మారిన ఇతర దేశాల విద్వాంసులు, అరబ్బులకు ధార్మిక గురువులయ్యారు. నేటికి కూడా భోజనాదుల్లో, సభా సమావేశాల్లో, ధార్మిక సంస్థల్లో మసీదుల్లో ఈ ఇస్లామియ సమానత్వాన్ని, సోదరత్వాన్ని చూడవచ్చు. వీరిలో వెనుకబడిన, నిమ్న జాతుల నుండి వచ్చి ఇస్లాం స్వీకరించినవారే అత్యధిక సంఖ్యలో ఉంటారు.

ఇస్లామీయ సమానత్వం, విశ్వమానవ సౌభ్రాతృత్వానికి మనోహరమైన, ప్రభావవంతమైన సన్నివేశం, హజ్ కోసం మక్కా చేరినప్పుడు కన్నుల పండువగా కనబడుతుంది. అందులో అరబ్బులు, ఈరానీయులు, అఫ్గాన్లు, టర్కిష్‌వాళ్ళు, భారతీయులు, మలేషియన్లు, ఇండోనేషియన్లు, అమెరికన్లు, బ్రిటీషర్లు, ఉజ్బెక్‌లు, చైనీయులు, జపానీయులు – అంతా పరస్పరం సోదరులుగా మారిపోతారు.

ఇస్లాంలో సర్వమానవ సమానత్వానికి మచ్చుతునకగా చూపే ఒక అపూర్వ సంఘటన ఇది! హజ్రత్ బిలాల్(రజి) ఉమయ్యా దగ్గర బానిస. ఉమయ్యా పెట్టే హింసలను చూడలేక హజ్రత్ అబూబకర్(రజి) ఆయన్ను ఉమయ్యా దగ్గరి నుంచి కొనేసి విముక్తి కలిగించారు. ఖురేష్ తెగలోనే పేరెన్నికగన్నవాడు, ఇస్లామీయ చరిత్రలో 'ఉమర్ ది గ్రేట్'గా ప్రఖ్యాతిగాంచిన, మహాప్రవక్త(స) తరువాత రెండవ ఖలీఫాగా ఎన్నికైన హజ్రత్ ఉమర్(రజి), ఈ బిలాల్ (రజి)ను చూడగానే లేచి నిలబడుతూ, రండి! మా సర్దారు రండి!! అంటూ ఆయన గౌరవార్థం తన కండువాను పరిచేవారు. సర్వమానవ సమానత్వానికి ప్రతిరూపమైన ఇలాంటి సన్నివేశాన్ని మానవ చరిత్ర ప్రదర్శించగలుగుతుందా? అందుకేనేమో స్వామి వివేకానంద ఇలా చెప్పకుండా ఉండలేకపోయారు.

*My experience is that if any religion approached to this equality in an appreciable manner it is Islam and Islam alone. (Letters- Page. 379)*

"సమానత్వానికి సంబంధించి ప్రశంసించదగిన ఈ స్థాయికి ఏ ధర్మమైన చేరగలిగిందంటే అది ఇస్లాం. కేవలం ఇస్లామ్ మాత్రమే అనేది నా స్వంత అనుభవం." (స్వామి వివేకానంద – ఉత్తరాలు పేజి : 379)



# 8. ఇస్లాం ఖడ్గ బలం ద్వారా వ్యాపించిందా?

ఇస్లాం ధర్మానికి వ్యతిరేకంగా జరిగినంత దుష్ప్రచారం ప్రపంచంలోని మరే ఇతర ధర్మానికి జరగలేదు. ఇది కూడా ఇస్లాంలోని ఇంకొక ప్రత్యేకత. ప్రప్రథమంగా దైవప్రవక్త(స) స్వజాతీయులైన ఖురైష్ తెగవారే ఆయన్ను వ్యతిరేకించారు. ఈ వ్యతిరేకత కోసం వారు అసత్య ప్రచారాన్ని,హింసా దౌర్జన్యాలను ఎన్నుకున్నారు. అయితే దీనికి వ్యతిరేకంగా ఎంత తీవ్రంగా అసత్య ప్రచారం జరిగిందో, అంతే శీఘ్రంగా అది పురోగమించిందనేది ఇస్లామీయ ధర్మపు ఇంకో విశిష్టత. ఇస్లాం నిజమైన దైవధర్మమనే దానికి ఇది కూడా ఓ తార్కాణం. ఇస్లాంకు వ్యతిరేకంగా అనేక విధాలుగా ప్రచారం చేయటం జరిగింది. ఆనాడు, ఈనాడు కూడా మోపబడే అన్నింటికన్నా తీవ్ర మైన నిందారోపణ, 'ఇస్లాం ఖడ్గబలంతో వ్యాపించిందనేది!'. అలా కాకపోతే, ప్రపంచంలో ఇన్ని మతాలు, ధర్మాలు ఉన్నప్పటికీ, ఇస్లాం ఇంత శీఘ్రంగా, విచిత్రంగా ఎలా వ్యాపించిపోతుంది?'. ఈ ప్రశ్నకు లేక అనుమానానికి తగిన సమాధానముంది. ఇస్లాం ఉద్భవన కాలంలో వివిధ ధర్మాల అనుయాయులు, వారి వారి ధర్మాల్ని పూర్తిగా చెడగొట్టారు. అందుకని మానవ జాతి సాఫల్యం కోసం దైవేచ్ఛను అనుసరించి ఇస్లాం సఫలీకృతమై మొత్తం ప్రపంచంలో వ్యాపించిపోయింది. దీనికి చరిత్రే సాక్ష్యంగా నిలిచింది.[23]

---

23. మక్కా అవిశ్వాసులు, తమ శక్తి సామర్థ్యాల్ని, తమ బల సంపదల్ని ఒడ్డి యుద్ధం చేసి ఇస్లామ్‌ను, ఉన్న పిడికెడంత మంది ముస్లింలను నామరూపా ల్లేకుండా సమాప్తం చేయాలని తీవ్రంగా కృషి చేస్తున్నప్పుడు ఈ క్రింది దైవవాణి అవత రించింది: సమానత్వానికి సంబంధించిన The Consolidated History of the World అనే గ్రంథ రచయిత 'అడ్జివెల్' ఇలా జోహార్లు అర్పించాడు: "సర్వమానవ సమానత్వం గురించి ప్రాచీనకాలం నుండి అనేకమంది సంస్కర్తలు

ప్రవక్త మహనీయులు(స) దైవదౌత్యాన్ని చేపట్టకముందు అరబ్బు జాతి పూర్తిగా ధర్మవిహీనతతో, పాపాల్లో, దుర్మార్గంలో కూరుకుపోయి ఉండేది. ఇలాంటి నీచమైన, పాపాల్లో కూరుకుపోయిన జాతిని సత్యవంతులుగా, సన్మార్గులుగా తీర్చిదిద్దడానికి, ప్రవక్త ముహమ్మద్(స) ఎలాంటి బాహ్య వనరులు లేకపోయినప్పటికీ, దైవకృపతో వీరిని సంస్కరించే నిమిత్తం ఒంటరిగా నిలబడ్డారు. సహృదయులైనవారు, ఆయన బోధనలకు ప్రభావితులై ఇస్లాం స్వీకరించనారంభించారు. కాని ఆయన జాతి నాయకుల్లో తమ పూర్వీకుల ధర్మాన్ని వదిలి, ఆయన్ను తమ ధార్మిక నాయకునిగా ఒప్పుకొని ఆయనకు విధేయులయ్యే ధైర్యము లేదు. అందుకని వారు ఆయన ప్రచార మార్గంలో అవరోధాలు సృష్టించి ఆయన్ను, ఆయన అనుచరుల్ని రకరకాలుగా హింసించ సాగారు. చివరికి వారి హింసా దౌర్జన్యాలను భరించలేక ముస్లింలలోని ఒక వర్గం, ప్రవక్తగారి అనుమతితో ఇథియోపియా దేశానికి వలసపోయింది. ఇక మక్కా నగరంలో దైవప్రవక్త(స), ఆయన అనుచరులపై హింసా దౌర్జన్యాలు మిన్నుముట్టాయి. మక్కా నగర పరిస్థితులు ఇలా ఉంటే, వేరొక వైపు మదీనా

---

చెబుతూ, ఉపదేశిస్తూనే వచ్చారు. చివరికి నజారెతుకు చెందిన ఏసుక్రీస్తు సయితం దీన్ని నొక్కి వక్కాణించారు. కాని సమానత్వపు ఈ సూత్రాన్ని మానవ చరిత్రలో మొట్టమొదటిసారిగా క్రియా పూర్వకంగా, సంపూర్ణ రూపంలో ఆచరించి చూపిన ఘనత కేవలం ముహమ్మద్‌కు మాత్రమే దక్కుతుంది." (First Edition)

"వారు అల్లాహ్ జ్యోతిని తమ నోటితో ఊది ఆర్పగోరుతున్నారు. కాని అవిశ్వాసులకు ఎంత అయిష్టంగా ఉన్నాసరే, అల్లాహ్ తన జ్యోతిని పూర్తిగా వ్యాపింపజేయటానికే నిర్ణయించుకున్నాడు. ఆయనే తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్ని, సత్య ధర్మాన్ని ఇచ్చి పంపాడు. దానిని సకల ధర్మాలపై ఆధిక్యం వహించే ధర్మంగా చేయ టానికి. ఇది బహుదైవారాధకులకు ఎంత అయిష్టమైనా సరే! (అస్ సఫ్: 8,9) అరేబియాలో బహుదైవారాధకులైన అరబ్బులేకాక, క్రైస్తవులు, యూదులు కూడా నివసిస్తుండేవారు. ఈ రెండు వర్గాల వారు కూడా ఇస్లాం పట్ల అత్యంత అసూయ ద్వేషాలు కలిగి ఉండేవారు. ఇస్లాం కత్తి బలంతోనే వ్యాపించిందనే దుష్ప్రచారాన్ని క్రైస్తవ దేశాలే లేపాయి. కాని ఇది నిరాధారమైన నింద అని ఆ దేశాలకు చెందిన

నగరంలో ఇస్లాం ఎలా ప్రవేశించిందో, ఎలా వ్యాపించిందో చూడండి. దీని ద్వారానే ప్రపంచంలో ఇస్లాం వ్యాప్తి చెందిన తీరును అర్థం చేసుకోవచ్చు. ఆ కాలంలోనే హజ్‌యాత్ర కోసం ఒక బృందం మదీనా నుంచి మక్కా వచ్చింది.[24] దైవప్రవక్త (స) వారికి ఇస్లాం సందేశమిచ్చారు. వారు ఇస్లాం స్వీకరించారు.

రెండవ సంవత్సరం దాదాపు 72 మంది హజ్ యాత్ర కోసం మదీనా నుండి వచ్చారు. దైవప్రవక్త(స) ప్రచారం, హితబోధతో వీరు కూడా ప్రభావితులై ఇస్లాం స్వీకరించారు. వారి అభ్యర్థన మేరకు, వారి తర్ఫీదు కోసం దైవప్రవక్త(స) తన అనుచరుడైన హజ్రత్ ముస్అబ్ బిన్ ఉమైర్ (రజి)ను వారితోపాటు మదీనా పంపించారు. ముస్అబ్ (రజి) గారి కృషి ఫలితంగా, ఇస్లాం మదీనాలో ఇంటింటా ప్రవేశించింది. మూడవ సంవత్సరం హజ్ సందర్భంగా ఒకపెద్ద సమూహమే మక్కా వచ్చింది. అందులో మదీనా నగరానికి చెందిన కొందరు నాయకులు కూడా ఉన్నారు. వారు, దైవప్రవక్త (స), మక్కాలోని ఇతర ముస్లింలు మదీనా వచ్చేయాలని, వారికి తాము అన్నిరకాల సహాయ సహకారాలు అందిస్తామని, అన్ని రకాలుగా రక్షిస్తామని దైవప్రవక్త(స) ముందు ఒక ప్రతిపాదన ఉంచారు. దానికి దైవప్రవక్త(స) అంగీకరించారు. ఇక మక్కాలోని ముస్లింలందరూ మదీనా వలస వెళ్లారు. ఇథోపియా తరువాత, ఇది రెండవ చారిత్రాత్మక వలస. ఇక ఎప్పుడైతే దైవప్రవక్త(స) మదీనాకు బయలుదేరారో,

---

విద్వాంసులే ఖండించారు. మన దేశంలో కూడా ఈ నిందారోపణ చేసినవారూ, దాన్ని ఖండించినవారు- రెండు రకాల విజ్ఞానులూ ఉన్నారు.

24. *ఇస్లాం ముఖ్య నియమాల్లో హజ్ అయిదవ నియమం (విధి) అన్నది నిజమే. కానీ దైవప్రవక్త(స) జననానికి దాదాపు 2500 సంవత్సరాలకు పూర్వం నుండి కాబా సందర్శన (హజ్) యాత్ర నడుస్తూనే ఉండేది. కాబాలయాన్ని నిర్మించిన హజ్రత్ ఇబ్రాహీం(అలై) కాలం నుండి ఈ ఆరాధన జరుగుతూనే వస్తున్నది. కాకపోతే ఆ తరువాత ఈ ఆరాధనలో బహు దైవారాధన చేష్టలు చోటు చేసుకున్నాయి. దైవప్రవక్త(స) తన హయాములో ఈ బహుదైవారాధనను, విగ్రహారాధనలకు సంబంధించిన అన్ని మూఢాచారాలను రూపుమాపి, ఏకేశ్వరాధనను స్వచ్ఛపరిచి హజ్‌యాత్రను కొనసాగించారు. (ప్రకాశకులు)*

అప్పటి పరిస్థితులు ఎలా ఉన్నాయంటే దైవప్రవక్త(స)ను హతమార్చే ఉద్దేశ్యంతో శత్రువులు ఆయన ఇంటిని చుట్టుముట్టి, ఖడ్గధారులై కాపలా కాస్తున్నారు. కాని ఆయన దైవ సంరక్షణలో, సురక్షితంగా ఇంటి నుంచి బయటికి వచ్చేశారు.[25]

ఇస్లాం ఉద్భవించిన తరువాత పదమూడు సంవత్సరాల సంక్షిప్త చరిత్ర ఇది. ఇస్లాం తన సత్యత, నైతిక శక్తితో, ఇంకా దైవప్రవక్త(స) ఆకర్షణీయమైన వ్యక్తిత్వ ప్రభావం కారణంగానే వ్యాపించి పోయిందని ఒప్పుకోవటంలో అవరోధమేముంది? యుద్ధాన్ని ఆయన వ్యతిరేకులే ఆయన (స)మీద రుద్దారు. దైవప్రవక్త(స) తమ ఆత్మరక్షణార్థం ఏ విధంగానైతే స్వదేశాన్ని వదలాల్సి వచ్చిందో, అదేవిధంగా ఆత్మ సంరక్షణార్థం యుద్ధాన్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. దైవప్రవక్త ముహమ్మద్(స) మరియు ముస్లింలు మక్కా నగరాన్ని విడిచి వెళ్ళిపోయిన తరువాత కూడా మక్కా అవిశ్వాసుల పగ, ద్వేషాలు చల్లబడలేదు. వారు మదీనాపై సాయుధ దాడులు మొదలుపెట్టారు. ఇకిప్పుడు ఇస్లాం సంరక్షణతోపాటు ముస్లింల ఉనికిని కూడా కాపాడుకునే అవసరం ఏర్పడింది. ఈ పరిస్థితుల్లో ముస్లింలకు తమ ఆత్మ సంరక్షణార్థం శత్రువును ఎదుర్కొని పోరాడే అనుమతి దైవం తరఫున లభించింది. మక్కాలో ఇస్లామీయ ఉద్యమం పూర్తిగా శాంతి పూర్వకంగా ఉండేదని, మదీనా చేరగానే శక్తిని పుంజుకొని తమ పాలసీని మార్చుకున్నారనేది వ్యతిరేకుల ప్రధాన ఆరోపణ. ఇదెంతటి అన్యాయమైన, విచక్షణారహితమైన ఆరోపణో పరిశీలించండి! ఆ పరిస్థితుల్లో 'మీ ప్రాణాల్ని, మీ ధర్మాన్ని రక్షించుకోనవసరం లేదు, మీ మెడలు నరికించు

---

*25. మక్కా నుంచి ఏ ఖడ్గమూ ముస్లింల వెంట మదీనా పోలేదు. మక్కాలోని ముస్లింలు, అత్యంతగా పీడించబడి, దయనీయ స్థితిలో ఉన్నారు. ఇక మక్కా నుండి, మదీనాకు వెళ్ళిన ముస్లింల చేతుల్లో ఖడ్గాలు కూడా లేవు. వారక్కడికి సిపాయిలుగా కాదు, దీనావస్థలో శరణార్థులుగా వెళ్లారు. అయినప్పటికీ మదీనా నగరంలోని ప్రతి ఇంటిలో ఇస్లాం వ్యాపించింది. (ప్రకాశకులు)*

కోండి' అని దైవప్రవక్త(స) ముస్లింలను ఆదేశించి ఉండాల్సిందనా వీరి అభిప్రాయం!! కాస్త ఆలోచించండి. ఆత్మ సంరక్షణార్థం కూడా శత్రువును ఎదుర్కో వద్దనే సూత్రం ఏ ధర్మంలోనైనా, ఏ రాజకీయంలోనైనా ఉందా? శ్రీరామచంద్రుడు సతీమణి కోసం, శ్రీకృష్ణుడు భూమి కోసం యుద్ధం చేశారే! శ్రీరామచంద్రుని యుద్ధం వల్ల జాతికి, దేశానికి ఒనగూడిన ప్రయోజన మేమిటి? శ్రీకృష్ణుడు చేసిన యుద్ధం కారణంగా ఆయన బంధువులూ, అర్జునుని వంశం సర్వనాశనమై, దేశం బలహీనపడిపోయింది. దైవప్రవక్త ముహమ్మద్(స) చేసిన యుద్ధంలో, ఆయన జాతికి చెందిన వ్యతిరేకులు బహుకొద్ది మంది మాత్రమే వధింపబడ్డారు. మక్కా నగరాన్ని జయించిన సందర్భంలో ఇరువై ఒక్క సంవత్సరాలు తనను, తన అనుచరుల్ని యమ యాతనలకు గురిచేసిన శత్రువుల్ని, పెద్దపెద్ద నేరస్తుల్ని ఆయన క్షమించి వదిలేశారు. జాతి సురక్షితమై పోయింది. ఇస్లాం స్థాపితమయింది. వివిధ తెగల్లో విభజించబడి, చిందర వందరగా ఉన్న దేశం, ఇస్లామీయ వ్యవస్థతో సుసంఘటితమై ఒక శక్తివంతమైన రాజ్యంగా రూపొందింది.

ఇస్లాంను కత్తి బలంతో వ్యాపించిన ధర్మంగా పేర్కొనేవారు ఒక విష యాన్ని మరిచిపోకూడదు. అరబ్బు ముస్లింలను ఘోరంగా ఓడించిన, తాతారి ముస్లిమేతరులు (మంగోలులు), విజయం తరువాత పరాజిత జాతి ధర్మమైన ఇస్లాంను స్వీకరించారు. విచిత్రాతి విచిత్రమైన ఈ సంఘటన ఎలా సంభవిం చిందో? కత్తి బలం అని అనుకుంటే ఆ కత్తి బలం విజేత అయిన తాతారి జాతి వారి చేతిలో ఉంది. మరి ఆ కత్తి బలం ఇస్లాంకు ఎలా లొంగిపోయింది? ఇస్లా మీయ ధర్మవ్యాప్తిపై నిరాధారమైన నిందలు మోపే వ్యతిరేకుల వద్ద దీనికి సమాధానమేమైనా ఉందా?

మంగోలుల క్రూరత్వాన్ని కడిగివేసే, ఉపశమింపజేసే ప్రత్యామ్నాయం ఇస్లాంలో తప్ప ఏ ఇతర ధర్మంలోనైనా ఉండిందా? సర్వ ప్రపంచం, ఈ మంగోలుల క్రూరత్వానికి, దౌర్జన్యానికి గజగజలాడిపోయిందే! ఇలాంటి

క్రూరమైన మొరటుజాతిని సంస్కరించి, వారికి సభ్యతా సంస్కారాలను నేర్పి వారిని సభ్య మానవులుగా తీర్చిదిద్దిన ఏకైక ధర్మం ఇస్లాం! ఈ గౌరవం కేవలం ఇస్లామీయ ధర్మానికే దక్కుతుంది. చైనా, తూర్పు ఆసియా దేశాలు, (ఇండో నేషియా, మలేషియా మొదలగునవి) ఇంకా ఆఫ్రికాలో ఇస్లాం కత్తి బలంతో వ్యాపించినట్లు చరిత్ర అయితే తెలుపదు.

మధ్యయుగపు కాలంలో ఐరోపాలో, భారతదేశంలో లేక ఇతర దేశాల్లో జరిగిన యుద్ధాల్లో ముస్లింలు ఒక పక్షంగా పాల్గొని విజేతలై, అక్కడ ముస్లిం సమాజాలు ఏర్పడిన సందర్భంలో విజేత జాతిలో ఉండే ఉద్రేకం కారణంగా, సంస్కారహీనులైన, వివేకాన్ని కోల్పోయిన కొందరు ముస్లింలు, తాము విజేతలనే గర్వంతో శక్తిని, బలాన్ని ఉపయోగించే అవకాశముంది. దాన్ని కాదనలేము. కాని యుద్ధాల్లో సర్వసామాన్యంగా జరిగే ఇలాంటి ఉద్రేకపూరిత, వివేచనా రహితమైన కొన్ని చెదురుముదురు సంఘటనల్ని ఇస్లాం ఖాతాలో పడేయడం ఘోరమైన అన్యాయం. ముస్లింలతో ముస్లింలకు, హిందువులతో హిందువులకు, క్రైస్తవులతో క్రైస్తవులకు, రాజపుత్రులతో రాజపుత్రులకు నడుమ జరిగిన అంతర్యుద్ధాలు, మరాఠాలకు మరాఠాలతో, మొగలులకు పఠాన్లతో జరిగిన యుద్ధాల లాంటివే ఈ యుద్ధాలు కూడా. అందుకని వాటిని అదే దృష్టితో చూడాలి.

రాజకీయ కారణాలు, సందర్భాల నుండి దృష్టి మరల్చి హిందూ - ముస్లిం పరిపాలకుల మధ్య జరిగిన ఘర్షణలకు, యుద్ధాలకు కారణం కేవలం ఇస్లామీయ ధర్మమే అనటం ఎంతవరకు సమంజసం? ఇది వాస్తవం, న్యాయం అనబడుతుందా?

పూర్తిగా ముస్లింలతో కూడిన సైన్యానికి మొత్తం హిందువులతో కూడిన సైన్యానికి మధ్య భారతదేశంలో జరిగిన యుద్ధాలు బహు అరుదు. ప్రారం భంలో అలా జరిగి ఉంటే ఉండొచ్చు. కాని భారతదేశంలో ముస్లింలు శాశ్వత

నివాసం ఏర్పరచుకున్న తరువాత అలా జరిగి ఉండలేదు. క్రీ.శ. 1565లో తళ్ళీకోటలో బహ్మనీ ముస్లిం రాజ్యాలు, విజయనగరానికి చెందిన హిందూ రాజ్యానికి మధ్య జరిగిన యుద్ధంలో నిస్సందేహంగా ముస్లింల ద్వారా బాగా విధ్వంసం జరిగింది. కాని అంతకుముందు విజయనగరానికి చెందిన హిందూ రాజు అహ్మద్‌నగర్ ముస్లిం రాజ్యాన్ని సర్వనాశనం చేసి ముస్లింలపై అత్యంతగా దౌర్జన్యాలు జరిపాడు. దాని ప్రతీకారమే తళ్ళికోట యుద్ధం.

మెక్సికోలో క్రైస్తవుల ద్వారా లక్షలాది క్రైస్తవేతరులు సంహరించబడ్డారు. బౌద్ధ ధర్మ జన్మస్థానమైన భారతదేశం నుంచి బౌద్ధ మతం దానంతటదే తుడిచిపెట్టుకుపోలేదు. దానికి బదులు బ్రాహ్మణరాజు పుష్యమిత్రుని ద్వారా బౌద్ధులు అత్యంతగా హింసించబడ్డారనే చారిత్రక వాస్తవాలను, ఈ విమర్శకులు మరిచిపోకూడదు.

తమ మతానికే చెందిన వారిని సజీవ దహనం చేసిన క్రైస్తవులు, కరడుగట్టిన ధార్మిక ఉన్మాదులైన పోర్చుగీసు వారు, దూషించదగిన రీతిలో మిషనరీల ద్వారా ఆర్థిక ప్రలోభం చూపి మతమార్పిడీలకు పాల్పడడం కేవలం రాజ్యవిస్తరణా కాంక్ష, అధికార దాహం తప్ప ఇంకేమీ కాదు. నల్ల క్రైస్తవులపై, తెల్ల క్రైస్తవుల హింసా- దౌర్జన్యాలు, హిందువుల్లోనే తమ స్వధర్మీయులైన హరిజనులపై ప్రాచీన కాలం నుండి నేటివరకు జరుగుతూ వస్తున్న హింసా-దౌర్జన్యాలు, కాల్పనిక 'ముస్లిం ధార్మిక ఉన్మాదం' కంటే ఎన్నో రెట్లు ఎక్కువ. నిజానికి ఇస్లాంలోని సహజత్వం, నిజమైన సర్వమానవ సమానత్వం, నైతిక శక్తిసామర్థ్యాల ద్వారానే దాని పురోగమనం సాధ్యమయింది.

## 9. 'కాఫిర్' అనే పదానికి అర్థం ఏమిటి?

'కాఫిర్' అనే పదం 'హిందూ' అనే పదానికి ప్రత్యామ్నాయమూ కాదు. దాని అర్థం అంతకన్నా కాదు. దీని సిసలైన అర్థం 'కృతఘ్నుడు' అని వస్తుంది.

ఇంకొక అర్థం 'నిరాకరించేవాడు' అని. అందుకని ఎవరైనా ఓ వ్యక్తి మహనీయ ముహమ్మద్(స) దైవదౌత్యాన్నిగాని, ఖుర్ఆన్‌ను గాని అంగీకరించడం లేదంటే, విశ్వసించడం లేదంటే అతడు 'నిరాకరించేవాడు'గానే పేర్కొనబడతాడు. దీన్నే అరబ్బీ పరిభాషలో 'కాఫిర్' అంటారు. ప్రవక్త ముహమ్మద్(స)ను, ఖుర్ఆన్‌ను విశ్వసించనివారి కోసం 'కాఫిర్' అనే పదం ఉపయోగించబడింది ఖుర్ఆన్‌లో. ఈ భావాన్ని అనుసరించి యూదులు, క్రైస్తవులు, పారశీకుల కోసం ఈ 'కాఫిర్' అనే పదం ఉపయోగించబడింది. ముస్లిమేతరుల మాట అటుంచి, స్వయంగా ఒక ముస్లిం కూడా ఇస్లాం విశ్వాసాల్లో, లేక విధుల్లో ఏదో ఒకటి ఉదాహరణకు నమాజ్ లాంటి విధిని నిరాకరిస్తే అతను 'కాఫిర్' అనబడతాడు.

వైదిక ధర్మంలో 'కాఫిర్'కు ప్రత్యామ్నాయ పదం 'నాస్తిక్' అని ఉంది. గౌతమ బుద్ధుడు వేదాల్ని విశ్వసించేవాడు కాదు. అందుకని ఆయన కోసం 'నాస్తిక్' అనగా కాఫిర్ (అంటే నిరాకరించేవాడు) అనే పదం ఉపయోగించ బడుతుంది. బౌద్ధ ధర్మం స్పష్టమైన రూపంలో హిందూ ధర్మం కన్నా భిన్నమైన ఒక ప్రత్యేక ధర్మం. ఈ వాస్తవం దృష్ట్యా కాఫిర్ అనే పదం హిందువుల కొరకు గాని, లేక 'నాస్తిక్' అనేపదం ముస్లిముల కొరకు గాని అవమానకరమైన పదం కాదు. కాని వ్యవహారిక రూపంలో ముస్లింలు, హిందువుల్ని హిందువులనే అంటారు. రాస్తారు కూడాను. (కాఫిర్ అని కాదు). ఇక హిందువులు కూడా ముస్లింలను ముస్లింలనే పిలుస్తారు, రాస్తారు. ఇది సభ్యత కూడాను. కాని ఇస్లాంలో ముస్లిమేతరుల కోసం కేవలం ఒక్క 'కాఫిర్' అనే పదం మాత్రమే ఉంది. ఇదిలా ఉండగా హిందూ ధర్మంలో హిందువేతరుల కోసం స్పష్టమైన రూపంలో, అవమానకరమైన అనేక పదాలున్నాయి. ఉదాహరణకు అనార్య (ఆర్యేతరుడు), అసభ్య (అసభ్యుడు అంటే సంస్కారం లేనివాడు), దాస్యు (దోపిడీదారు), మ్లేచ్ఛ (మలీచుడు) మొదలగునవి. హిందూత్వంలోనైతే, తమలోని ఒక వర్గానికే అంతజ్య (శూద్రులు), చండాల, అంటరానివారుగా

పిలుస్తారు. (ఇస్లాంలో కాఫిర్ అనే పదం ఒక గుణాన్ని తెలిపే (గుణవాచక పదం తప్ప అవమానకరమైనది కాదు)

## 10. ఒకే కుటుంబంలో వివాహ సంబంధాలు

ఒకే కుటుంబంలో వివాహం గురించి ఇస్లాం అనుమతించిన పద్ధతి పట్ల కూడా అభ్యంతరం చెప్పడం జరుగుతోంది. అయితే ఇలాంటి వివాహాలు మానసికంగాను, వంశపరంగాను, ఆర్థికంగాను, సామాజికంగాను అన్ని కోణాల దృష్ట్యా ఎంతో మేలైనవి, అభిలషించదగినవి కూడాను. కుటుంబం లేక వంశంలో వివాహ సంబంధాలు ఏర్పరచుకోవటం అనేది ఇతర ధర్మాల్లో కూడా ఉంది. హిందువులకు సంపూర్ణ అవతారమైన శ్రీకృష్ణునికి కూడా ఇలాంటి వివాహాలు ఆమోదయోగ్యమైనవే అనేది తెలియవలసిన విషయం. ప్రతి విషయంలో హిందువుల్లో అత్యధికంగా వ్యతిరేకత, భిన్నత్వం కనబడు తుంది. ఒకే కుటుంబం, ఒకే వంశంలో వివాహ సంబంధాలు ఏర్పరచుకో వటంలో కూడా ఈ తేడాలు కనబడతాయి. వారు తమ పూర్వీకుల చారిత్రక విలువల్ని కాపాడుకుంటున్నామని చెప్పుకున్నప్పటికీ, నకారాత్మ నైతిక విలువలు (Negative Morality) అనే పేరు పెట్టి ఆ చారిత్రక విలువల నుంచి విము ఖులై పోవటం హిందువుల్లో ఆచారంగా వస్తున్నదే- ఇదిలా వుండగా, ఇస్లాంలో ఒకే వంశంలోనే ఎవరిని వివాహమాడవచ్చు, ఎవరిని వివాహమాడ కూడదు అనేదానికి పునాది మానసికమైనది. దీన్ని క్లుప్తంగా అర్థం చేసుకోవ టానికి ఒక ఉదాహరణకు, ఒక మనిషికి తోడబుట్టిన చెల్లెలికి, వరుసకు చెల్లెలు అయిన యువతి పట్ల ఉండే మానసిక భావనలు ఒకే తీరుగా ఉండవు. ఇక హిందువుల్లో కుటుంబాన్ని కాదని ఇతర కుటుంబాల్లో సంబంధాలు ఏర్పరుచుకోవటం మూలంగా మొదటి తరంలో కాకపోయినా రెండవ తరంలోనైనా సరే ఇద్దరు స్వంత అన్నదమ్ముల కుటుంబాలు పరస్పరం అపరిచితమైనవిగానే మిగులు

తాయి. ఒక ధనికుడైన సోదరుడు తన కుమారుని పెళ్లి తన పేద సోదరుడు లేదా సోదరి కుమార్తెతో చేసి వారికి అత్యంతగా సహాయం చేసినవాడవుతాడు. వారి ఆర్థిక పరిస్థితులను బట్టి లేదా తాత్కాలి కంగా చేసే సహాయం అంత ప్రభావం చూపేదిగా ఉండబోదు. అంతేకాకుండా ఆ సహాయం పొందిన వారిలో అది ఒక న్యూనతా భావాన్ని సృష్టిస్తుంది. కుటుంబంలోనే వివాహం చేసుకోవడమనేది వాస్తవానికి ఒక మేలైన సమాజ నిర్మాణానికి మూలం కాగలుగుతుంది. ఒకే కుటుంబంలో వివాహం చేయ కూడదనే ఆంక్ష కారణంగా వరకట్నాలు పెరిగిపోతాయి. దీనివల్ల కుటుంబ శాంతి సామరస్యాల వాతావరణం నాశనమైపోతుంది. అమ్మాయి జన్మించగానే ఆమె వివాహం ఎక్కడ చేయాలి? అనే చింత తల్లిదండ్రులను పట్టి పీడిస్తూ ఉంటుంది. ఒకే వంశంలో, ఒకే కుటుంబంలో కావలసిన యోగ్యత గల యువకులు ఉన్నప్పటికీ, సంబంధాల కోసం తిరుగుతూ, తిరుగుతూ పిల్ల తండ్రి కాళ్ళచెప్పులు అరిగిపోతాయి. అపరిచితులు, తమకు తెలియనివారితో పెళ్ళి సంబంధాలు ఏర్పరచుకోవటం వల్ల కొన్ని సందర్భాల్లో భయంకర పరిణామాలు బయటపడతాయి. సంపూర్ణ అవతారమైన శ్రీకృష్ణునికి ఒకే కుటుంబం లోపల జరిగే వివాహాలు ఆమోదమైనవే. కుంతీదేవి శ్రీకృష్ణుడు, సుభద్రకు మేనత్త. అర్జునుడు కుంతీ కుమారుడు. ఈ వరుసన సుభద్రకు, అర్జునుడు మేనరికంలో సోదరుడవుతాడు. అయినా వీరిద్దరికీ వివాహం జరిగింది. ఇదేవిధంగా అభిమన్యుడు, శ్రీకృష్ణునికి, బలరామునికి మేనల్లుడు అవుతాడు. కాని అతని వివాహం శ్రీకృష్ణుని సోదరుడైన బలరాముని కుమార్తె శశికళతో జరిగింది. శ్రీకృష్ణుడు, రాధ పట్ల ఆకర్షితుడై ఉండేవాడు. కాని రాధ వరుసకు శ్రీకృష్ణునికి మేనత్త అవుతుంది. పృధ్వీరాజ్ చౌహాన్, జయచంద్రులు చారిత్రక వ్యక్తిత్వాలు. వీరిద్దరూ కూడా పరస్పరం చిన్నమ్మ, పెద్దమ్మల కుమారులు, సోదరులును. పృధ్వీరాజ్ చౌహాన్, జయచంద్రుని కుమార్తె అయిన సంయోగితా

ప్రేమలో పడ్డాడు. ఈ ప్రేమ మానవ నైజానికి వ్యతిరేకమైనదేమీ కాదు. ఒకవేళ అప్పుడు వీరిద్దరి వివాహమే గనుక జరిగి వుంటే, జయచంద్రుడు, పృధ్వీరాజ్ ఇద్దరి పతనం– ఫలితంగా హిందూ రాజ్య పతనం జరిగి ఉండకపోయేది. ఈ వాస్తవాల నేపథ్యంలో ఒకే కుటుంబంలోపల వివాహ(Congnate Marriage) నిషేధం పట్ల హిందువులు గర్వించటం తగదు. (అదేవిధంగా ఇస్లామీయ సమాజంలో, కుటుంబం లోపల వివాహ అనుమతిని ఆక్షేపించడం ఏ విధంగాను సముచితం, సమంజసం కానేరదు.

## 11. ఇస్లాం మరియు బానిసత్వం

ఇస్లామీయ ధర్మం బానిసత్వాన్ని కొనసాగించి తప్పు చేసిందని, లేక ఇస్లామీయ ధర్మం బానిస వ్యవస్థను సమర్థిస్తుందని ఎవరైతే భావిస్తున్నారో వారు సంపూర్ణంగా భ్రమలో పడి ఉన్నారనటంలో సందేహం లేదు. మానవుడిని త్రికరణశుద్ధిగా సమానత్వాన్ని కాంక్షించే వానిగా తీర్చిదిద్దే యోగ్యత, సామర్థ్యం ఏ ధర్మంలోనైనా ఉందా అంటే అది ఇస్లాం కేవలం ఇస్లామీయ ధర్మం ఒక్క దానిలోనే.

బానిస ఆచార నిర్మూలనకు ఇస్లాం, ఇస్లామీయ ప్రవక్త(స) మానసిక పద్ధతుల్ని అవలంభించారు. చెడు ఆచార, వ్యవహారాలను మానసిక పరివర్తనం, సంస్కరణల ద్వారా నిర్మూలించిన ఏకైక ధర్మం ఇస్లామే. ఒకరోజుకు డెబ్బై సార్లు బానిసల తప్పుల్ని మన్నించమని బానిసను 'బానిస' అని కాకుండా 'బాబూ, పాపా' అని సంబోధించమని, బానిసతో అతని శక్తికి మించిన పని చేయించవద్దని, అతని కష్టమైన పనుల్లో అతనికి తోడ్పడమని, 'మీరందరూ కూడా దేవుని బానిసలే' అంటూ మహోన్నతమైన, ఉత్కృష్టమైన బోధనలిచ్చి ఇస్లామీయ ప్రవక్త(స) బానిసత్వ వ్యవస్థ పునాదుల్నే పెకళించివేశారు. బానిసల కష్టాల్ని, దురవస్థల్ని దూరపరచటమే కాకుండా ఇంకొంచెం ముందుకుపోయి వారి అంతస్తును, స్థాయిని ఉన్నతం చేయటం జరిగింది.

ఇస్లాంలోని సమానత్వానికి సంబంధించి మంత్రముగ్ధులుగా చేసే, అద్భుతమైన ప్రభావాలకు చరిత్రే సాక్ష్యంగా నిలిచింది. భారతదేశంలోనైతే బానిస వంశ రాజ్యం దీనికి తిరుగులేని సాక్ష్యం. అయితే ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. ఈ బానిసలు తమ బలశక్తుల ఆధారంగా పరిపాలకులు కాలేదు, దానికి బదులు వారిలోని యోగ్యత, సమర్థత కారణంగా వారు సింహాసనాన్ని అధిష్టించారు. ముస్లిం పరిపాలకులు, సమర్థులు, యోగ్యులు అనిపించిన బానిసల్ని తమ కన్నబిడ్డల్లాగా ప్రేమ, వాత్సల్యంతో పెంచిపోషించి సంస్కరించారు. దీనికి భిన్నంగా ప్రభుత్వపరంగా చట్టాలు, శాసనాలు చేసినప్పటికీ నల్ల క్రైస్తవుల పట్ల, తెల్ల క్రైస్తవుల హింసా దౌర్జన్యాలు అగ్రవర్ణాలకు చెందిన హిందువులు కోట్లాది దళితులు, హరిజనుల పట్ల చూపుతున్న నిరాధారణలు– నేటికీ యధావిధిగానే కొనసాగుతున్నాయి. ఇది 'బానిస వ్యవస్థ'కన్నా హీనమైనది. (ఏ బానిస వ్యవస్థ గురించి ఇస్లాంను నిందారోపణకు గురిచేయటం జరుగుతున్నదో, ఇది అంతకన్నా హేయమైన స్థితి. ఈ బానిసలు తమ యోగ్యతల కారణంగా కేవలం అధికార పీఠాన్ని మాత్రమే అధిరోహించలేదు, వారిలో విద్వాంసులు, ధార్మిక వేత్తలు, మత గురువులు కూడా వెలిశారు)[26]

---

*26. నలుగురు భార్యల సమస్య ఎలాంటిదో, ఈ బానిస వ్యవస్థకు సంబంధించిన సమస్య కూడా అలాంటిదే. అనాది కాలం నుండి అరేబియా దేశంలో బానిస వ్యవస్థ ఉంటూ వచ్చింది. ముగ్గురు, నలుగురు బానిసలైతే సామాన్యంగా ప్రతి ఇంటిలోనూ ఉంటుండేవారు. ఇక ధనిక కుటుంబాలైతే అంతకన్నా ఎక్కువ సంఖ్యలోనే బానిసలను కలిగి ఉండేవి. బానిసలు, అరబ్బుల వ్యక్తిగత, ప్రైవేట్ జీవితంలో అనివార్య అంశంగా ఉంటుండేవారు. వారు తమ యజమాని తోటల్లో, చేలల్లో పనిచేస్తుండేవారు, కాపలా కాస్తూ ఉండేవారు. ఒంటెలు, మేకలు, గొర్రెలను మేపుతుండేవారు. ఇక బానిస గత్తెలు ఇంటి పనులు చేసుకుంటుండే వారు. వారి జీవితావసరాలు, వారి భుక్తి సర్వం వారి యజమానులపైనే ఆధారపడి*

ఉండేది. ఇలాంటి పరిస్థితుల్లో ఒకవేళ ఇస్లాం అకస్మాత్తుగా బానిసలకు విముక్తి కలిగించే చట్టాన్నే గనక తెచ్చి ఉంటే దాని పర్యవసానం ఎలా ఉండేది? ఒక వైపేమో ఈ బానిసలు నిలువ నీడ లేకుండా ఎలాంటి ఆర్థిక వనరులు లేకుండా నిస్సహాయులై పోయేవారు. మరో వంక ఈ అరబ్బుల జీవన వ్యవస్థ మొత్తమే అతలాకుతలమైపోయేది.

ఈ పరిస్థితుల కారణంగానే ఇస్లాం బానిస వ్యవస్థను అకస్మాత్తుగా, ఒక్క కలం పోటుతో సమాప్తం చేయుటం ఆచరణా సాధ్యంకాదని సైద్ధాంతికంగా అనుచితమైనదిగాను భావించింది. అయితే అది బానిసల్ని విముక్తి కలిగించడానికి ప్రజలకు ప్రేరణ ఇచ్చి, ఇది పుణ్యప్రదమైన కార్యం అని, సత్కార్యమని ప్రోత్సహించింది. ఇక బానిసల్ని కలిగి ఉన్నవారిపై ఎలాంటి నియమ నిబంధన లను విధించిందంటే దాని ఫలితంగా ఈ బానిస కూడా ఆ కుటుంబంలోని సభ్యునిగా మారిపోయాడు.

బానిసలకు సంబంధించి వారి యజమానులకు ప్రవక్త మహనీయులు(స) ఇలా ఉపదేశించారు : 'మీ బానిసలు మీకు సోదరులు. అందుకని ఎవరి అధీనంలో వారి సోదరులున్నారో (ఇక్కడ 'బానిస'కు బదులు 'సోదరుడు' అనే పదం వాడబడడం గమనార్హం) వారు, తాము తిన్నదే అతనికి తినిపించాలి, తాము తొడిగిందే అతనికి తొడిగించాలి. అతని శక్తికిమించిన పనిని అతనికి అప్పగించకూడదు. ఒకవేళ ఎప్పుడైనా అలాంటి పని అప్పగించవలసి వస్తే తాను కూడా అతనికి సహాయపడాలి.

దీనితోపాటు బానిసల్ని విముక్తి కలిగించటానికి ఎన్నో మార్గాలు పరిచయం చేయబడ్డాయి.

ఉదాహరణకు 1. బానిసలకు విముక్తి ప్రసాదించడం ఓ దానంగా పేర్కొనడం జరిగింది. అందుకని ప్రజలు తమ బానిసలకు విముక్తుల్ని చేయడమేకాకుండా ఇతరుల వద్ద ఉన్న బానిసల్ని కొని వారికి స్వేచ్ఛ ప్రసాదించసాగారు.

2. రమజాను మాసంలో ఉపవాసం ఉండి, ధార్మిక సడలింపు (అనుమతి) లేకుండా, ఉపవాసాన్ని భంగపరిస్తే దాని పరిహారంగా ఇతర విషయాలతో పాటు ఒక బానిసకు విముక్తి కలిగించాలని పేర్కొనటం జరిగింది.

*3. ఎవరైనా ఓ వ్యక్తి ఒక విషయంలో ప్రమాణంచేసి భంగపరిచినట్లయితే దాని పరిహారంలోని ఇతర విషయాలకు తోడు ఒక బానిసను విడుదల చేయటం కూడా ఒకటని నిర్ణయించటం జరిగింది.*

*4. అరబ్బులు అప్పుడప్పుడు తన భార్యలతో అసంతృప్తులై 'నీవు నా తల్లితో సమానమని' అనేసేవారు. అంటే నీతో లైంగిక సంబంధం పెట్టుకోను అని ప్రమాణం చేసేవారు. అలాంటి వ్యక్తి ఈ అబద్ధం, అవాస్తవం నుంచి బయటపడడానికి ఈ తప్పుకు పరిహారం చెల్లించాలనేది నియమం. ఈ పరిహారపు వివిధ రూపాల్లో, బానిసకు విముక్తి కలిగించడం కూడా ఒకటి.*

*5. బానిసగత్తెతో (స్త్రీ బానిస) యజమాని సంభోగించే అవకాశాలు ఎంతైనా ఉంటాయి. దీని అత్యంత తీవ్రమైన నైతిక, సామాజిక పరిణామాలు కూడా బయల్పడతాయి. అందుకని ఇలాంటి చెడు పరిణామాలను ఎదుర్కోవటానికని, దానికి అడ్డుకట్ట వేయటానికని ఇస్లాం ఈ బానిసగత్తెకు ఒక రకంగా, యజమాని భార్య అంతటిస్థాయిని కల్పించింది. ఈమెకు జన్మించిన సంతానాన్ని బానిసగా, బానిసగత్తెగా కాక, 'స్వతంత్ర్య జీవి'గా పేర్కొన్నది.*

*భారతదేశంలో బానిస వ్యవస్థ (దాస్యప్రథా)కు ధార్మిక లైసెన్సు ఉండేది. దాసి పుత్రుడు, జన్మాంతం బానిసగానే ఉండేవాడు. అందుకని అతను, ఎప్పుడూ కూడా ఎట్టి పరిస్థితిలోనూ 'బానిసత్వం' నుండి విముక్తి పొందలేడు.*

*మనుస్మృతిలోని ఈ వాక్యాన్ని గమనించండి. 'బ్రహ్మ, బ్రాహ్మణుని సేవ కోసమే అతన్ని సృష్టించాడు, కనుక శూద్రుడు కొనబడినవాడైనా, కాకపోయినా అతనితో నిరంతరం సేవ చేయించుకోవాలి."*

*'యజమాని విడిచిపెట్టినా (విముక్తి కలిగించినా) సరే శూద్రుడు మాత్రం సేవ, పరిచర్యం నుండి విముక్తి పొందజాలడు. ఎందుకంటే ఇది అతని స్వాభావికమైన విధి, కర్తవ్యం. దీన్నుండి అతన్ని ఎవ్వరూ మినహాయించలేరు."*

*"యుద్ధాలలో పరాజితుడై బంధింపబడిన, తిండి ఆశతో తనంతట తానుగా వచ్చినా, బానిసగత్తె గర్భంలో జన్మించినా, కొనబడినా, ఎవరిచేతనైనా (కానుకగా)*

ఇవ్వబడిన, తాతదండ్రుల కాలం నుండి (ఇంటి) పని చేస్తూ వచ్చినా, శిక్ష కోసమో, అప్పు తీర్చటం కోసమో బానిసగా మారినా, ఈ సప్తరకాల బానిసలు, బానిస సంతతి (దాస్య యోని)కి చెందినవారు." (మనుస్మృతి 8-413-415)

"అవసరం వచ్చిపడినప్పుడు అపరిచితుడైన శూద్రుని సొమ్మును బ్రాహ్మణుడు నిస్సంకోచంగా తీసుకోవచ్చు. ఎందుకంటే అతని వద్ద ఉన్న సొమ్ము అసలతనిది కానేకాదు, ఆ సొమ్మంతా అతని యజమాని (బ్రాహ్మణునికి) చెంది నది."(మనుస్మృతి : 8-417)

ఆ కాలంలో భారతదేశంలో ఆచారంలోఉన్న బానిసల పరిస్థితి ఇది. అరేబియాలో బానిసలదంటూ ఒక ప్రత్యేక జాతి గాని, వర్గం గాని లేదు. బానిసలు స్వతంత్రులుగా కూడా మారుతుండేవారు. భారతదేశంలో చెలామణిలో ఉండిన బానిస వ్యవస్థకు ధార్మిక ఆధారముండేది. ఇక అరేబియాలో ఇస్లాం ఉద్భవించగానే బానిసలకు విముక్తి కలిగించటం ధార్మికంగా ఒక మంచి పనిగా, పుణ్యప్రదంగా పేర్కొనటం జరిగింది. భారతదేశంలో సూఫీ మహానుభావులు అరుదెంచిన తరువాత వారు లక్షలాది మంది శూద్రుల్ని ఈ (నిమ్నత్వం నుండి) పైకెత్తారు. వారిని తమ గుండెలకు హత్తుకున్నారు. తమతో సమానమైన హెూదానిచ్చి గౌరవించారు. భారతదేశంలోని కోట్లాది ముస్లింలు, ఇలాంటి శూద్రుల సంతతికి చెందినవారే. అరబ్బు దేశాల్లోని, భారతదేశంలోని బానిసల సంతానం, ముస్లింల ధార్మిక గురువులయ్యారు. కాని హిందువుల్లోని అగ్రవర్ణము నేటికినీ శూద్రుల హక్కులకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తూనే ఉంది.



# 12. శవ సంస్కారంలో దహన సంస్కారం మంచిదా? ఖననం మేలైనదా?

ముస్లింల శవాన్ని పూడ్చివేయడం (ఖననం చేయడం) అశాస్త్రీయమైనది (Unsceintific)గా పేర్కొనడం జరుగుతుంది.[27] కాని కాలబెట్టడం కన్నా పూడ్చటమే సరైన, శాస్త్రీయమైన, సముచితమైన విధానం. ముస్లింలు, క్రైస్తవులు, యూదులు మృతుడ్ని పూడ్చే పద్ధతిని అవలంభిస్తారు. ఇక హిందువులు, బౌద్ధులు, సిక్కులు తమ శవాల్ని కాల్చి బూడిద చేసే పద్ధతిని పాటిస్తారు. మొత్తం ప్రపంచ జనాభా రీత్యా చూస్తే శవాల్ని పూడ్చివేసే వారే అత్యధికంగా ఉన్నారు. వైజ్ఞానిక రంగంలో ముందంజలో ఉన్న అమెరికా, యూరప్ మొదలుగు దేశాలు పూడ్చే పద్ధతినే పాటిస్తున్నప్పుడు, ఇది అశాస్త్రీయమైన పద్ధతి అనటం ఎంతవరకు సమంజసం? దీనికి భిన్నంగా శవాన్ని కాల్చడం వల్ల, గాలిలో, నీటిలో కాలుష్యం చేరిపోతుంది. (నిజానికి) శవాన్ని కాల్చగా, కాలిపోక మిగిలిన భాగాలను, ఎముకలను నీటిలో నిమజ్జనం చేస్తే నీటిలో కాలుష్యం ఏర్పడుతుంది. వివిధ వస్తువుల ధరలు మండిపోతున్న ఈ కాలంలో హిందూ ఆచారాన్ని అనుసరించి శవాన్ని కాలబెట్టడం అత్యంత ఖర్చుతో కూడిన పని. నెయ్యి, చందనం, గుగ్గిలం మొదలైన సుగంధ ద్రవ్యాల ధరలు అత్యధికంగా

---

27. *ఇస్లాంలోని ఖనన పద్ధతిలో ముందుగా మృతున్ని శుభ్రంగా స్నానం చేయించి, కుట్టుపడని కొత్త వస్త్రాలను తొడిగించి అత్తర్ మొదలగు సుగంధ వస్తువుల్ని వాటిపై పూసి, అత్యంత గౌరవ మర్యాదలతో మృతుడ్ని ఒక శవపేటికలో లేక మంచంపై పరుండబెట్టి ముందుగా అతని జనాజా నమాజ్ చేయడం జరుగుతుంది. ఈ నమాజ్‌లో ఈ మృతుని కోసమే కాకుండా, అంతకుముందు చనిపోయిన వారందరి కోసం, బ్రతికున్న వారందరి కోసం, ప్రార్థించటం జరుగుతుంది. ఆ తరువాత ఈ శవపేటికను శ్మశానవాటికకు తీసుకుపోయి అత్యంత గౌరవ మర్యాదలతో పూడ్చడం జరుగుతుంది.*

పెరిగిపోయిన దృష్ట్యా వీటిని ఉపయోగించడం ప్రస్తుతం సాధ్యంకాదు. గంగా యమున నదుల నీరు కలుషితమైపోయిందని డాక్టర్ల రిపోర్టు. పూడ్చివేయడమనేది అశాస్త్రీయమైన పద్ధతే గనుక అయితే హిందూ సన్యాసుల కోసం పూడ్చి, సమాధులు చేసే పద్ధతి అన్ సైంటిఫిక్ ఎందుకు కాదు? సమాధి చేయటం, పూడ్చటం రెండూ ఒకటే. హిందువుల్లో శవాల్ని తగులబెట్టే పద్ధతి అత్యంత ఖర్చుతో కూడుకున్నది. పూడ్చటమనేది సులువైనది. తక్కువ ఖర్చుతో కూడుకున్నది. సర్వ వ్యాపితమైనది, అందరూ ఆచరించడానికి అనువైనదీను. ఈ పద్ధతి ఉత్తర ధృవంలో కూడా ఆచరించటానికి అనువైన, సరళమైన పద్ధతి. మంచు ప్రదేశాల్లో నివసించే ప్రజలు- హిందువుల పద్ధతి ప్రకారం శవాల్ని ఏవిధంగా కాల్చివేయగలుగుతారు? చరిత్రను అనుసరించి కూడా శవాల్ని పూడ్చివేయటమే సరైన పద్ధతి.[28]

---

*28. సంస్కృతంలో 'శ్మశానం' అనే ఒక పదముంది. నేటి కాలంలో శవాల్ని కాలబెట్టే స్థలాన్ని 'శ్మశానం'గా పేర్కొంటున్నారు. అయితే ఈ పదం తాను స్వయంగానే వేరే అర్థాన్ని సూచిస్తుంది. మౌలికంగా, 'స్మశానం' అనేది మృతుల్ని కాలబెట్టడానికి కాకుండా, పూడ్చటానికి ఉపయోగించబడే స్థలం. యాస్క్ అనే అతను తన గ్రంథం 'నిరుక్తం'లో, పదాల వ్యుత్పత్తి స్థానం ఆధారంగా 'స్మశాన్' అనే పదానికి అర్థం 'శరీరం పరుండే స్థానం' అని పేర్కొన్నారు. ఆచార్య క్షతి మోహన్ సేన్ కూడా 'భారతీయ సంస్కృతి' అనే తన గ్రంథంలో, 'శ్మశానం' అనే పదానికి దాని మూల ఆధారంగా ఏ అర్థాన్నైతే తెలిపారో, దానిననుసరించి 'శ్మశానం' మృతుల్ని కాలబెట్టే స్థలం కాకుండా మృతుల్ని పూడ్చే స్థలమని తెలుస్తుంది. డాక్టర్ భోలానాథ్ తివారి గారు తన గ్రంథం 'శబ్దోc కా జీవన్' పేజి 36లో ఇలా వ్రాశారు :*

*'శ్మశాన్' అనే పదం, పూర్వం హిందువులు మృతున్ని కాలబెట్టేవారు కాదని తెలుపుతుంది. దానికి బదులుగా ముస్లింలు, క్రైస్తవులు లాగే పూడ్చే సేవారు. నేటి కాలంలో కొందరు విద్వాంసులు, ఇతర ఆధారాల ద్వారా 'పూర్వం ఆర్యులు మృతుల్ని పూడ్చేవారని, మృతుల్ని కాల్చివేసే పద్ధతిని వారు ఆ తరువాత ఆర్యేతరులను చూసి అవలంభించార'నే నిర్ధారణకు వచ్చారు.*

# 13. పునర్జన్మ సిద్ధాంతం

పునర్జన్మ లేక రాకపోకల సిద్ధాంతాన్ని ఒక నిరూపిత సిద్ధాంతంగా భావిస్తున్నారు. హిందువుల ధార్మిక గ్రంథాలైన 'వేదాల్లో' మౌలికంగా పునర్జన్మకు సంబంధించి స్పష్టంగా ఎక్కడా పేర్కొనబడలేదు. ఇది తరువాత కాలంలో సృష్టించబడింది. హిందువుల్లో ప్రతి విషయంలోనూ భిన్నత్వం, వ్యతిరేకత ఉంది. పునర్జన్మకు సంబంధించి కూడా పరస్పర వ్యతిరేక విషయాలు చెప్ప బడతాయి. హిందువుల ధార్మికగ్రంథాల్లో, సామాన్య ధార్మిక విశ్వాసాల్లో, ప్రత్యే కించి గరుడ పురాణంలో స్వర్గ నరకాల్ని కూడా అంగీకరించడం జరిగింది. చనిపోయిన వారికి హిందువులు సర్వసామాన్యంగా స్వర్గవాసి లేక స్వర్గీయ అనే పదాన్ని వాడుతారు. గీతలో పాత దుస్తుల్ని వదిలి కొత్త దుస్తుల్ని ధరించినట్లే మృత్యువును కొత్త జీవితానికి నాందీగా పేర్కొంటూ ఈ శరీరం నశ్వరమైనదనే జ్ఞానం అర్జునునికి ఇవ్వడం జరిగింది. అంతేకాకుండా ఇదే భావన మరింత ప్రభావవంతంగా మనసులో నాటుకుపోవాలనే దృష్టితో అర్జునునికి, మరణిస్తే స్వర్గలోకానికి వెళ్తావని, జయిస్తే రాజ్యాన్ని ఏలుతావని బోధించడం జరిగింది. దీనిద్వారా పునర్జన్మ లేక రాకపోకల సిద్ధాంతంతోపాటే, హిందువుల్లో ధార్మికంగాను, నైతికంగాను, స్వర్గ నరకాల పట్ల విశ్వాసం ఉన్నట్లు ద్యోతకమవు

---

*వేదాల్లోనూ మృతుల్ని పూడ్చివేసే సాక్ష్యాలు లభిస్తాయి. శవాన్ని పూడ్చివేసేటప్పుడు మంత్రాలను జపించేవారు. ఆ మంత్రాల్లోని ఒక మంత్రం ఇలా ఉంది.*

*ఇదమిద్ వా ఉ నాసరం దివి పశ్యాసి*

*మాతా పుత్రం యథా సిచాభ్యేనం భూమ ఉర్ణాహి (అధర్వణ వేదం 18/2/50)*

*అర్థం: ఓ మరణించిన మానవుడా! ఇది మరొకటి కాదు. స్వర్గంలో నీవు సూర్యుడ్ని చూస్తావు. ఓ భూమీ! తల్లి తన బిడ్డను తన కొంగుతో కప్పేసుకున్నట్లు, మరణిం చిన ఈ మనిషిని నలువైపుల నుంచి కప్పేసుకో.'*

తుంది. నైతికతల ప్రేరణ, ప్రోత్సాహం స్వర్గ నరకాలపై విశ్వాస నమ్మకాల ద్వారానే సాధ్యమవుతుందనే విషయం కూడా గీత యొక్క పై మాటల ద్వారా నిరూపితమవుతుంది. గీతోపదేశం ఉద్దేశ్యం ఏమిటి? అర్జునుడ్ని మాధ్యమంగా, సాధనంగా చేసుకొని మానవాళిని నైతిక పనులను నెరవేర్చటానికి సంసిద్ధం చేయటమేకదా! ఈ లక్ష్యం కోసం, స్వర్గాన్ని పొందుటమే ఏకైక ఆశయంగా చూపించాడు శ్రీకృష్ణుడు. హిందువుల తాత్విక సిద్ధాంతాల్లో, పునర్జన్మ ఒక సిద్ధాంతంగా ఉంటే ఉండొచ్చు, కాని ధార్మిక విశ్వాసం మాత్రం స్వర్గ నరకాల్నే ధృవపరుస్తున్నాయని పై విషయాల ద్వారా నిరూపితమవుతుంది. పునర్జన్మ లేక పునరపి మరణం పునరపి జననం అనే సిద్ధాంతం తర్కానికి కూడా వ్యతిరేకమే. ఇది కలియుగమని, అందుకని పాపాలు పెరిగిపోతున్నాయని చెప్పడం జరుగుతోంది. సత్యయుగంలో పాపాలు తక్కువగా జరిగేవి. దీనితోపాటుగా, సత్కర్మల వల్ల మానవ శరీరం లభిస్తుందని, పాపాల కారణంగా పశువుల శరీరం లభిస్తుందని కూడా చెప్పబడుతుంది. ఒకవేళ ఇదే వాస్తవమైనట్లయితే ఈ కలియుగంలో, పాపాలు విపరీతంగా పెరిగిపోతున్న ఈ కాలంలో, నిరంతరంగా మానవ జనాభా అత్యధికంగా ఎలా పెరిగిపోతున్నది? పాపాత్ముడు, ఈ జన్మలోనే చేసిన పాపాల్ని గ్రహించలేక పోతున్నప్పుడు, పూర్వజన్మ పాపాలను ఎలా అనుభవించగలుగుతాడు? కాదు, ముమ్మాటికి కాదు. అందుకని పునర్జన్మ సిద్ధాంతం మిథ్యా, నిష్ప్రయోజనమైనది. అంతేకాక ఈ సిద్ధాంతం నైతికతలకు కూడా వ్యతిరేకమే. ఉదాహరణకు ఎవరో ఒక వ్యక్తి, కుమారుడు చనిపోయాడనుకోండి అతడ్ని పలకరించటానికి, పరామర్శించటానికి మనం వెళ్ళినప్పుడు గడిచిన జన్మలో నీవు ఎవరి కొడుకునో హతమార్చి ఉంటావని, ఆ బాధిత తండ్రితో అనగలుగుతామా? బాధలో, కష్టకాలంలో తనకు గాని, ఇతరులకు గాని ఓర్పు వహించమని, సహనం చూప మని పలకటమే సముచితమూ, సమంజసమూ కదా!!

# 14. జిజ్‌యాకు భావం

'జిజ్‌యా'కు సంబంధించి ముస్లిమేతర సోదరులు బోలెడు అపార్థాలకు గురై ఉన్నారు. ఓ ఇస్లామీయ రాజ్యంలో ముస్లిమేతరులు తమ సంరక్షణ (మరియు సామ్రాజ్య సంరక్షణ) బాధ్యతల నుంచి మినహాయించబడేవాడు. వారిని సంరక్షించడం ఇస్లామీయ ప్రభుత్వ బాధ్యత. అందుకని ఇస్లామీయ ప్రభుత్వం వారి రక్షణార్థం ఒక స్వల్పమైన 'రక్షణ టాక్సు' విధించేది. దీన్నే (జిజ్‌యా) అంటారు. ముస్లిమేతర పౌరుల్ని రక్షించే బాధ్యత ముస్లింలపైనే ఉండేది. ఇస్లాంలో బలవంతపు మత మార్పిడి ఎట్టి పరిస్థితుల్లోనూ అనుమతింపబడలేదనటానికి ఈ జిజ్‌యాయే ప్రబల సాక్ష్యం. ఎందుకంటే ఈ జిజ్‌యా చెల్లించినందున ఆ ముస్లిమేతర పౌరులు తమ సంపూర్ణ ధార్మిక స్వాతంత్ర్యానికి అర్హులయ్యేవారు. హిందూ ధర్మానికి సర్వాధికారులైన బ్రాహ్మణులు, ఈ జిజ్‌యా నుండి మినహాయింపబడేవారనేది చారిత్రక సత్యం. అక్బర్,జహంగీర్,షాజహాన్ కాలాల్లో ఈ జిజ్‌యా పూర్తిగా తొలగించబడింది.[29]

---

29. *ప్రస్తుతం ఏ ముస్లిం దేశంలో కూడా జిజ్‌యా అమలులో లేదు. అయినా దీని గురించి ఇంకా ప్రచారం జరుగుతూనే ఉంది. ఆ కారణంచేతనే శ్రీ రాజేందర్ నారాయణ్ లాల్ గారికి కూడా దీని గురించి వివరణ ఇవ్వాల్సి వచ్చింది. అనేక ముస్లిం దేశాల్లో క్రైస్తవులు, హిందువులు కూడా ఉన్నారు. కాని ఏ దేశంలో కూడా వీరితో జిజ్‌యా వసూలు చేయబడడంలేదు. ఏ ధర్మానికి సంబంధించినవైనా దాని ఆదేశాలను తెలుసుకోవడానికి ఆ ధర్మం ప్రామాణిక గ్రంథాలను, ఆ ధర్మానికి చెందిన సుప్రసిద్ధ విద్వాంసుల వ్యాఖ్యానాలనే ప్రమాణంగా స్వీకరించడం జరుగుతుంది తప్ప ఆ ధర్మానికి వ్యతిరేకులైన వారి గ్రంథాలను, వ్యాఖ్యానాలను వారెంత పెద్ద విద్వాంసులైనా సరే, ప్రమాణంగా స్వీకరించబడవు. ఇది సర్వసాధారణ సిద్ధాంతం. అందుకని అసలు జిజ్‌యా అంటే ఏమిటి? దాని వాస్తవికత ఏమిటి? దాని గురించిన సంక్షిప్త సమాచారం ముస్లిమేతర సోదరుల ముందుంచటం అనివార్యమనుకుంటున్నాము.*

*'జిజ్‌యా' అనేది కేవలం ముస్లిమేతరులకే ఎందుకనే విషయాన్ని ముందుగా*

పరిశీలిద్దాం.

*1.* ముస్లింలపై ఒక అనివార్యమైన ధార్మిక పన్ను విధించబడుతుంది. దీన్నే 'జకాత్' అంటారు. దీని పరిమాణం ప్రతి సంవత్సరం రెండున్నర శాతం. ఇది అవసరాలు తీరిన తరువాత, మిగిలి ఉన్న ధనంపై విధించబడుతుంది. ఎవరైనా ఒక ముస్లిం కోటీశ్వరుడైతే, రెండున్నర శాతం చొప్పున అతను ప్రతి సంవత్సరం రెండు లక్షల యాభై వేలు జకాత్ పద్దు కింద చెల్లించవలసి ఉంటుంది. అంతేకాక దేశంపై ఏదైనా విపత్కర పరిస్థితులు వచ్చిపడితే ఇస్లామీయ ప్రభుత్వం, ముస్లింల ఆర్థిక స్థోమతను అనుసరించి ప్రత్యేక పన్నును కూడా వసూలు చేయగలుగుతుంది. కాని ముస్లిమేతర ప్రజలతో జిజ్‌యా తప్ప ఇతరత్రా ఒక్క పైసా కూడా వసూలు చేయరాదు.

*2.* ముస్లిమేతర ప్రజలు దేశ రక్షణకు సంబంధించిన బాధ్యత నుండి విముక్తులవుతారు. అందుకోసమని సైనిక ఖర్చుల నిమిత్తం, దేశ రక్షణ కోసం ఒక చిన్న పన్ను వారి నుండి వసూలు చేయబడుతుంది. దీన్నే (జిజ్‌యా) అంటారు. అవసరం ఏర్పడినప్పుడు, ముస్లిమేతర ప్రజల్లో నుండి ఎవరైనా సైనిక సేవకు అనగా యుద్ధ రంగానికి వెళ్ళటానికి ముందుకువస్తారో, వారి నుంచి జిజ్‌యా వసూలు చేయబడదు.

ఇస్లామీయ పరిభాషలో ఇస్లామీయ ప్రభుత్వ సంరక్షణలో ఉండే ముస్లిమేతర ప్రజల్ని 'జిమ్మీ'లంటారు. 'జిమ్మీ' అంటే ఏదో అవమానకరమైన పదవేమీ కాదు. దీని అర్థం ఏమిటంటే, వారి ధన, మాన, ప్రాణాలకు, ధర్మానికి, గౌరవానికి, సన్మానానికి, సుఖానికి, శాంతికి అన్నింటికీ ఇస్లామీయ ప్రభుత్వం బాధ్యత తీసుకున్న ముస్లిమేతర పౌరులు. అంతేకాదు, వ్యవహారికంగా ఆచరణలో వారిని అన్ని విధాల సంరక్షించే బాధ్యత ఇస్లామీయ ప్రభుత్వంపై ఉంటుంది. కాని ఇస్లాం ప్రకారం, వారి నిజమైన సంరక్షకులు దైవం, దైవప్రవక్తయే. దైవప్రవక్త మహనీయ ముహమ్మద్(స) ఈ జిమ్మీల (ముస్లిమేతరుల) గురించి ముస్లింలను ఇలా హెచ్చరించారు:

'జాగ్రత్త! మీలో నుండి ఎవరైనా ఏ ముస్లిమేతర పౌరునిపై అత్యాచారం జరిపినా, అతని అధికారాల్లో లోపం రానిచ్చినా, లేదా అతని శక్తికి మించి అతనిపై భారం మోపినా లేదా అతని అంగీకారం లేనిదే అతనికి సంబంధించిన ఏ వస్తువునైనా లాక్కున్నా, అలాంటి వ్యక్తికి విరుద్ధంగా ప్రళయం

రోజు దైవ న్యాయస్థానంలో నేను ఆ ముస్లిమేతరుని తరఫున వాదిస్తాను.' (అబూదావూద్, కితాబుల్ జిహాద్)

ముస్లిమేతర సోదరులు ఒక్క నిమిషం ఇక్కడ ఆగి మహనీయ ముహమ్మద్(స) ముస్లింలకిచ్చిన ఈ హెచ్చరిక, లేక వార్నింగ్‌పై కాస్త గాఢంగా, గంభీరంగా ఆలోచించాలని మనవి చేస్తున్నాము. సంరక్షణకు సంబంధించిన ఇంతటి గ్యారంటీ నేడు మన భారతీయ ప్రజలకు కూడా ప్రాప్తమై లేదే! మత కలహాల పేరుతో జరుగుతున్నదేమిటి?

5. జిజ్‌యా విధించబడే వర్గంలో కూడా స్త్రీలు, పిల్లలు, వృద్ధులు, మతిలేనివారు, అంధులు, అంగవైకల్యం కలవారు, మందిరాలు, ఆరాధనా లయాల సేవకులు, పూజారులు, సాధువులు, సన్యాసులు, గృహస్తులు, జీవిత కార్యకలాపాల నుండి వైదొలిగి గుహల్లో, మఠాల్లో, ఆశ్రమాల్లో నివసిస్తున్నవారు– పైవారందరూ జిజ్‌యా నుండి మినహాయింపబడతారు.

జిజ్‌యా చెల్లించేవారిలో నుండి ఎవరైనా పేదవానిగా, రిక్తునిగా మారిపోతే అతనికి జిజ్‌యా మాఫీ చేయటమేకాక ముస్లింల ధనాగారం నుంచి అతనికి, అతని కుటుంబానికి పింఛన్ జారీ చేయబడుతుంది. (కితాబుల్ ఖిరాజ్ పేజి : 85)

7. పేదవారు, బిచ్చమెత్తుకునే ముస్లిమేతర ప్రజలకు– ముస్లింల ధనాగారమైన 'బైతుల్‌మాల్'పై అధికారముంటుంది.

జిజ్‌యాను జుట్టు పన్ను అని, ఇస్లాం స్వీకరించనందుకు చెల్లించవలసిన అపరాధ రుసుము అని, ముస్లిమేతరులను అవమాన పరచటానికి విధించిన పన్ను అని– ఇలా రకరకాలుగా దుష్ప్రచారం చేశారు. అయితే ఇస్లామీయ దృక్పథంతో దీని వాస్తవికత ఏమిటి? అనే విషయాన్ని సుప్రసిద్ధ ఇస్లామీయ ధర్మవేత్తలైన ఇమామ్ అబూ యూసుఫ్, ఇమామ్ షాఫయి గార్లు ఇలా విశ్లేషించారు :

"ప్రాణ రక్షణకు బదులుగా, ఇస్లామీయ రాజ్య సరిహద్దుల్లో నివసిస్తున్నందుకు ప్రతిగా చెల్లించే పన్ను (జిజ్‌యా) అనబడుతుంది." (కితాబుల్ ఖిరాజ్)

ఒకవేళ 'జిజ్‌యా' అనేది ముస్లిమేతరుల్ని అవమానపర్చేందుకే ప్రతిపాదించబడి వుంటే, మందిరాల పూజారులు, సాధువులు, సన్యాసులు, గుహల్లో,

మఠాల్లో, ఆశ్రమాల్లో నివసిస్తున్నవారు, స్త్రీలు, పిల్లలు, వృద్ధులు దీన్నుండి ఎలా మినహాయింపబడేవారు?

ఇస్లామీయ రాజ్యంలో, ముస్లిమేతర ప్రజలకు ధన మాన ప్రాణాలు, ధర్మం, గౌరవం అన్నిటికి రక్షణ ఉంటుందనే విషయం మేము పైన పేర్కొన్నాము. ఇక్కడ ఇంకొక విషయంపై మీ దృష్టిని మరల్చదలిచాము. అదేమిటంటే ఎప్పుడు, ఎవరికిష్టమైతే అప్పుడు అందులో చేర్పులు మార్పులు చేసుకోవటానికి ఇస్లామీయ శాసనం లేక చట్టం, మానవుల ద్వారా రూపొందించబడిన చట్టాల్లాంటిది కాదు. ఇది దైవగ్రంథమైన ఖుర్ఆన్, దైవప్రవక్త ముహమ్మద్(స) ఆదేశాలననుసరించి రూపొందించబడింది. అందుకని దైవం, దైవప్రవక్త (స) ఇతర ఆదేశాలను తృణీకరించడం ఎలాంటి పాపమో, జిజ్‌యాకు సంబంధించి వచ్చిన ఆదేశాలను ధిక్కరించడం కూడా అలాంటి పాపమే, నేరమే అవుతుంది.

వాస్తవానికి విరుద్ధంగా ఎవరెంత దుష్ప్రచారం చేసినా అది తన వాస్తవికతను అంగీకరింపజేసి తీరుతుంది. పాశ్చాత్యులే ఇస్లాంపై రకరకాల దుష్ప్రచారాలు చేశారు. అయితే ఈ పాశ్చాత్య విద్వాంసుల్లోనే సత్యాన్ని, వాస్తవాన్ని నిర్భీతిగా అంగీకరించి తమ వారే సాగించిన ఈ దుష్ప్రచారాన్ని ఖండించి, వాస్తవాలను ప్రపంచం ముందుంచిన పాశ్చాత్య విద్వాంసులు కూడా ఉన్నారు. వారిలో ఇద్దరు పాశ్చాత్య విద్యాంసులు తెలిపిన వాస్తవాలు ఇలా ఉన్నాయి.

తన చారిత్రక గ్రంథమైన 'బ్రిటీష్ సామ్రాజ్య శాసనం' మొదటి భాగం, అధ్యాయం-2లో మిస్టర్ హాలమ్ ఇలా వ్రాశారు :

"ఇస్లామీయ ధర్మం ప్రజలకు విశదపర్చడం జరిగింది. అంతేకాని వారిని ఇష్టం లేకపోయినా స్వీకరించాలని బలవంతం చేయలేదు. ఇక ఏ వ్యక్తి అయితే పరిపూర్ణ హృదయంతో దీన్ని స్వీకరించాడో, విజేత జాతికి లభించి ఉన్నా హక్కు- అధికారాలే అతనికి కూడా లభించాయి. ప్రపంచ ఆరంభం నుంచి, దైవప్రవక్త కాలం వరకు విజేతలైన జాతులు తమ పరాజిత జాతులపై రుద్దుతూ వచ్చిన షరతుల నుంచి ఈ ధర్మం వారిని (పరాజిత జాతుల్ని) విముక్తుల్ని చేసింది. ఇస్లామీయ నియమాల ననుసరించి,

ఇస్లామీయ రాజ్య ఆధీనంలోకి, దాని పాలన క్రిందికి వచ్చిన ముస్లిమేతరు లందరికీ అన్ని రకాల ధార్మిక స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రసాదించబడ్డాయి. 'లా ఇక్రాహఫిద్దీన్' (ధర్మావలంబనలో ఎలాంటి బలాత్కారం లేదు) అనే బహిరంగ ప్రకటన ప్రమాణాలతో, నిరాకరించలేని తర్కవాదంతో సహా ఈ స్వాతంత్ర్యం వారికి ప్రసాదించబడింది. ఇస్లాంలో ఇతర ధర్మాల వారికి ధార్మికస్వేచ్ఛా స్వాతంత్ర్యం ఇవ్వటం, వారితో సహృదయంతో వ్యవహరించ టానికి సంబంధించి అవతరించిన ఈ ఆయత్ ఏదో ఒకపిచ్చివాని కూత కాదు, లేక ఏదో ఒక ధార్మికుని నిరాధారమైన ఆలోచన అంతకన్నా కాదు. దానికి భిన్నంగా తాను తలచిన నియమాలను జారీచేసి, ఆచరింపజేసే శక్తిసామర్థ్యాలు కలిగిన ఒక సామ్రాజ్య శాసకుని ద్వారా ప్రతిపాదించబడిన సిద్ధాంతమిది. (దైవం ద్వారా ప్రసాదింపబడిన ఖుర్ఆన్ సిద్ధాంతమిది అనటం ఉపయుక్తమైన పదం– అనువాదకుడు)

ధర్మంలోను, సాంస్కృతిక రాజనీతిజ్ఞతలోను, ధార్మిక స్వాతంత్ర్యాన్ని ప్రసాదిస్తామని ప్రలోభపెట్టారు అనేకమంది నాయకులు, వర్గాలు. కాని వారు వివశులు, అవసరార్థులుగా ఉన్నంతవరకే దాన్ని కార్యాచరణలో పెట్టడానికి తాకీదు చేస్తుండేవారు. అయితే ఇస్లామీయ ప్రవక్త ధార్మిక స్వాతంత్ర్యం ప్రసాదిస్తానని ప్రలోభపెట్టడం కాకుండా, దాన్ని ధార్మిక నియమాల్లోనే చేర్చివేశారు.

ముస్లింల రాజ్యం, అధికార పరిధిలోనికి వచ్చిన ప్రతి జాతితో దయ, ప్రేమపూర్వకంగా వ్యవహరించే సిద్ధాంతాన్ని ఉపయోగించడం జరిగింది. ఇంకా ప్రతి జాతితో, దాని స్వంత ధార్మిక ఆచార వ్యవహారాలను నిరాటంకంగా సాగించుకోవటానికి, దాని సంరక్షణ నిమిత్తం నామమాత్రమైన ఒక పన్ను (జిజ్యా)ను స్వీకరించడం జరిగింది. ఇక ఎప్పుడైతే ఒకసారి ఈ పన్ను నిర్ణయమైపోయేదో ఆ పిదప ఆ జాతి ధార్మిక విలువల్లో, ధార్మిక ఆచార వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం ధర్మవిరుద్ధంగా, నిషేధితంగా పరిగణించబడేది."

సుప్రసిద్ధ ఫ్రెంచ్ విద్వాంసుడు, డాక్టర్ లీబాన్ తన ప్రఖ్యాత గ్రంథం *Arab Culture* లో ఇలా వ్రాశారు :

"మనం అరబ్బుల విజయంపై, వారి సాఫల్యానికి కారణాలేమిటని

పరిశీలించినప్పుడు ఒక విషయం అంటే, ధార్మికప్రచారంలో ఖడ్గంతో ఎలాంటి సహాయం తీసుకోబడలేదనే విషయం స్పష్టమైపోతుంది. దీనికి కారణం ఏమిటంటే ముస్లింలు ఎల్లప్పుడూ కూడా పరాజిత జాతుల్ని తమ ధార్మిక విషయంలో స్వతంత్రంగా మెలగనిచ్చేవారు. కొన్ని క్రైస్తవ జాతులు, తమ విజేతల ధర్మాన్ని స్వీకరించారు. చివరికి వారి భాషను సైతం అవలంభించారు, అంటే దానికి కేవలం కారణం ఒక్కటే. వారు తమ స్వజాతి పాత పాలకుల కన్నా ఈ కొత్త పరిపాలకుల్ని అత్యధిక సత్యవంతులుగా, మృదు స్వభావులుగా గుర్తించటమే."

ఇంకొక చోట ఇదే చరిత్రకారుడు ఇలా వ్రాశారు :

"ముస్లిం ఖలీఫాలు రాజ్యవిస్తరణలో ఎప్పుడూ కూడా ధార్మిక ప్రచారం కోసం ఖడ్గాన్ని ఉపయోగించలేదు. వారు బలపూర్వకంగా తమ ధర్మప్రచారం చేసేవారని పదేపదే చెప్పబడిన దానికి భిన్నంగా వారు పరాజిత జాతుల్ని వారి ధర్మాన్ని, సంస్కృతిని, వేషభూషణల్ని అన్ని విధాలుగా గౌరవిస్తామని హామి ఇచ్చేవారు. ఇంకా ఈ స్వాతంత్ర్యానికి బదులుగా ఒక చిన్న టాక్సు (జిజ్‌యా)ను వారి నుండి తీసుకునేవారు. వారి పాత పాలకులు వసూలు చేసిన పన్నులతో పోల్చినప్పుడు ఇదెంతో స్వల్పంగా ఉండేది.

ఇంకిప్పుడు ఒక భారతీయ విద్వాంసుని సమీక్షను కూడా పరిశీలించండి. 'డాక్టర్ ఈశ్వర్ టోపా' ఎం.ఎ, డి.లిట్ ఇలా వ్రాశారు :

'జిజ్‌యా విధించటం వల్లను, మందిరాలను ధ్వంసం చేసిన సంఘటనల ద్వారాను ఏ అసత్య పరిణామాలు గ్రహించబడ్డాయో వాటి పై చర్చించదలిచాను. హిందూ ప్రజల్ని ఆర్థిక దాస్యంలో పడేయటానికే జిజ్‌యా విధించబడేదని చెప్పబడుతుంది. ఈ ఆరోపణలను సమగ్రంగా సమీక్షించి ఖండించవలసిన ఆవశ్యకత ఉంది.

ఇస్లామీయ శాస్త్ర పరిభాషలో ముస్లిమేతరులు కేవలం ఒక అతి స్వల్పమైన పన్నును చెల్లించి ఇస్లామీయ రాజ్యపు సంరక్షణలోకి వస్తారు. దీన్నే 'జిజ్‌యా' అంటారు. సైన్యంలో పాల్గొని సైనిక సేవలందించడానికి ప్రతి ముస్లింను బాధ్యునిగా చేయవచ్చు. అయితే జిజ్‌యా చెల్లించిన ముస్లిమేతరుడు సైనిక సేవల్నుండి మినహాయింపబడతాడు. ఈ విధంగా 'జిమ్మీల' ధన, మాన,

ప్రాణాలు, వారి ధార్మిక స్వాతంత్రం అనగా వారి ధార్మిక ఆచారాలననుసరించి వారి ఆరాధనాలయాల్లో పూజా పునస్కారాలు చేసుకోవటంలో ఇస్లామీయ రాజ్యం రక్షణ కల్పిస్తుంది. ఇక ఇస్లామీయ నియమ నిబంధనలు ముస్లిమేతరుల (జిమ్మీల) ధార్మిక కార్యకలాపాల్లో జోక్యం చేసుకోవటానికి అనుమతించవు. అలాంటప్పుడు వారెలా మందిరాలను ధ్వంసం చేయగలుగుతారు? ఒక జిమ్మీ (ఇస్లామీయ రాజ్యంలో జిజ్‌యా చెల్లించి, ఆ రాజ్య సంరక్షణలోకి వచ్చిన ముస్లిమేతరుడ్ని 'జిమ్మీ' అంటారు. –అనువాదకుడు) తన బాధ్యతను నెరవేర్చినప్పుడు ఆ రాజ్యంపై స్వయంగా తన బాధ్యతను నెరవేర్చటం అనివార్యమైపోతుంది. ఇస్లామీయ ధర్మంలో జిజ్‌యాకు సంబంధించిన సిద్ధాంతమిదే."

"ఇస్లామీయ రాజ్యపు ఇంకొక ఉజ్వల కోణముంది. సర్వ సామాన్యంగా దానిపై దృష్టి సారించరు. జిజ్‌యా అనేది ముస్లిమేతర ప్రజలందరికీ వర్తించదు. అత్యధిక మంది దీన్నుండి మినహాయించబడతారు. ఉదాహ రణకు స్త్రీలు, పిల్లలు, వృద్ధులు, పూజారులు, విద్యార్థులు, నిరుద్యోగులు, పేదవాళ్లు, బిచ్చగాళ్లకు జిజ్‌యా నుండి మినహాయింపు ఉంటుంది. దీనితో స్పష్టంగా తేలిపోయే విషయం ఏమిటంటే, ముస్లిమేతరుల్లోని దాదాపు డెబ్బై ఐదుశాతం మందికి అసలు జిజ్‌యా వర్తించదు. దీనికి కారణం ఏమిటంటే సమాజంలో ఇలాంటి వ్యక్తుల సంఖ్యే అధికంగా ఉంటుంది."

"భారతదేశంలో ప్రారంభంలో ఏర్పడిన ఇస్లామీయ రాజ్యం, ఇస్లామీ రాజ నీతిజ్ఞతకు ఆదర్శంగా నిలిచింది. అది ముస్లిమేతర ప్రజలతో న్యాయ పూర్ణమైన వ్యవహారమే కాదు, దానికి మించి ఉదార పూర్వకంగా వ్యవహరిం చింది. దానితో ప్రసన్నులైన ఇక్కడి ముస్లిమేతర ప్రజలు స్వయంగా వారి పరిపాలనా పునాదులను సుదృఢపరిచారు. అయితే వారి తరువాత వచ్చిన ముస్లిం పాలకుల పరిపాలనా విధానం వాస్తవమైన ఇస్లామీయ పరిపాలనా విధానం కాదు, అందుకని వారి పరిపాలనా విధానపు దోషాన్ని ఇస్లాంకు అంటగట్టడం సమంజసం కాదు." (నయీ జిందగీ మాసపత్రిక, అలహా బాద్, అక్టోబర్ 1946) (అనువాదకుడు)

## 15. ఐరోపా దేశాల్లో ఇస్లాం రాకతో ఏర్పడిన పరిణామాలు

యూరప్‌లోగాని, భారతదేశంలోగాని ఇస్లాం రాకకు ఒక ముఖ్య కారణం ఉంది. అదేమిటంటే- మానవ అవసరాలు, దైవ ప్రణాళిక ప్రకారం ఇస్లాం యూరప్‌లో ప్రవేశించటం, ఆ తరువాత క్రైస్తవులు ముస్లింల నడుమ జరిగిన యుద్ధాలు- క్రైస్తవులు దీన్ని (పవిత్ర) శిలువ యుద్ధాలు (Crusades) అని, ముస్లింలు దీన్ని 'జిహాద్' అని పిలవటం జరిగింది. ఈ యుద్ధాల పరిస్థితి ఏమిటి? వాటి వాస్తవికత ఏమిటి? అనేది అటుంచి, యూరప్‌ను అజ్ఞానాంధ కారాల నుండి బయటికి తీసి సభ్యత సంస్కృతులు నేర్పటంలో ఇస్లాం గణనీయ మైన పాత్ర పోషించిందన్నది మాత్రం ముస్లిమేతర చరిత్రకారులు (ప్రత్యేకించి క్రైస్తవ చరిత్రకారులు) అంగీకరిస్తున్నారు. గ్రీకు సాహిత్యాన్ని, తత్వజ్ఞానాన్ని, సైన్స్, గణితాన్ని రక్షించటంలోను, అభివృద్ధి పరచటంలోనూ ముస్లిములు గొప్ప పాత్రను పోషించారు. వీటి ఆధారంగా వారు యూరప్‌ను కాంతివంతం చేశారు. ఉన్నత స్థాయికి చెందిన పరిశ్రమలు, కళలు కూడా వీరి ద్వారానే యూరప్‌కు పరిచయమయ్యాయి. వారక్కడ తమ హృదయ విశాలతను ప్రదర్శించారు.

ముస్లింలతో సంబంధాలు ఏర్పడ్డాక పైనుదహరించిన విధంగా యూరప్ అనేక రకాలుగా లాభపడింది. కాని ఎప్పుడైతే ముస్లింలతో ఈ సంబంధాలు తెగిపోయాయో, యూరప్ భౌతిక అభివృద్ధి, పురోగమనాలకు సంబంధించిన మహోన్నత శిఖరాలను మాత్రమే అందుకోగలిగింది. కాని నైతికంగా అది పతనావస్థ లోతుల్లోనికి దిగజారిపోయింది. దీని పర్యవసానం (నైతికపరంగా హీనాతిహీన దశకు చేరుకోవటం) ఏమిటో నేడు మన కళ్లతో తిలకిస్తున్నాం. మొత్తానికి యూరప్, అమెరికాలు నేడు త్రాగుడు, వ్యభిచారం, జూదం, దొంగతనం, దోపిడీలు, మానభంగాలు, హత్యల యమకూపంలో కూరుకుపోయాయి.

యూరప్‌లో అజ్ఞాన, అనాగరికతల స్థానంలో సభ్యత, మానవత్వం అవసరముండింది. అందుకని దేవుని కృప వల్ల ఇస్లాం అక్కడికి చేరగలిగింది. నైతికతలు, సమానత్వాల వెలుగును ప్రసరింపజేసింది. ఈ వెలుగులో క్రైస్తవ ధర్మంలో చోటు చేసుకున్న చెడుల్ని సంస్కరించడానికి 'మార్టిన్ లూథర్' లాంటి ధార్మిక సంస్కర్తలకు ప్రేరణ, ప్రోత్సాహాలు లభించాయి. ఇదేవిధంగా భారత దేశంలో కూడా ఇస్లాం ఆగమనం, మానవ అవసరాలు, దైవకృపల ప్రసారానికి దోహదపడింది.

భారతదేశంలో అత్యున్నతమైన సభ్యతా సంస్కృతులైతే వికసించ గలిగాయి. అయితే సభ్యతా సంస్కృతులు వికసించి పురోగమించటమే సర్వస్వం కాదు కదా! నైతిక రాహిత్యం, రాజకీయ సంఘర్షణలు, నిమ్నజాతుల పట్ల అసహ్యం, విద్వేషాలు మిన్నుముట్టాయి. ధర్మంలో విచ్ఛిన్నం పొడసూపింది. బౌద్ధ మతాలు నైతిక రాహిత్యానికి, దుర్మార్గానికి, దుష్కార్య కలాపాలకు, చేతబడులకు అలవాలాలైపోయాయి. హిందూ ధర్మం పరిస్థితి కూడా ఇలాగే ఉండింది. హిందువులు తమ ప్రాచీన ధార్మిక బోధనల నుంచి తిరుగబడ్డారు. వారిలో హృదయ సంకుచితత్వం, క్షుద్ర భావాలు జొరబడ్డాయి. 'గీత' మాటల్లో, 'ధర్మంలోగ్లాని' ఏర్పడనారంభించింది. (అంటే ధర్మం క్షీణించటం, పతనం కావటం మొదలయిందన్నమాట) ఇలాంటి పరిస్థితిని దైవం భరించలేడు కదా!

క్రీ.శ. 712లో వాస్తవమైన, స్వాభావిక అవసరాల దృష్ట్యా, ఇతర రాజకీయ కారణాలతో భారతదేశంలోని సింధ్ ప్రాంతంలో మొట్టమొదటి సారిగా ఇస్లాం ప్రవేశించింది. ఈ ప్రవేశం కేవలం ఒక బాహ్య సాధనం మాత్రమే. అవలీలగానో, కష్టంగానో మొత్తానికి ముస్లింలు సింధ్‌ను జయించి తమ రాజ్యాన్ని ఏర్పాటు చేసుకున్నారు. కాని కొన్నిరోజుల్లోనే వారు హిందువుల పట్ల హృదయ విశాలత్వాన్ని ప్రదర్శించి అత్యంత ఉదారంగా వ్యవహరించారు. చివరికి అధికారాన్ని కూడా వారికే అప్పగించారు. ఒకవిధంగా చూస్తే ఇది హిందువుల పట్ల ముస్లింల ఓ హెచ్చరిక లాంటిది. అంటే ఇప్పటికైనా మించి

పోయింది లేదు, మీరు సంభాళించుకోండి అనే వార్నింగ్ లాంటిదన్న మాట. అయినా హిందువులు తమను తాము సవరించుకోలేక పోయారు. సంస్కరించుకోలేకపోయారు. వారు పతనం వైపు పరుగెత్తుతూనే ఉన్నారు. మూడు వందల సంవత్సరాల వరకు దైవం వారికి అవకాశం ఇచ్చాడు. వ్యవధి నిచ్చాడు. అయినా వారు తేరుకోలేకపోయారు. దైవం పేరు మీద లెక్కించనలవి గాని ధన సంపదను మందిరాల్లో ప్రోగుచేయటం జరిగింది. ధార్మిక గుత్తాధిపత్యం కలిగి ఉన్న వీరు, దైవ మందిరాల్లో దేవదాసీల నృత్య గానాలకు ధార్మికతా సర్టిపికెట్‌ను ఇవ్వడం జరిగింది. పర్యవసానంగా (వ్యాధిగ్రస్తమైన ఈ సమాజం, వ్యవస్థపై) భారతదేశంలో మహ్మూద్ గజని ప్రవేశం దైవాగ్రహం రూపంలో విరుచుకుపడింది. అతను పదిహేడు సార్లు భారతదేశంపై దండెత్తి వచ్చి, గాఢనిద్రలో మునిగిపోయి ఉన్న హిందువుల్ని, ఇకనైనా మేల్కొంటారన్నట్లు పడేపదే అల్లాడించిపోయాడు. అయినా హిందువులు అసలు మేల్కొంటేనా! ఆ తరువాత దైవం వారికి, నూటా యాభై సంవత్సరాల ఇంకొక వ్యవధి కూడా ప్రసాదించాడు. అయినా హిందువులు సంభాళించుకోలేకపోయారు. చివరికి దైవేచ్ఛననుసరించి, ముహమ్మద్ ఘోరీ భారతదేశానికి వచ్చి వారి అధికారాన్ని శాశ్వతంగా సమాప్తం చేసేశాడు.[30]

---

*30. దైవం తన భూమ్మీద హింసా దౌర్జన్యాల్ని, దుర్మార్గాల్ని, ప్రజల శోషణను, దుష్కార్యాల్ని అధికకాలం నడవనీయడమనేది చారిత్రక సాక్ష్యాధారాల ద్వారా స్పష్టమవుతున్నది. సంస్కరించుకునే, సంభాళించుకునే వ్యవధి, అవకాశం ఆయన తప్పక ప్రసాదిస్తాడు, ఈ వ్యవధి, ఈ అవకాశం కొన్ని శతాబ్దాలను పరివేష్టించి ఉండొచ్చు. కాని ఫలితం కనబడనప్పుడు ప్రచండుడు, నిర్వాహకుడు, తంత్రజ్ఞుడూ అయిన దైవం, అవిధేయత, దౌర్జన్యాలతో నిండిన ఆ జాతిని, నిర్వీర్యం చేసేసి, వారిపై ఉన్నతమైన, యోగ్యమైన, నిర్మాణ యోగ్యతలు కలిగిన ఇంకో జాతికి అధికారాన్ని కట్టబెడతాడు. దేవుని ఈ పద్ధతిని Check and Balance అనే పద్ధతి అని కూడా అంటారు. (ప్రకాశకులు)*

ఎన్నో శతాబ్దాల వరకు భారతదేశంపై ముస్లింలు అధికారం కలిగి వున్నారు. నేడు వారు భారతదేశాన్ని తమ మాతృదేశంగా అంగీకరించి, వారి క్కడ సహజీవనం సాగిస్తున్నారు. వారు ఇక్కడనే జన్మిస్తారు, ఇక్కడ్నే జీవిస్తారు, ఇక్కడ్నే మరణిస్తారు కూడా. ప్రపంచం కూడా వీరిని భారతీయులుగానే గుర్తిస్తుంది.

ముస్లింల రాక కూడా భారతదేశానికి ఒక శుభపరిణామంగా పరిగణిం పబడింది. ఉత్తర, దక్షిణ భాగాల్ని కలిపి అఖండ భారతాన్ని రూపొందించిన ఘనత ఈ ముస్లిం పరిపాలకులకే దక్కుతోంది. ముస్లింలలోని సర్వమానవ సమానత్వపు భావన కూడా హిందువుల్ని ప్రభావితం చేయకుండా ఉండలేకపోయింది. రామానుజాచార్యులు, రామానందులు, గురూ నానక్‌జీ, చైతన్యస్వామి మొదలగు అనేక హిందూ ధార్మిక, సంఘ సంస్కర్తలు ఈ ముస్లింల పరిపాలనా కాలంలోనే ఉద్భవించారనేది గమనార్హం. ధార్మిక తీవ్రవాదాన్ని కట్టడి చేసిన భక్తి ఉద్యమం, ఏకేశ్వరత్వాన్ని, సమానత్వాన్ని ప్రాతి పదికగా చేసుకొని రూపొందిన శిక్కు ధర్మం, ఆర్య సమాజం- ఇవన్నీ ఇస్లాం ధర్మంతో ప్రభావితమై ఉనికిలోకి వచ్చినవే. సమానత్వం, సంఘ సంస్కరణలకు సంబంధించి ప్రభుత్వాల ద్వారా తరచుగా వెలువడే చట్టాలు ఉదాహరణకు అనివార్య పరిస్థితుల్లో విడాకులు, మృతుని ఆస్తిలో భార్య, కుమార్తెలకు వాటా కల్పించటం మొదలైన వాటి నేపథ్యంలో ఇస్లాం ధర్మంలోని బోధనలే ప్రేరణ నిస్తున్నాయి.[31]

---

31 హిందూ ధర్మాన్ని, సమాజాన్ని ఇస్లాం ఎన్ని విధాలుగా ప్రభావితం చేసిందో వివరంగా తెలుసుకొనగోరేవారు, స్వాతంత్ర సమరంలో చురుకుగా పాల్గొన్న, గాంధీజీ, నెహ్రూజీ సహచరుడు డాక్టర్ తారాచంద్ రాసిన *Influence of Islam on Indian culture* అనే పుస్తకాన్ని మరియు *M.N. Roy* రాసిన *The Historical Role of Islam in making Humanity* (మానవత్వ నిర్మాణంలో ఇస్లాం చరిత్రాత్మక పాత్ర) అనే గ్రంథాన్ని చూడొచ్చు. (అనువాదకుడు)

# 16. బహు భార్యత్వం

బహుభార్యత్వం పేరున ఇస్లాంను, ఇస్లామీయ ప్రవక్తను విమర్శించటం జరుగుతుంది. ఇది ఎంతమాత్రం సముచితమైనది, సమంజసమైనదీ కాదు. బహు భార్యత్వానికి సంబంధించి ప్రవక్త ముహమ్మద్(స) కంటే ముందు గడిచిన దైవప్రవక్తల జీవితాల్లో కూడా సాక్ష్యాధారాలు లభిస్తాయి. కాని వారి గురించి మేము ప్రస్తావించదలుచుకోలేదు. దానికి బదులుగా హిందువుల పూర్వీకులు, ధార్మిక పురుషుల జీవితాల నుండే ఉదాహరణలను సమర్పిస్తాము.

హిందూ ధర్మంలోని అవతారాలలోకెల్లా శ్రీకృష్ణుని అవతారం సంపూర్ణ మైన అవతారంగా పేర్కొనడం జరుగుతోంది. ఆయనకు ఎనమండుగురు పట్టపురాణులు, పదహారు వందల మంది ఇతర రాణులుండేవారు. వీరేకాక అనేకమంది గోపికలుండేవారు: అదేవిధంగా 'రాధ'తోనూ ఆయనకు గాఢ సంబంధముండేదని చెబుతుంటారు. అయినప్పటికీ ఆయన్ను 'యోగిరాజ్' (అంటే మహోన్నతమైన దైవనిష్ఠ గల తపస్వి) అని పిలుస్తారు. ఇంకా భార్యల ఈ బహుళ సంఖ్యను ఆధ్యాత్మికమైందిగా వివరించడం జరుగుతోంది. ఆయన జీవితాన్ని నీటిలో కమల పుష్పంలాగా పరిశుభ్రంగాను, పవిత్రంగాను పేర్కొనటం జరుగుతుంది. అంటే స్పష్టంగా అనేకమంది భార్యలున్నట్లు కనబడు తున్నప్పటికీ ఆయన వారి పట్ల నిరపేక్షంగా ఉండేవారు. శ్రీరామచంద్రుడైతే ఏకపత్నీవ్రతుడు. కాని ఆయన తండ్రి గారైన దశరథ మహారాజుకు అనేకమంది భార్యలుండేవారు. మహాభారతంలోని ప్రముఖ పాత్ర అయిన అర్జునుని తండ్రికి కూడా అనేకమంది భార్యలుంటుండేవారు.

ఇక ఇస్లామీయ ప్రవక్త అయిన ముహమ్మద్(స)కు సంబంధించినంత వరకు, ఆయన ఇరువై ఐదు సంవత్సరాల సంపూర్ణ యవ్వనంలో, నలభై సంవత్సరాల వయస్సు కలిగి అనేక పిల్లలున్న వితంతువు హజ్రత్ ఖదీజా (రజి)ను పరిణయమాడారు. ఇంకా వయస్సు క్షీణదశకు (50 సంవత్సరాలు)

చేరేవరకు కూడా ఆయన ఆ ఒక్క ముదుసలి భార్యతోనే గడిపేశారు. లైంగిక కోరికలు సామాన్యంగా సమాప్తమయ్యే వయస్సులో ఆయన చేసుకున్నా ఇతర వివాహాలు– ఆ స్త్రీలను ఆదుకునే ఉద్దేశ్యంతోనైనా చేసుకుని ఉండాలి లేదా వారి ద్వారా ఇతర ఇస్లామీయ లక్ష్యాలను సాధించే అవసరమైనా ఉండి ఉండాలి, తప్ప లైంగిక వాంఛ ఎంతమాత్రం కాదనే విషయం నిరూపితమవుతుంది. ఇది నిరూపించటానికి అనేక సాక్ష్యాధారాలున్నాయి. అందులో ఒకటి ఇది:

ఒకరోజు రాత్రి ఆయన(స) సతీమణి హజ్రత్ ఆయెషా(రజి) లేచి చూడగా ఆయన పరుపుపై కనబడలేదు. బహుశా ఆయన గారు తన ఇంకో సతీమణి దగ్గరికి వెళ్ళి ఉంటారని ఆవిడ భావించారు. కాని కాస్త పరికించి చూడగా, ఆయన దైవధ్యానంలో శిరస్సును భూమికి ఆన్చి ఉండటం చూడగానే ఆవిడ తన ఆలోచనలకు కుంచించుకుపోయారు.[32]

---

32. *శ్రీ రాజేందర్ నారాయణ్ గారు మహాప్రవక్త(స) బహుభార్యత్వానికి సంబంధించిన ఔచిత్యాన్ని, లక్ష్యాన్ని నిరూపించారు. కాని ఇది మహాప్రవక్త(స) వ్యక్తిత్వానికి సంబంధించిన ప్రత్యేక కోణం కనుక దీన్ని ఇంకాస్త విశదీకరిస్తే అది అసందర్భమేమీ కాదని భావిస్తున్నాం. స్త్రీల సంరక్షణ, ఇస్లామీయ లక్ష్యాలూ అంటూ శ్రీ రాజేందర్ గారు సూచించే ఉన్నారు. ఇది వాస్తవం కూడాను. వీటినే ఇంకాస్త విపులీకరిస్తున్నాము.*

*1. అరేబియా దేశం, అరబ్బు సమాజం, ధార్మికంగా, నైతికంగా, సామాజికంగా, రాజకీయంగా ఎంత క్షీణించి పతనావస్థకు చేరువై పోయిందంటే, దాన్ని సంపూర్ణ విప్లవం, పరివర్తన ద్వారా ఒక ఆదర్శనీయమైన సమాజంగా, దేశంగా తీర్చిదిద్దడం అనివార్యమే అయినప్పటికీ ఇది అత్యంత కష్టంతో కూడుకున్న పని. ఆ సమయంలో మొత్తం దేశం ఆయనను వ్యతిరేకిస్తున్నది. కనుక తనకు దగ్గరున్న వారితో, స్నేహితులతో, శ్రేయోభిలాషులతో సంబంధాల్ని పటిష్టపరచుకోవటం ఒకటైతే, ఎవరైతే శత్రుత్వం వహిస్తున్నారో వారు మిత్రులుగా మారకపోయినా కనీసం వారి విరోధం తగ్గించగలిగాలనేది రెండవది.*

*2. మహాప్రవక్త(స) ఇద్దరు సతీమణులైన ఆయెషా(రజి), హఫ్సా (రజి)లు ఆయన గారికి పరమ మిత్రులైన హజ్రత్ అబూబకర్(రజి), హజ్రత్ ఉమర్(రజి) కుమార్తెలు. జైనబ్ (రజి) ఆయన గారి మేనత్త కూతురు. ఆమెను ఆయన గారు బానిసత్వం నుంచి విముక్తం చేసిన జైద్(రజి)తో వివాహం చేశారు. కాని వీరిద్దరికీ పొసగలేదు. చివరికి జైద్(రజి) ఆవిడకు విడాకులిచ్చేశారు. జైద్(రజి) మహాప్రవక్త విముక్తపరిచిన బానిసయే కాక, ఆయనకు పెంపుడు కుమారుడు కూడాను. పెంపుడు కుమారుని చట్టపరంగాను, సామాజికంగాను, స్వంత కుమారునికి ఇవ్వబడే స్థానమే ఇవ్వటం ఆనాటి అరబ్బుల ఆచారం, సంప్రదాయమూను. ఈ పెంపుడు కుమారుని విడాకులు పొందిన స్త్రీతో పెంచుకున్న తండ్రి వివాహం చేసుకోరాదనేది ఆనాటి ఆచారం. ఈ ఆచారాన్ని ఇస్లాం రూపుమాపదలిచింది. దీనికోసం అది ఆచరణాపూర్వకంగా మహాప్రవక్త(స) వివాహాన్ని, జైనబ్ (రజి)తో జరిపించి దైవప్రవక్తనే సజీవ ఆదర్శంగా నిలిపి పెంపుడు కుమారుడు ఏ పరిస్థితిలోనూ స్వంత కుమారుడు కాజాలడని నిరూపిస్తూ ఈ ఆచారాన్ని శాశ్వతంగా రూపుమాపింది. హజ్రత్ రెహానా, జువేరియా, సఫియా (రజి)లు యూదు సర్దారుల కుమార్తెలు. దైవప్రవక్త పట్ల యూదుల వైరంలోని తీవ్రతను తగ్గించేందుకు ప్రవక్త మహనీయులు (స) వీరిని వివాహం చేసుకోవటం సముచితమూ, అనివార్యమై ఉండింది. ఉమ్మె హబీబా(రజి) పేరు గల ఆయన గారి భార్య మక్కా ప్రముఖ నాయకుడు, ఇస్లాంకు బద్ధ విరోధి అయిన అబూ సుఫ్యాన్ కుమార్తె. కనుక ఆమెతో వివాహం జరగగానే, అతని శతృత్వంలోని తీవ్రత తగ్గిపోయింది. ఉమ్మె సల్మా(రజి) అనబడే ఆయనగారి ఇంకో పత్ని కూడా మక్కా ప్రముఖుల్లో ఒకడైన అబ్దుల్ హౌల్ పుత్రిక. ఈ వివాహాల తర్వాత ఆ సంబంధిత తెగల్లో ఇస్లాం, ఇస్లామీయ ప్రవక్త(స) పట్ల వస్తున్న శతృత్వంలోని తీవ్రత తగ్గిపోయింది.*

3. ఏ ధార్మిక, నైతిక, సాంస్కృతిక విప్లవం కోసం ఆయన గారు దైవం తరఫున నియమింప బడ్డారో, దానికోసం కేవలం పురుషుల్ని సంస్కరిస్తే దాని ఉద్దేశ్యం నెరవేరదు. పురుషులతోపాటుగా స్త్రీలను కూడా బోధించి సంస్కరించటం అనివార్యమై ఉండింది. కాని ఇస్లామీయ సంస్కృతిననుసరించి దగ్గరి బంధుత్వం లేని స్త్రీ పురుషుల కలయిక నిషేధం. అందుకని ఆయన గారు స్త్రీలను నేరుగా

బోధించి, సంస్కరించే స్థితిలో లేరు. అదీగాక స్త్రీలకు సంబంధించిన ఎన్నో విషయాలు, ఎన్నో సమస్యలు, ఎన్నో వ్యవహారా లుంటాయి. వాటన్నింటిని స్త్రీలు బాహాటంగా పర పురుషుల ముందు బహిర్గతం చేయలేరు. పురుషులు కూడా అలాంటి వ్యవహారాల్లో స్త్రీలకు బోధించి, మార్గదర్శకం చేయలేరు, ఈ అవసరాన్ని దృష్టిలో పెట్టుకునే ప్రవక్త మహనీయులు వివిధ వయస్సులు, వివిధ యోగ్యతలు కలిగిన స్త్రీలను వివాహమాడారు. వారికి ధార్మికపరమైన బోధనల్ని, ఆదేశాల్నిచ్చి, వారిని సంస్కరించి మిగిలిన స్త్రీలకు వారు తగిన విధంగా బోధించి సంస్కరించే విధంగా వారికి తర్ఫీదిచ్చారు. దైవప్రవక్త(స) సతీమణుల్లో ఆయెషా(రజి), సల్మా (రజి) గొప్ప పండితురాండ్రుగా పైకెదిగారు. మహాప్రవక్త(స) సెలవిచ్చిన మాటల్ని 'హదీసు'లంటారు. హదీసు గ్రంథాల్లో ఆయన(స)గారి సతీమణుల ద్వారా ఉల్లేఖించబడిన హదీసులు అనేకం ఉన్నాయి.

ప్రవక్త మహనీయుల(స) బహుభార్యత్వంలో గుప్తమై ఉన్న లక్ష్యాలలో ఇవి కొన్ని. అలా కాదనుకుంటే, ఆయనకు తన లైంగిక ఉద్రేకం పట్ల ఎంత పట్టు ఉండేదంటే, నిండు యవ్వనం అంటే ఇరువై ఐదు సంవత్సరాల ప్రాయంలో ఆయన వివాహం చేసుకుని ఇంకా ఇరవై ఐదుసంవత్సరాలు, తన ముదుసలి భార్యతోనే గడిపేశారు. ఆవిడ గారి మరణం తరువాత సౌద(రజి) అనే ఆవిడతో వివాహం చేసుకున్నా, ఆవిడ గారు కూడా వితంతువు, వృద్ధ మహిళే. నాలుగు సంవత్సరాలు ఆవిడతో గడిపారు. ఇక ఆ తరువాత చేసుకున్న వివాహాలన్నీ 53 సంవత్సరాలు దాటిన తరువాతనే చేసుకున్నవి. ఆ వయసులో లైంగిక ఉద్రేకం చల్లబడటం సర్వసామాన్యమే కదా! ఇక ఇంతమంది భార్యలున్నప్పటికీ కాళ్లు వాచిపోయేలా రాత్రిళ్లు దైవారాధనలలో నిలబడి ఉండేవారు.



## 17. ఒకరి కంటే అధిక భార్యలు కలిగి వుండే సామాన్య జనం

సామాన్య ముస్లింలకు నలుగురు భార్యల వరకు అనుమతిని ఇచ్చిన ఇస్లాంను విమర్శించేవారు కొన్ని విషయాలను ముందుగా తెలుసుకోక పోవడం వల్లనే అలా విమర్శిస్తున్నారు. మొదటి విషయం: ఇది ఆజ్ఞ, ఆదేశం కాదు. కేవలం అనుమతి అనే విషయాన్ని మరిచిపోరాదు. రెండవ విషయం; ఈ అనుమతి ఏ సందర్భాల్లో, ఏ లక్ష్యాలనుద్దేశించి ఇవ్వబడిందో తెలుసుకోవటం అత్యంత అవసరం. ఇస్లాం రాకకు పూర్వం అరబ్బులు పది మంది వరకు కూడా భార్యల్ని ఉంచుకునేవారు. అయితే వారి అవసరాలను మాత్రం తీర్చేవారు కాదు. పైగా వారిని బాధించేవారు. రకరకాలుగా హింసించేవారు. ఈ భార్యల మధ్య న్యాయాన్ని పాటించేవారు కాదు. ఈ రుగ్మతల్ని దూరం చేసేందుకే నలుగురి కన్నా అధిక మంది భార్యల్ని చేసుకోవటంపై ఆంక్ష విధించటం జరిగింది. ఈ నలుగురి వరకు అనుమతిస్తూనే వారి మధ్య సమానత్వాన్ని పాటించడం, న్యాయంగా వ్యవహరించడం అనివార్యమని గట్టిగా తాకీదు చేసింది.

ఏ సమాజంలోనైతే బహుభార్యత్వం సర్వసామాన్యం అయిపోయిందో, మరే నాగరిక సమాజాల్లో ఇది వ్యాపించిపోయిందో అలాంటి సమాజాల్లో ప్రతి వ్యక్తి ఒకరికంటే ఎక్కువ మంది భార్యలు కలిగి వుండరాదనే ఆంక్షే విధించినట్లయితే అతను ఆ ఆంక్షను ఒకవేళ పాటించి ఉన్నా కూడా రహస్యంగా దొంగతనంగా, చాటుమాటుగానైనా సరే అతను ఈ ఆజ్ఞోల్లంఘనకు పాల్పడేవాడు. (నేటి ప్రగతి చెందిన సమాజాల్లో ఈ ఉల్లంఘన స్పష్టంగాను, అధికంగాను కానవస్తోంది) ఆవిధంగా ఇస్లాం ఆశించిన పరిశుద్ధ, పరిశుభ్ర సమాజం ఉనికి లోకి రాకపోయేది. దానికి భిన్నంగా నైతిక రుగ్మతలతో కూడిన కలుషిత సమాజం ఏర్పడేది. అది ఇస్లాంకు ఎట్టి పరిస్థితిలోనూ సమ్మతం కాదు. ఇంకొక విషయం- ఒకరికంటే ఎక్కువ మంది భార్యల అవసరం ఆ కాలం నాటి అరబ్బు సమాజానికి మాత్రమే కాదు నేడు కూడా దీని అవసరం ఏర్పడవచ్చు. ఇతర దేశాలకు, సమాజాలకు దీని అవసరం ఏర్పడవచ్చు. వ్యక్తిగతంగా మన

సమాజంలో కూడా దీని అవసరం ఏర్పడవచ్చు. అందుకని నైతిక రుగ్మతల నుండి. లైంగిక విచ్చలవిడితనం, విశృంఖలత్వాల నుండి సమాజాన్ని కాపాడటా నికి ఒకరికంటే ఎక్కువ మంది భార్యల అనుమతి ఇచ్చిన ఇస్లాం ఆదేశం అత్యంత సముచితమైనది, దూరదృష్టితో కూడుకున్నదని ఇంగిత జ్ఞానం గల ఏ వ్యక్తి అయినా అంగీకరించకుండా ఉండలేదు. [33]

---

*33. వేశ్య, పడుపు వృత్తి, వ్యభిచారం, అక్రమ లైంగిక సంబంధాలు, ప్రభుత్వ శాఖల ద్వారా అనుమతి పొందిన వేశ్య గృహాలు, అత్యంత హేయమైన కాల్‌గర్ల్ వ్యవస్థ, మానభంగం కోసం కిడ్నాప్‌లు, గర్భస్రావాలు, అక్రమ సంతానాల జననం, వారి హత్యలు, లైంగిక నేరాలు - వీటన్నిటి మూలంగా పుట్టుకువచ్చే అసంఖ్యాక నైతిక చెడులు, నష్టాలు, సమస్యలూ - ఈ సర్వానికి మూలకారణం బహు భార్యత్వపు నిషేధమే. ఈ నిషేధం ప్రభుత్వపరంగా అయినా లేక సమాజపరంగానైనా సరే.*

*బహు భార్యత్వంపై సంపూర్ణంగా నిషేధం విధించటం వల్ల బయల్పడిన కొన్ని భయానక పర్యవసానాలను ఈ క్రింది రిపోర్టు ద్వారా తెలుసుకోవచ్చు.*

*"ప్రపంచమంతటిలోకెల్లా అత్యంత అభివృద్ధి చెందిన దేశంగా పరిగణించబడే అమెరికా ప్రభుత్వ శాఖ అయిన ఎఫ్‌బిఐ 1960లో ఒక రిపోర్టును సమర్పిం చింది. ఆ రిపోర్టును అనుసరించి ఆ ఒక్క సంవత్సరం అనగా 1960లోనే 1,02, 555 మానభంగాల సంఘటనలు నమోదయ్యాయి. ఇలా జరిగిన సంఘటనల్లోని కేవలం పదహారు శాతం సంఘటనలు మాత్రమే నమోదు అయ్యాయనేది కూడా ఈ రిపోర్టే తెలుపుతుంది. అంటే 1960 సంవత్సరంలో జరిగిన మానభంగాల సంఖ్యను సరిగా అంచనా వేయాలంటే దీన్ని 6.25తో (ఈ 16శాతాన్ని 100 శాతంలో) గుణిస్తే, ఈ సంఖ్య 6,40,968 చేరుకుంటుంది. ఈవిధంగా వచ్చిన సంఖ్యను ఒక సంవత్సరంలోని 365 రోజులపై విభజిస్తే రోజుకు 1756 వస్తుంది. అంటే అమెరికాలో ప్రతిరోజు పదిహేడు వందల యాభై ఆరు మానభంగాల సంఘటనలు జరుగుతున్నాయన్నమాట.*

*ఇంకొక రిపోర్టు ప్రకారం, అమెరికాలో ప్రతిరోజు (1900) బలవంతపు మానభంగాల సంఘటనలు జరుగుతున్నాయి. National Crime Victimiza tion survey Burea of Justice Stastistics, (U.S. of Justice) ను అనుసరించి కేవలం ఒక్క 1996లోనే 3,07,000 కేసులు నమోదయ్యాయి.*

ఈ వివరాలు, సమీక్షల ద్వారా ఇస్లాం నలుగురు భార్యల వరకు అనుమతినిచ్చి, పదేసి మంది, అంతకన్నా ఎక్కువ మందిని భార్యలుగా ఉంచే ఆచారాన్ని శాశ్వతంగా సమాప్తం చేసింది. అంతేకాదు సమాజాన్ని కలుషితం చేసే నీతిహీనమైన సర్వ రుగ్మతల్ని అనగా వ్యభిచారం, పడుపు వృత్తి, ఉంపుడు గత్తెలు, అక్రమ లైంగిక సంబంధాలు లాంటివి సమాజంలో చొరబడకుండా అన్ని ద్వారాలు మూసేసింది. ఈ నలుగురి వరకు కూడా అనుమతినిస్తూ వారి మధ్య సమానత్వం, న్యాయాల్ని పాటించడం తప్పనిసరి చేస్తూ అనవసరమైన ఇలాంటి వివాహాల్ని సైతం నియంత్రించింది. ఇన్నివిధాలుగా పాటించిన ఈ

---

*అంటే మిగిలిన 69% కలుపుకుంటే 9,90,322 మానభంగాలు కేవలం ఒక్క 1996లోనే అమెరికాలోనే జరిగాయి. ఒక్కరోజుకు లెక్కకడితే రోజుకు 2713 మానభంగాల కేసులు ఒక్క అమెరికాలోనే జరిగాయి. కాస్తా ఆలోచించండి. ప్రతి 32 సెక్షన్లకు అమెరికాలో ఒక మానభంగం సంఘటన జరుగుతున్నది. 1990లో ఈ ఎఫ్‌బిఐ రిపోర్టే మానభంగానికి పాల్పడిన నేరస్థుల్లో కేవలం పదిశాతం నేరస్థులే పట్టుబడ్డారని, ఇది మొత్తం సంఖ్యలో 1.6శాతం అవుతుందని తెలిపింది. మానభంగ నేరస్థుల్లో యాభై శాతం మంది కేసు ప్రారంభం కాకముందే విడుదల చేయబడ్డారని కూడా తెలిపింది. అంటే కేవలం 0.8 శాతం నేరస్థులపైనే కేసులు నమోదు చేశారని అవగతమవుతోంది. ఈ విధంగా ఎవరైనా ఒక వ్యక్తి నూట ఇరవై ఒక్కసార్లు మానభంగానికి పాల్పడితే, కేవలం ఒక్కసారి మాత్రమే అతనికి శిక్ష పడే అవకాశముంటుంది. (Answers to Non Muslimis Comman Questions: About Islam - By Dr. Zakir Nayak)*

*వితంతువు, విడాకులు పొందిన స్త్రీల దయనీయ స్థితి, వారి సాధక బాధకాల నివారణ బహు భార్యత్వం ద్వారానే సాధ్యమవుతుంది. అదేవిధంగా వితంతు ఆశ్రమాల ఏర్పాటు, వాటిలో కొన్నింటిలో ఈ వితంతువుల ద్వారా లైంగిక కార్యకలాపాలు, వీరి మానసిక, ఆర్థిక శోషణల నివారణ కూడా ఈ బహు భార్యత్వం ద్వారా సముచితంగా పరిష్కరించే అవకాశాలు ఎంతో ఉండేవి. అయితే దీన్ని సంపూర్ణంగా నిషేధించేశారు. ఇస్లాం బహు భార్యత్వానికి పరిమిత అనుమతినిచ్చి, ఇలాంటి రుగ్మతల్ని, చెడుల్ని వ్యాపించకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసింది. (ప్రకాశకులు)*

యుక్తులు, షరతులు, ఆంక్షల ఫలితంగా, నలుగురు భార్యలు కలిగి వుండే ఆచారం కూడా తగ్గుతూ తగ్గుతూ చివరికి దాదాపుగా ఆగిపోయినట్లయింది.

ఈ నియమం ఒక ధార్మిక నియమమని, సమాజం కూడా ధార్మికత్వంతో పరిపూర్ణమై ఉండేదనే విషయాన్ని ఇక్కడ మరువరాదు. కాని ఏకపత్నీ సిద్ధాంతాన్ని స్వయంగా కోరి సమర్థించే వారు, బహు భార్యత్వాన్ని వ్యతిరేకించే వారి నీతి నడవడికలు, వారి సమాజ పరిస్థితులెలా ఉన్నాయి?

ఇస్లాం అనుమతించిన బహు భార్యత్వాన్ని అమితంగా వ్యతిరేకించే వారు యూరప్, అమెరికాలకు చెందిన క్రైస్తవులే. అక్కడ ఒకరికంటే ఎక్కువ మంది భార్యలను కలిగి ఉండటం చట్టపరంగా నేరం. కాని అక్రమ సంబంధాల ద్వారాలు బార్లా తెరవబడి ఉన్నాయి. అక్కడ ఉంపుడు గత్తెలున్నారు. సొసైటీ గర్ల్స్, కాల్‌గర్ల్స్ ఉన్నారు. వేశ్యలున్నారు. క్లబ్బులున్నాయి. హోటళ్ళున్నాయి. అక్రమ సంబంధాలకు అన్నిరకాల అవకాశాలున్నాయి. అందుకని సామాన్య ప్రజలూ దుర్వర్తనులే. ఉన్నత వర్గమూ దుర్మార్గాన్ని అనుసరిస్తున్న వాళ్లదే. పార్లమెంటు సభ్యులూ దుర్మార్గులే, మంత్రివర్యులూ దుశ్శీలురే. చివరికి పాదరీలు కూడా దుర్వర్తనులే.[34] పురుషులు ఏ మురికిలో కూరిపోయి ఉన్నారో, స్త్రీలూ అదే స్థితిలో ఉన్నారు. దుశ్శీలానికి, నీతి రాహిత్యానికి పాల్పడని స్త్రీలు ఏ వర్గంలోనూ లేరు. నీతిబాహ్యానికి, వ్యభిచారానికి ఇంతగా ఆచారముండి,

---

*34. అసోసియేటెడ్ ప్రెస్‌ను అనుసరించి ప్రొటెస్టెంట్ చర్చీల ఫాదరీలకు, స్టాఫ్ మెంబర్లకు వ్యతిరేకంగా పిల్లల్ని లైంగిక శోషణకు గురిచేశారనే ఆరోపణలు సంవత్సరానికి (260) తమకు చేరుతున్నాయని, చర్చీలకు చెందిన (3) ఇన్సూరెన్స్ కంపెనీలు వాపోయాయి. ఇక క్యాథలిక్కు చర్చీ తన రిపోర్టులో ఇలాంటి సంఘటనలు 1950 నుంచి నేటివరకు (13,000) కేసులు, అనగా సంవత్సరానికి (228) చొప్పున తమకు అందాయని అంగీకరించింది. (దావత్ పత్రిక- 7-7-2007)*

అలవాటుపడిన సమాజంలో ఒకరికంటే అధిక మంది భార్యల ప్రశ్నే తలెత్తదు. ప్రజలు ఒకరికంటే ఎక్కువ మంది భార్యల 'చిక్కులు' ఎందుకు ఎదుర్కొంటున్నారు? ఇకిప్పుడు అసలు వివాహమే అవసరం లేదనే స్త్రీ పురుషుల వర్గం ఒకటి బయల్పడింది. ఈ వర్గం విశృంఖల లైంగిక సంబంధాలు, ఆటంకం లేని శారీరక సుఖాన్ని మాత్రమే కోరుకుంటున్నది. దీనికి పాశ్చాత్యం అందమైన పేర్లను కూడా కనిపెట్టింది. Live in relation అని Dating అని (ఇలా ముద్దుగా పిలుచుకుంటారు)[35]

---

*35. పాశ్చాత్యదేశానికి చెందిన విద్వాంసురాలైనప్పటికీ ఒకామె భారతదేశంలోని ఒక సంస్కరణ ఉద్యమానికి నాయకత్వం వహించింది. దక్షిణ భారతదేశంలోని ఒక సాంస్కృతిక సంస్థ (తియోసోఫికల్ సొసైటీ, అధ్యక్షురాలుగా కూడా పనిచేసింది. అంతేకాక భారత స్వాతంత్ర సమరంలో కూడా చురుకుగా పాల్గొన్నది. ఆమె పేరు మిసెస్ అనిబిసెంట్. స్త్రీల విషయంలో ఒక స్త్రీ కాస్త సెన్సెటివ్‌గానే ఉంటుంది. వారి ప్రయోజనాల పట్ల కుతూహలం కలిగి ఉంటుంది. ఆమె ఇలా చెప్పారు :*

*"పరిమిత బహు భార్యత్వానికి అనుమతి ఇస్తుందని ఇస్లాంను విమర్శించే వారైతేమీకు లభిస్తారు. కాని నేను లండన్‌లోని ఒక హాల్‌లో ఉపన్యసిస్తూ చేసిన విమర్శను వారు మీకు చూపించరు. నేను సభికులనుద్దేశించి ఇలా అన్నాను : 'భార్య మాత్రం ఒక్కతే ఉండి, అనేకమంది పరస్త్రీలతో సంభోగించటం పచ్చి మోసం. పరిమిత బహుభార్యత్వం కంటే ఎంతో హేయమైనది. సహజంగానే ప్రజలు నేను చేసే ఇలాంటి విమర్శల్ని విని బాధపడతారు. కాని వారికి చెప్పక తప్పదు. ఎందుకంటే స్త్రీల విషయంలో ఇస్లామీయ చట్టాలు, ప్రపంచ చట్టాలన్నింటిలోకెల్లా న్యాయప్రదమైనవి. ఈ చట్టాలే మొన్నటి వరకు ఇంగ్లాండ్‌లో అనుసరింపబడేవి. ఆస్తి, వారసత్వ హక్కులు, విడాకుల విషయాలతో ఈ చట్టం పాశ్చాత్య చట్టాలకన్నా ఎంతో మేలైనది. స్త్రీల హక్కుల్ని పరిరక్షించే చట్టమిది. ఏకపత్నీ, బహు భార్యత్వం అనే పదాలు ప్రజల్ని సమ్మోహితుల్ని చేసేశాయి. వారు పాశ్చాత్య దేశాల్లో స్త్రీల హీనత్వంపై దృష్టి సారించటంలేదు. వారి మొదటి భర్తలు, వారిని తృప్తితీరా అనుభవించిన తరువాత బజార్లకీడుస్తున్నారు. ఆ తరువాత ఆమెను ఆదుకునే నాధుడే లేడు. Life & Teaching of Mohammad.By Anniebesant, Madras,1932, Page-3.*

మనం మన దేశంపై కూడా ఒకసారి దృష్టిసారించాలి. మన దేశం కూడా ఈ రుగ్మతల నుండి అతీతంగా లేదు. ధర్మం ప్రభావ రహితమైపోయింది. చట్ట నియమాలు పనికి రాకుండా పోయాయి.

దయచేసి హిందూ సోదరులు ఒక విషయం గురించి ఆలోచించాలి. సంపూర్ణ అవతారమైన శ్రీకృష్ణుల వారు స్వయంగా ఎందరో భార్యలను కలిగి ఉండేవారు. ఇంకా వారి పురాణాల్లో పేర్కొనబడిన చారిత్రాత్మకక మహాపురుషులు బహు భార్యలను కలిగి ఉండేవారు. హిందూ ధర్మంలోనైతే అనేకమంది భార్యలతోపాటుగా, అనేకమంది భర్తలు కలిగి ఉన్నట్లు కూడా పేర్కొనబడింది. పాండవుల పత్ని అయిన ద్రౌపది, ఐదుగురు భర్తలు కలిగి ఉండేది. సమాజాన్ని స్త్రీ వర్గాన్ని, వేశ్యలు, ఉంపుడు గత్తెలకు జన్మించిన అమాయక సంతానాన్ని దృష్టిలో పెట్టుకొని ఆలోచించండి. అసహ్యామైన వేశ్యల వ్యవస్థ కన్నా, ఉంపుడు గత్తెల ఆచారంకన్నా ఇస్లాంలోని పరిమిత బహుభార్యత్వపు చట్టం ఎంతో ప్రయోజనకరమైనది, గర్వించదగినది కాదా?[36]

---

*36. ఎంత మూల్యం చెల్లించైనాసరే సమాజాన్ని మాత్రం పరిశుద్ధంగా, పరిశుభ్రంగా ఉంచడం ఇస్లాం ధ్యేయం. ఇక వ్యభిచారం, లైంగిక విశృంఖలత్వం అనేది ఇతర దుర్మార్గాలు, దౌష్ట్యాలన్నింటికంటే అధికంగా సమాజాన్ని కలుషితం చేసేస్తుంది. ఒకరికంటే ఎక్కువ మంది భార్యల అనుమతినిచ్చిన ఇస్లాం వ్యభిచారాన్ని, అక్రమ సంబంధాన్ని ధార్మికమైన పాపంగాను, నైతికంగా, సామాజికంగా, చట్టపరంగా ఒక నేరంగాను పరిగణించి దీనికి కఠినమైన శిక్షను నిర్ణయించింది. సమాజాన్ని పరిశుద్ధంగా, నిర్మలంగా ఉంచడానికి, స్త్రీల అవమానాన్ని, అవహేళనను, శోషణాన్ని నిర్మూలించడంలో తిరుగులేని ఔషధాలుగా పనిచేసిన ఈ శిక్షల్ని క్రూరమైనవి, అనాగరికమైనవిగా పేర్కొంటూ ఇస్లాంపై రకరకాలుగా, అన్ని స్థాయిల్లోనూ నిందారోపణ చేయటం అత్యంత విచారించదగ్గ విషయం. అయితే చేతులు కాలాక ఆకులు పట్టుకున్న చందాన వ్యభిచారం, ప్రత్యేకించి మానభంగాలు మితిమీరిపోవటాన్ని చూసి కలవరపడిన నేటి (1999) రాజకీయ నాయకులు, హిందూత్వానికి అగ్రశ్రేణిలో నిలబడిన ప్రముఖులతో సహా*

మానభంగానికి మరణశిక్ష విధించే శాసనాన్ని పార్లమెంటులో ఆమోదింప జేయాలని వాదిస్తున్నారు.

యూరప్‌కు చెందిన కాల్పనిక సభ్యతా సంస్కారాలు, మానవత్వాన్ని అమితంగా ప్రేమించేవారమని చెప్పుకునేవారు, ఇలాంటి శిక్షల్ని అనాగరికమైనవే కాదు, మానవేతరమైనవని కూడా అంటారు. వారిలా అనడానికి కారణం ఏమిటంటే వ్యభిచారాన్ని వారు ఒక నీతిబాహ్యమైన, హేయమైన చర్యగా అసలు భావించటమే లేదు. వ్యభిచారం, అక్రమ లైంగిక సంబంధం అనేది యూరప్ సామాజిక జీవితంలో ఒక అనివార్య అంశంగా చేరిపోయింది. అందుకని అది వారికి పెద్ద నేరంగా కనబడడమే లేదు. కొన్ని సంవత్సరాల క్రితం డర్బిన్ యూనివర్సిటీకి చెందిన ఒక ప్రొఫెసర్ ఆధ్వర్యంలో యూరప్‌కు చెందిన ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన చట్ట నిపుణుల బృందమొకటి సౌదీ అరేబియాకు వెళ్ళింది. ఇస్లామీయ చట్టాల్ని, ప్రత్యేకించి వాటిలోని శిక్షాస్మృతిని అధ్యయనం చేయడం, ఈ విషయంలో చర్చించి, వాస్తవాలను తెలుసుకోవడం ఈ పర్యటన ముఖ్యఉద్దేశ్యం. వారు నేర నిరోధక శాఖలకు వెళ్ళి బహిరంగంగా రికార్డులు మొదలగు వాటిని అధ్యయనం చేసి దేశంలో నేరాల పరిస్థితి ఏమిటో తెలుసుకోవచ్చని సంపూర్ణంగా అనుమతిని పొందారు. ఇక ఎప్పుడైతే వారు ఈ రికార్డులు, ఫైళ్లు, నేరాల సంఖ్య మున్నగునవి పరిశీలించారో వారు దిగ్భ్రాంతికి లోనయ్యారు. యూరప్‌లోని ఏ నగరాలైతే అరేబియా నగరాలకు సమానమైన జనాభా కలిగి ఉన్నాయో, వాటిలో నేరాల నిష్పత్తి 1000: 1 ఉంది. అంటే యూరప్‌లోని ఒక నగరంలో వేయి నేరాలు జరిగితే అంతే జనాభా గల అరేబియా నగరంలో కేవలం ఒక్క నేరం మాత్రమే జరిగింది.

పై చట్ట నిపుణుల ప్రకారం, వ్యభిచార నేరానికి రాళ్లతో కొట్టి చంపటం (రజమ్), దొంగతనానికి శిక్ష చేయి నరకటం అమానుషమైన శిక్షలు. ఒక కోటి డాలర్ల డబ్బు ఇచ్చి ఎవరైనా ఒక వ్యక్తిని వారికిష్టమైన చోటికి పంపండని వారికి ఛాలెంజ్ చేయటం జరిగింది. ఆ వ్యక్తి భద్రంగా, సురక్షితంగా ఆ నిర్ణీత స్థలానికి చేరుకుంటాడా లేదా అనే విషయం వారే తెలుసుకుంటారని చెప్పటం జరిగింది. ఎందుకంటే అదే యూరప్‌లో ప్రతిరోజు దొంగతనాలు, దోపిడీలు జరుగుతుం టాయి. ఇంకా వాటిలో అనేకులు హతులవుతారు కూడా. (ఆ వ్యక్తి సురక్షితంగా నిర్ణీత స్థలానికి చేరుకోగలిగాడు)

ఇస్లామీయ చట్టాల్లోని విశిష్టత, వాటి ప్రభావాలను ప్రత్యక్షంగా చూసి, వారు తమ సిద్ధాంతాలు, భావనలపై అత్యంతగా సిగ్గుపడ్డారు. అక్కడి నుంచి తిరిగి వచ్చిన తరువాత వారొక ప్రెస్ కాన్ఫరెన్స్‌ను నిర్వహించి కేవలం ఇస్లామీయ చట్టాలే నేరాలను సమాప్తం చేయగలుగుతాయి, ముస్లింలు నిస్సందేహంగా తమ (ధార్మిక) చట్టాలపై గర్వపడటం సముచితమే" అంటూ ప్రశంసించారు.

చివరలో, వ్యభిచారానికి సంబంధించి హిందూ చట్టంలో ఏముంది అనేది కూడా ఒకసారి పరిశీలిద్దాం. 'మనుస్మృతి' చట్టాలు ఇలా ఉన్నాయి :

- ఎవరైనా ఒక శూద్రుడు ద్విజాతి (బ్రాహ్మణ,క్షత్రియ, వైశ్య వర్ణాల) స్త్రీతో సంభోగిస్తే అతనికి మరణశిక్ష విధించాలి. *(8- 359)*
- పరస్త్రీతో సంభోగించే పురుషుల్ని, బెదిరించే శిక్షలు విధించి, అంగభంగం చేసి, పరిపాలకుడు అతన్ని దేశం నుంచి వెడలగొట్టాలి. *(8-352)*
- ఒక గృహస్తుడు, వేరొక మనిషిని తన భార్యతో మాట్లాడవద్దని ఆదేశిస్తే అతను ఆ గృహస్తుని భార్యతో మాట్లాడకూడదు. ఈవిధంగా మాట్లాడకూడదని ఆదేశింపబడిన మనిషి ఒకవేళ మాట్లాడితే అతను పదహారు మాషాల బంగారం (తులానికి 12 మాషాలు) జరిమానాగా చెల్లించాలి.
- ఎవరైనా ఒక వ్యక్తి ఒక అమ్మాయిని చెరిచి ఆమెను అపవిత్రం చేస్తే, వెంటనే అతను వధించబడటానికి అర్హుడు. కాని ఒకవేళ అమ్మాయి అంగీకారంతో ఆమెను అపవిత్రం చేసివుంటే, అతను అదే వర్ణానికి చెందినవాడై ఉంటే అతను సంహరింపబడటానికి అర్హుడు కాడు. *(8-364)*
- అతనితో సంభోగించే కోరికతో, ఉన్నత వర్ణానికి చెందిన పురుషునికి సేవ చేసే అమ్మాయికి ఎలాంటి శిక్ష విధించరాదు. కాని నిమ్న వర్ణానికి చెందిన వాని వద్దకు పోయే అమ్మాయితో కట్టుదిట్టంగా నియమానుసారం వ్యవహరించాలి. *(8- 365)*
- ఉన్నత వర్ణానికి చెందిన అమ్మాయితో సంభోగించే నిమ్నజాతి పురుషుడు చంపబడటానికి అర్హుడు. తన స్వజాతి అమ్మాయితో సంభోగించి ఉన్నట్లయితే డబ్బిచ్చి– ఒకవేళ ఆమె తండ్రి దీనికి అంగీకరిస్తే– ఆమెను వివాహమాడాలి. *(8- 366)*

# 18. ఇస్లామ్ - పరదా వ్యవస్థ

ఇస్లాం నియమించిన పరదా పద్ధతి, స్త్రీ పురుషుల్లో భేదభావాన్ని పాటించేదిగాను, స్త్రీల ఆరోగ్యం, ప్రగతిలో ప్రతిబంధకంగా నిలుస్తుంది అన్నది ఓ అభ్యంతరం.

ఇస్లామీయ పరదా పద్ధతి నూటికి నూరుపాళ్లూ సముచితమైనదీ, అత్యవసరమైనదీ అనేది మా సమాధానం. ఇక స్త్రీపురుషుల్లో సమానత్వానికి సంబంధించినంతవరకు ఇస్లామీయ ధర్మమే మొట్టమొదటిసారిగా స్త్రీకి వారసత్వంలో హక్కు (వాటా) కల్పించింది. అనివార్య పరిస్థితుల్లో విడాకులు (ఖులా) పొందే హక్కును, పరిస్థితి ఏదైనప్పటికీ, స్త్రీకి మహర్‌ను పొందే హక్కును నిర్ణయించింది అనే విషయాన్ని మరువరాదు. దీనికి భిన్నంగా హిందువుల్లో స్త్రీలకు తమదంటూ ఒక ఉనికే లేదు. భర్త చనిపోయిన వితంతువును సజీవంగా కాలబెట్టేవారు. భర్త గతించిన (లేక విడాకులు పొందిన) తరువాత నాలుగు నెలల పదిరోజుల గడువు సమాప్తమైన పిదప వితంతువు పునర్వివాహాన్ని చేసుకొని ప్రశాంతమైన జీవనం గడిపే హక్కును ప్రసాదించింది ఇస్లాం.[37] హిందూ ధర్మంలోనైతే వితంతువుకు పునర్వివాహం చేసుకొని ప్రశాంతమైన, సుఖదాయకమైన జీవనం గడిపే హక్కే లేకుండేది. ఆమె తన స్వకుటుంబంలోనే నిర్లక్ష్యానికి గురై అవమానకరమైన, తుచ్ఛమైన జీవితం గడపవలసి వస్తుండేది.

క్రైస్తవ రాజ్యాల్లో నేటి వరకు కూడా ఆస్తి వారసత్వాల్లో స్త్రీల హక్కును సంపూర్ణంగా గుర్తించడం జరగలేదు. ఒకానొకప్పుడు యూరప్ విద్వాంసుల్లో

---

37. *ఈ నాలుగు నెలల పదిరోజుల గడువు ఉద్దేశ్యమేమిటంటే, ఒకవేళ ఆమె గర్భవతి అయిన ప్రారంభ దశలో విధవ (లేక విడాకులు)అయివున్నట్లయితే ఈ గడువులో ఆమె గర్భం పూర్తిగా బయటపడాలి. పునర్వివాహం ద్వారా ఏర్పడిన దాంపత్య సంబంధాల్లో మొదటి భర్త సంతానం కారణంగా చిక్కులుగాని, సమస్యలుగాని ఏర్పడే అవకాశముండకూడదు.*

స్త్రీల్లో ఆత్మ ఉంటుందా? ఉండదా? అనే విషయంపై వాదోపవాదాలు కూడా జరుగుతుండేవి.

పరదా స్త్రీల ఆరోగ్యం, ప్రగతిలో ఆటంకం ఎలా అవుతుంది? ఆరోగ్యం కోసం, స్త్రీలు పరదా లేకుండా బహిరంగంగా తిరగడం అనివార్యమా?[38]

స్త్రీలకు కేవలం పరదా పాటించాలనే ఆదేశాలు మాత్రమే ఉన్నాయి. స్త్రీలు తమ భర్తలతో ఇంకా (రక్త సంబంధం కలిగి, వివాహ సంబంధం నిషేధితమైన వరుసలు అనగా తండ్రి, సోదరుడు, కుమారుడు, సోదర సోదరీమణుల కుమారులు, బాబాయి, మేనమామ మున్నగు వారితో సైతం) కలిసి పరదా పాటిస్తూ వాహ్యాళి, వినోదం, షికారు కోసం వెళ్ళే అనుమతిని ఇస్లాం ప్రసాదిం చింది. దీనిపై ఎలాంటి ఆంక్ష లేదు.

ముస్లిం స్త్రీలు ఆరోగ్యవంతులుగా ఉండకపోతే ఆరోగ్యవంతులైన పిల్లలకెలా జన్మనివ్వగలుగుతున్నారు? అదేగాక స్వయంగా ముస్లింలు ఎలా ఆరోగ్యవంతులుగా ఉండగలుగుతున్నారు? ముస్లింలకు నలువైపులా, బహుముఖంగా లభించిన విజయాల పరంపరకు ప్రపంచం నిర్ఘాంతపోయింది. వారందరూ ముస్లిం తల్లుల సంతానం కాదా? ఆ కాలంలోనైతే పరదా ఇంకా కఠినంగా ఆచరించబడేది. యూరప్‌కు చెందిన చక్రవర్తుల సమిష్టి సైనిక బలాన్ని ఓడించిన సుల్తాన్ సలాహుద్దీన్ అయ్యూబి జెరూసలెంను ఎలా జయించగలిగాడు?

స్త్రీల ఆరోగ్యం, ప్రగతి, సమానత్వం వగైరాల ప్రశ్న యూరప్ వాళ్ళు

---

*38. ఒకవేళ ఇదే నిజమై ఉంటే, అర్ధనగ్నంగా తిరుగాడే స్త్రీలు పరిపూర్ణంగా, ఆరోగ్యవంతులై ఉండవలసింది. పరదా పాటించే స్త్రీలు పూర్తి శరీరాన్ని కప్పివేసే దుస్తుల్ని తొడిగే స్త్రీలు బలహీనంగాను, రోగిష్టులుగాను ఉండవలసింది. కాని వాస్తవాల్ని తిలకిస్తే పరదా పద్ధతి ఆరోగ్యానికి హానికరం అని పేర్కొనేవారి 'హితోక్తులు' నిరర్థకమైనవని, హాస్యాస్పదమైనవని స్పష్టమవుతున్నది. (ప్రకాశకులు)*

లేవదీశారు. కాని వారు స్త్రీని లైంగిక అవసరాలు తీర్చే ఒక ఆట వస్తువుగా మార్చివేశారే! ప్రతి ధర్మంలోను, ప్రాచీన సంస్కృతుల్లోను, ఆర్థిక సంపాదనా భారాన్ని పురుషులపై వేయబడింది. స్త్రీల కార్యాచరణ రంగం వారి గృహాలై ఉండేవి. హిందూధర్మం, సంస్కృతుల్లో స్త్రీలపై ఆర్థికభారం ఎప్పుడూ వేయటం జరుగలేదు. ఇక స్త్రీ పురుషుల సమానత్వం, సమాన హక్కులకు సంబంధించి నంతవరకు స్త్రీ స్వాతంత్ర సమర్థకులు- దీని గురించి దైవాన్నే అడగాలి. స్త్రీ పురుషుల్ని సమానంగా సృష్టించాలని, పురుషులు కూడా సంతానాన్ని కనాలని, పాపం ఒక్క స్త్రీలు మాత్రమే ఈ బాధనెందుకు భరించాలని ఆ పరాత్పరున్నే ప్రశ్నించాలి.

శరీర అవయవాల శాస్త్రం, మానసిక శాస్త్రాలననుసరించి స్త్రీలు శారీరకంగాను, మానసికంగాను సున్నితంగా, నాజూకుగా ఉంటారు. పరదా పద్ధతి వారి సంరక్షణకు అత్యంత లాభదాయకమైనది. పరదా అనేది వారిని కామ దృష్టి (Eye teasing) నుంచి కాపాడుతుంది. చెడు చూపుల, కామ దృక్కుల ఫలితాలు కొన్ని సందర్భాల్లో అత్యంత భయానకంగా బయల్పడు తున్నాయి. కిడ్నాపులు, మానభంగాలు, ఈ చెడుచూపుల పర్యవసానాలే. జాగ్రత్త పడకుండా వ్యాధి వాత పడడం బుద్ధివంతుల లక్షణం అనుపించుకోదు.[39]

---

*39. స్త్రీల సున్నితత్వం, శీల సంపదకు ఎలాంటి విలువ ఇవ్వని వారే పరదాపై ఇలాంటి ఆక్షేపణల్ని లేవనెత్తుతారు. వారు స్త్రీలను పురుషులలైంగిక తృష్ణను తీర్చే ఒక సాధానంగా మాత్రమే గుర్తిస్తారు. ఇలాంటి వారు, ఇస్లాంలోని పరదా పద్ధతి యొక్క ఔచిత్యాన్ని ఏమని అర్థం చేసుకోగలుగుతారు? స్త్రీ, పురుషుల్లో స్వాభావికంగానే ఒకరిపట్ల ఇంకొకరికి ఒకవిధమైన ఆకర్షణ ఉంటుంది. అందుకని వారు ఒకరినొకరు చూడగానే సహజంగానే ఉత్తేజితులవుతారు. స్త్రీల్లోని పరదా రాహిత్యమే వ్యభిచారానికి ద్వారం లాంటిది. పరదా ద్వారా ఇస్లాం ఈ ద్వారాన్నే మూసేస్తుంది. స్త్రీల్లో అన్నిటికన్నా విలువైనది వారి శీల సంపద మాత్రమే. దాన్నే ఇస్లాం సంరక్షిస్తుంది. పరదాను వ్యతిరేకించే వారే వాస్తవంలో స్త్రీల శీలసంపదకు, నిష్కళంకతకు శత్రువులు.*

# 19. గోమాంస భక్షణ

**ఇస్లామీయ ధర్మం పంది మాంసాన్నైతే నిషేధించింది కాని గో మాంసంపై నిషేధం విధించలేదు. ఇది సముచితమా? అంటూ ప్రశ్నిస్తారు.**

పంది, ఆవులో గల బేధాన్ని ఒక సామాన్య వ్యక్తి కూడా అర్థం చేసుకో గలుగుతాడు. పంది ఎంత అపరిశుభ్రమైనది, చూడగానే అసహ్యం వేసే జంతువు. ఆవునైతే హిందూ ముస్లింలందరూ పెంచుకుంటారు. కాని పందిని ఒక ప్రత్యేక జాతి వారు తప్ప ఎవరూ పెంచరు. పంది మాంసాన్ని తినడంపై ఇస్లాం విధించిన నిషేధం అన్ని విధాల సముచితమైనది, సమంజసమైనది కూడా. ఇక ఆవు మాంసం భక్షణ విషయానికొస్తే ఆవు మాంసాన్ని ఉపయోగించడాన్ని ఇస్లాం నిస్సందేహంగా అనుమతించింది. అయితే ఇది అనుమతి మాత్రమే. ఆజ్ఞ లేక ఆదేశం కాదు. దీన్ని తప్పనిసరిగా ఉపయోగించాలనే ఆంక్ష ఏమీ లేదు. ఇస్లాం ప్రతిపాదించిన నియమాలన్నీ కేవలం ధార్మిక భావనలపై మాత్రమే ఆధారపడి లేవు. అవి బుద్ధిజ్ఞానాలు,

---

*భారతదేశం పరదా పద్ధతిని ఎరుగదు. ముస్లింలు ఈ దేశానికి వచ్చిన తరువాత వారి వనితలు పరదా పాటించటాన్ని వారు చూశారు. అందులోని ఔచిత్యం వారికి అర్థమైపోయింది. అప్పటినుంచి హిందువుల్లో కూడా పరదా ఆచారం మొదలయింది. ఇక నేటి ఆధునిక కాలంలో ఈ పరదా అనేది ముస్లింల అనుకరణ అని, మన ప్రాచీన సంస్కృతికి ఇది భిన్నమని భావించి పరదాను త్యజించారు. దీని ఫలితంగా అమ్మాయిలు ఓణీలను, పరికిణీలను సైతం త్యజించారు. ఇక దుస్తులు కూడా వారి శరీరాల నుంచి దాదాపుగా దూరమవు తూనే వస్తున్నాయి. నేడు మనం పత్రికల్లో, టీవీల్లో స్త్రీల కిడ్నాపులు, మానభంగా లకు, 5,7 సంవత్సరాల పసి పాపలపై కూడా ఈ మానభంగాలకు సంబం ధించిన ఏవైతే వార్తలు వింటున్నామో, ఇవన్నీ దాని పర్యవసానాలే. ఇదే పరిస్థితి ఇలాగే కొనసాగితే మన దేశానికి కూడా యూరప్, అమెరికాల గతే పడ్తుంది. అక్కడ మనిషి మృగం, అంతకన్నా హీనమైపోయాడు. దైవం మన దేశాన్ని ఈ చెడు పర్యవసానాల నుండి రక్షించుగాక!*

శాస్త్రం, సముచిత్వాన్ని కూడా కలిగి వుంటాయి. అదొక సిసలైన, స్వచ్ఛమైన ఏకేశ్వరుడ్ని విశ్వసించే ధర్మం. అది ఆవును ఆరాధనీయం (దైవం)గా ఒప్పుకోదు.

ఇక హిందూ ధర్మానికి సంబంధించినంత వరకు, సింధూ నాగరికత కాలం నాటి హిందువులు ఆవుకు ధార్మికతను ప్రతిపాదించి ఉండలేదు. 'వ్యవసాయ సంస్కృతికి వ్యవస్థాపకులైన ఆర్యులు, ఆర్థికదృష్టితో ఆవును గౌరవించేవారు. కాని ప్రత్యేక సందర్భాల్లో వారు ఎద్దు మాంసాన్ని ఉపయోగించేవారు. గడిచిన కాలాల్లో, యజ్ఞాల్లో విపరీతంగా పశువులు వధించబడేవి. 'గోమేధ యాగాలు' కూడా జరిగాయి. విపరీతమైన ఈ జీవ హింసకు ప్రతిచర్యగానే 'బౌద్ధ అహింస' పుట్టుకొచ్చింది. కాని అది కూడా ఆచరణ యోగ్యంగా నిరూపితం కాలేకపోయింది. అత్యధిక మంది బౌద్ధులు మాంసాహార భక్షకులే. గేదెలు, మేకల బలులైతే నేటికీ హిందూ దేవుళ్లు, దేవతల కొరకు జరుగుతూనే ఉన్నాయి.[40]

---

40. *శ్రీ రాజేందర్ లాల్ గారు గోవధకు సంబంధించి క్లుప్తంగా వివరించారు. కాని దీనితోపాటుగానే 'జీవహింస'ను కూడా జోడించడం జరుగుతుంది. అలా జోడించి ఇస్లాం హింసను అనుమతినిస్తుందని నిందారోపణ చేస్తారు. అందుకని ఈ విషయానికి సంబంధించిన వాస్తవాలను పరిశీలించడం కూడా అనివార్యమే.*

*జీవహింస అనే ఈ అంశాన్ని గోసంరక్షణతో జోడించి ఉద్రిక్తలు రేకెత్తించడానికి ఉపయోగిస్తారు. నిజానికి ఇది బుద్ధి, జ్ఞానం, ఆచరణలరీత్యా బొత్తిగా పొంతనలేని విషయం. స్వయంగా హిందూ ధర్మంలోనే మాంసాహారానికి అనుమతి ఉందన్నది పచ్చి నిజం. మనుస్మృతిలోని 5వ అధ్యాయంలోని ఈ శ్లోకాన్ని గమనించండి.*

*"యజ్ఞాల లక్ష్యం లేక అందులోని మిళితాల సంరక్షణకై బ్రాహ్మణులు జింకల్ని, పక్షుల్ని చంపాలి. ఎందుకంటే పూర్వం ఆగస్త్య ముని అలా చేశారు." (5-22)*

*"పూర్వం రుషులు, బ్రాహ్మణులు, క్షత్రియులు చేసిన యజ్ఞాలలో తినడానికి అర్హమైన పశువు, పక్షుల మాంసం హోవ్యంగా (అనగా హవనంతో దేవతల కోసం అగ్నితో విడువబడే పదార్థాలు)గా ఉపయోగించబడ్డాయి." (5-23)*

ప్రపంచంలోని అన్ని జాతుల్లో, వారు సభ్యత కలిగినవారుగాని, అనాగరికులైనా గాని ప్రపంచంలోని అన్ని ధర్మాల అనుయాయుల్లో మాంసాహారం తీసుకునే అలవాటున్నది. స్వయంగా భారతదేశంలో ఒక చిన్న వర్గాన్ని వదిలి, జాతి మొత్తం మాంసాన్ని, చేపల్ని భుజిస్తుంది. దేవీ దేవతలపై గేదెల్ని, మేకల్ని బలివ్వటం, మాంసం, చేపల్ని భుజిస్తూనే ఇస్లాంపై 'హింసా' నేరాన్ని మోపటమూ జరుగుతుంది. ఇదెక్కడి విడ్డూరమండీ!! ఇస్లామీయ ధర్మం ఒకే జాతి లేక ఒకే దేశానికి చెందిన ధర్మం కాదు. సర్వ విశ్వానికి సంబంధించిన ఈశ్వర ధర్మం. ప్రపంచంలోని అనేక దేశాల ప్రజల ముఖ్య ఆహారం మాంసం లేక చేపలే. లేక రెండూను. అటువంటప్పుడు ఒక విశ్వవ్యాపిత ధర్మమయిన ఇస్లాం, మాంసాహారాన్ని ఎలా నిషేధించగలుగుతుంది?

---

*'మంత్రాల ద్వారా పవిత్రం చేయబడిన మాంసాన్ని భుజించాలి. బ్రాహ్మణులెప్పుడైనా మాంసం తినాలని కోరిక కలిగితే వారు యజ్ఞంలో నియమాన్ని అనుసరించి పవిత్రం చేసి తినాలి." (5-27, 28)*

*'శ్రాద్ధానికి, లేక మధుపర్కం కోసం నియమానుసారంగా తయారు చేయబడిన మాంసాన్ని ఎవరైతే తినడో అతను చచ్చిన తరువాత ఇరువై ఒక్క జన్మల వరకు జంతువుల యోనిలో జననమెత్తుతాడు. బ్రాహ్మణుడు ఎప్పుడూ కూడా మంత్రాల ద్వారా సంస్కారం కాని జంతువుల మాంసం తినకూడదు, సనాతన చట్టాల్ని అనుసరిస్తూ మంత్రాలద్వారా సంస్కరింపబడిన పశువుల మాంసాన్ని (మాత్రమే) తినాలి." (మనుస్మృతి : 5-35, 36)*

*'గీతా ప్రవచనంలో' సంత్ వినోభాజీ గారు ఇలా రాశారు :*

*'భవభూతి ఉత్తర రామచరితములో ఒక సంఘటన ప్రస్తావించబడింది. (ఒకసారి) వాల్మీకి ఆశ్రమానికి వశిష్ట రుషి వచ్చారు. ఆయన గౌరవార్థం ఒక చిన్న ఆవు దూడను వధించారు. ఒక చిన్నబ్బాయి, పెద్దబ్బాయితో ఇలా అంటాడు : 'నేడు మన ఆశ్రమానికి ఒక గడ్డపాయనవచ్చాడు. అతను మా లేగను చంపేశాడు'. దానికి సమాధానంగా పెద్దబ్బాయి ఇలా అంటాడు : 'అరెరె! ఆయన వశిష్ఠ రుషిరా! అలా వాగకు.' (గీతా ప్రవచనం : అధ్యాయం- 7, పేజీ 256)*

## 20. ఇస్లామీయ ప్రభుత్వానికి సంబంధించిన ప్రశ్న

సామాన్యంగా రామరాజ్యం, విక్రమాదిత్యుని, అశోకుని లాంటి ఆదర్శ ప్రభుత్వాలను ఇస్లాం స్థాపించలేదని భావించబడుతోంది. కాని వాస్తవం అలా కాదు.[41]

రామరాజ్యపు మూలం చారిత్రాత్మకమైనది కాదు. ఊహలపై ఆధార పడినది, పౌరాణికమైనది. అంతేకాకుండా సీతామాతను దేశం నుంచి

---

*41. ఇస్లామీయ ప్రభుత్వం వాస్తవికత ఏమిటో సామాన్య ప్రజలు ఎరుగరు. ఇస్లామీయ ప్రభుత్వ భావన అత్యంత మహోన్నతమైన భావన. సర్వవిశ్వం, ఈ ప్రపంచం దేవునికి చెందినదే. ఆయనే దీనికి యజమాని, పరిపాలకుడు. ఈ ప్రపంచంలో మనిషి కేవలం ఆయన తరఫున ప్రతినిధి, ఉత్తరాధికారి లేక గవర్నరు. అతను తన ఇష్టం వచ్చినట్లు ప్రభుత్వం నడవడానికి అధికారం లేదు. దైవం ప్రసాదించిన చట్టాన్ని అనుసరించి రాజ్యాన్ని నడపటం అతని విధి, బాధ్యత. ఈ నియమాన్ని, ఈ పద్ధతిని అనుసరించని ఏ ప్రభుత్వం అయినా, దాని అధినేత ముస్లిమే అయినప్పటికీ అది ఇస్లామీయ ప్రభుత్వం కాజాలదు. భారతదేశంలో ముస్లింలు ఏర్పాటు చేసిన ప్రభుత్వాలు, సంపూర్ణ ఇస్లామీయ ప్రభుత్వాలు కావు. ఇస్లామీయ ప్రభుత్వ శాసనం 'దివ్యఖుర్ఆన్'. దైవప్రవక్త ముహమ్మద్ (స) ఏర్పాటు చేసిన ప్రభుత్వం, అది ప్రామాణికమైన ఇస్లామీ ప్రభుత్వం. ఇక హజ్రత్ అబూబకర్, ఉమర్, ఉస్మాన్, అలీ(రజిఅన్హుమ్) అనే ఈ నలుగురు దైవప్రవక్త ప్రతినిధులు (ఖలీఫాలు) నిజమైన, ఆదర్శనీయమైన పరిపాలకులు. ఈ పరిపాలకులు యదార్థ రూపంలో దైవదాసులుగా రాజరికంలో ఫకీరులుగా (పేదవారుగా) గడపడం వారి సంప్రదాయం. ఇక ఫకీరుగా ఉండి ప్రభుత్వ వ్యవహారాలు నడపటం వారి గౌరవోన్నతల్లోని ప్రత్యేకత. వారు ప్రజల బాగోగులు ఎంతగా విచారించేవారు, ఎంత న్యాయశీలురు, ఎంత నిస్వార్థ పరులు, నిరపేక్షాపరులు, ఎంత నిరాడంబర మైన జీవితం గడిపేవారంటే- మనం చరిత్రను ఎంత గాలించినా వారికి సాటి అనేవారే లభించరు. వాస్తవాన్ని అంగీకరించేవాడు, నిష్పక్షపాతి అయిన ఏ మనిషైనా సరే, ఆనాటి ఇస్లామీయ ప్రభుత్వ చరిత్రను అధ్యయనం చేస్తే ఆదర్శ నీయమైన ప్రభుత్వాలు అసలు ఇస్లాం ద్వారానే స్థాపితమయి ఉన్నాయనే నిజాన్ని అంగీకరించకుండా ఉండలేడు.*

బహిష్కరించడం, బ్రాహ్మణవాదాన్ని సమర్థించేదిగా ఉన్నందున ఆధునిక కాలంలో అది విమర్శలనెదుర్కుంటోంది. దక్షిణ భారతదేశంలో స్వయంగా హిందువులే తులసిదాస్ రామాయణం పట్ల గౌరవ మర్యాదల్ని పాటించక పోవడం చూస్తున్నదే. ఇక అశోక చక్రవర్తి ధర్మరాజ్యానికి సంబంధించినంత వరకు, అది కూడా బౌద్ధధర్మానికి పూర్తిగా ప్రభావితమైందే. అశోక చక్రవర్తి బ్రతికి ఉన్నంతకాలం ఆ ప్రభుత్వం నడువగలిగింది. ఆ తరువాత అది వెంటనే సమాప్తమైపోయింది. ఇంకా ఇది భారతీయ జాతిని అత్యంత బలహీనపరి చింది. అశోకుని తరువాత అనేక శతాబ్దాల భారత చరిత్ర చీకట్లోనే ఉంది. (అంటే ఈ మధ్యకాలపు ప్రామాణికమైన చరిత్రే లేదు) బౌద్ధ ధర్మం ఆదర్శనీయ మైన, పటిష్టమైన రాజ్యం కోసం కాకుండా తన విస్తరణాకాంక్ష పాలసీ కొరకు ప్రఖ్యాతిగాంచింది. డాక్టర్ భండార్కర్, అశోకుని చరిత్రను తీవ్రంగా విమర్శిం చారు. ఇక విక్రమాదిత్యుని కాలం నిజంగానే స్వర్ణయుగం. అయితే ఇది విశ్వవ్యాపితమయింది కాదు. భారతదేశంలో ఆ కాలంలో హిందువులే ఆధిక్యత వహించి ఉన్నారు. ఈ దృష్టి కోణంతో చూసినప్పుడు షేర్షా, అక్బర్, జహంగీర్, షాజహాన్ కాలం నాటి చారిత్రక స్వర్ణయుగం అంతకన్నా ప్రభావపూర్వకమైనది, ప్రశంసించదగినది కూడాను. ఎందుకంటే వీరి రాజ్యాలు సువిశాలంగా, హిందువులు అత్యధిక సంఖ్యలో ఉండి కూడా పరిపాలకులు అల్పసంఖ్యాక వర్గానికి చెందినవారై ఉన్నారు. వారి ధార్మిక ఉదారత్వం, వారి పరిపాలనా కాలంలోని అభివృద్ధి, కలిమి, విక్రమాదిత్యుని కాలం కన్నా అధిక ప్రభావిత మైందిగా ఉండేది. అంతర్జాతీయ దృష్టి కోణంతో చూస్తే దైవప్రవక్త ముహమ్మద్ (స) ప్రతినిధులైన మొదటి నలుగురు ఖలీఫాల నిరాడంబరతకు చరిత్రలోనే సాటిలేదు. ఆ తరువాత వచ్చిన ఖలీఫా హారూన్ రషీద్ కాలం నాటి మహో గొప్ప,అత్యున్నతమైన ప్రభుత్వం చరిత్రలోనే కానరాదు. అంత దూరమెందుకు? ప్రస్తుత కాలంలో విపరీతంగా పెరిగిపోతున్న ధరలు, మత విద్వేషాలు,

ప్రభుత్వంలోని ఉన్నత వర్గాల్లో చొచ్చుకుపోయి చికిత్సకు అవకాశమే లేకుండా ముదిరిపోయిన అక్రమ సంపాదన (కరప్షన్)లపై దృష్టిని సారించండి. ఈ రంగాల్నే దృష్టిలో పెట్టుకుని, ధరలపై నియంత్రణ కోసం అల్లావుద్దీన్ ఖిల్జీ, ధార్మిక సహనత్వంలో షేర్‌షా సూరి, వ్యక్తిగతమైన సచ్ఛీలత, నైర్మల్యాలు కలిగి కష్టపడి సంపాదించి జీవించిన మహోన్నత పరిపాలకునిగా ఔరంగజేబు- వెంటనే జ్ఞాపకానికి వచ్చేస్తారు.

## 21. ముస్లింలపై వేర్పాటువాదపు నిందారోపణ

ముస్లింలు వేర్పాటువాదపు ధోరణి కలిగి ఉంటారని వారిని నిందించటం జరుగుతోంది. నీగ్రోలు, మంగోలులు మున్నగు ఎన్నో జాతులు భారతదేశానికి వచ్చి ఇక్కడి హిందువులతో కలిసిపోయారని, కాని ఒక్క ముస్లింలే నేటికినీ తమ ప్రత్యేక ఉనికినే కలిగి ఉంటున్నారని చెప్పడం జరుగుతుంది.

ముస్లింలపై ఇలాంటి నిందారోపణలు చేసేవారు దీనికి కారణాలేమిటనే దానిపై ఆలోచించరు. ముస్లింలకు పూర్వం భారతదేశానికి వచ్చిన అన్ని జాతుల వద్ద హిందువుల లాంటి ధర్మంగాని, కళలు గాని, సంస్కృతి గాని లేకుండేది. అందుకని వారు హిందువుల్లో కలిసిపోయారు. కాని దీని పర్యవసానం ఎలా బయల్పడింది? హిందూధర్మం కలుషితమైపోయింది. ప్రస్తుత హిందూ ధర్మం, ప్రాచీన వైదిక ధర్మం కాదు. ఇది అనేక ధర్మాల కలయికతో కలగాపులగమైన ఒక మిశ్రిత ధర్మంగా మారిపోయింది.

ఇతర జాతులకు భిన్నంగా, ముస్లింలు ఒక మహోన్నత ధర్మాన్ని, ఒక మహోన్నతమైన ధార్మిక గ్రంథం ఖుర్‌ఆన్‌ను, ఒక మహోన్నత ధార్మిక మార్గదర్శి అయిన హజ్రత్ ముహమ్మద్(స) గారి లాంటి సాటిలేని స్వభావం, జీవిత చరిత్రను, ఒక మహోన్నతమైన ఉజ్వల చరిత్రతో భారతదేశానికి

వచ్చారు. వారి మూల వచనం– లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్ రసూలుల్లాహ్' అంటే – అల్లాహ్ తప్ప వేరెవ్వరూ ఆరాధ్యుడు కాడు, ముహమ్మద్(స) దైవప్రవక్త అని వారి శిరస్సు ఒక్క దైవం ముందు తప్ప వేరెవ్వరి ముందు వంగదని వారు గర్వపడేవారు. ఇక్కడ (భారతదేశంలో) అసంఖ్యాక విగ్రహాలయాలుండేవి. అందులో కాల్పనిక, ఊహాజనిత దేవీ దేవతల ఆరాధనా, అర్చన, పూజా పునస్కారాలు జరుగుతుండేవి. పశువులు, పక్షులు సైతం ఆరాధించబడేవి. ఇక్కడి ప్రజలు అవతారాల్ని విశ్వసించేవారు. అక్కడ (అంటే ముస్లింలలో) ముహమ్మద్(స) సైతం దేవుని ఆరాధకుడు, దాసుడు, దైవం చివరి ప్రవక్త మాత్రమే. ఇక్కడ బ్రాహ్మణ వాదముండేది. పవిత్రత, అపవిత్రతకు సంబంధించిన తప్పుడుభావన ఉండేది. నిమ్నోన్నతా భావం ఉండేది. ముస్లింలలో ఈ బేధభావాలు ఉండేవి కావు. దానికి భిన్నంగా వారందరూ పరస్పరం సమానులుగా గుర్తింపబడేవారు.

ముస్లింలు తమ ధర్మం, సంస్కృతి, భాష మున్నగు వాటిని సురక్షితంగా ఉంచుకోవాలని ప్రయత్నం చేస్తుంటే వారిపై విదేశీయులు అనే నింద మోపబడు తోంది. మరి మన హిందువుల స్వంత పరిస్థితి ఏమిటి? అందరూ హిందువులే అయినప్పుడు వారి భాషలు వేర్వేరుగా ఎందుకున్నాయి? భాషా ప్రాతిపదికగా రాష్ట్రాలు ఎందుకు ఏర్పడ్డాయి? దక్షిణ భారతదేశ హిందువులైతే హిందీ భాషను సైతం వ్యతిరేకిస్తారు. ఇక సిక్కులు తమ ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతున్నారు. కశ్మీరంలో ముస్లింలు అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. జమ్ముకు చెందిన హిందువులు దీన్ని సహించలేకపోతున్నారు. జమ్మూను హిమాచల్ ప్రదేశ్‌లో కలుపాలని కోరుకుంటున్నారు. అన్ని రాష్ట్రాలు కూడా కేంద్రం నుంచి అత్యధిక అధికారాలు అంటే అధిక స్వాతంత్ర్యం కావాలని డిమాండ్ చేస్తున్నాయి. కాని వేర్పాటువాదులుగా, విదేశీయులుగా ఒక్క ముస్లింలనే చిత్రించటం జరుగు తున్నది. ఇదెక్కడి న్యాయం? కొన్ని ప్రత్యేక విషయాలను మినహాయిస్తే

ముస్లింలు ఏ జాతీయ పద్ధతులు, ఆచార వ్యవహారాలకు దూరంగా ఉంటు న్నారు? పోలీసులోగాని, పిఎసిలోగాని లేక ఇతర ప్రభుత్వ శాఖల్లోగాని, వారి జనాభా నిష్పత్తి ప్రకారం స్థానమివ్వడం జరగలేదు. గడిచిన అరవై సంవత్స రాలు (అనగా స్వాతంత్రం వచ్చినప్పటి) నుంచి వారి పట్ల అన్యాయమే జరుగుతూ వచ్చింది.

## 22. ముస్లింలు విదేశీయులనే ముద్ర

**ముస్లింల దృష్టి కోణం, ఆలోచనా విధానం దేశ ప్రయోజనాలకు అనుస రించి ఉండదని, వారు అరబ్బు, ఇతర ముస్లిం దేశాల పట్ల అభిమానం కలిగి ఉంటారని చెప్పడం జరుగుతుంది.**

ఇలాంటి ఆలోచన అత్యంత నిరాధారమైనది. బహుశా ఇంతకుమించి హేయమైన భావన ఇంకొకటి లేదనుకుంటాము. అంతేకాదు, ఇంతకుమించిన బుద్ధిమాలిన, అసందర్భ ప్రలాపం వేరొకటి ఉండబోదని అంటే అది అత్యంత సమంజసమైనదే.

చరిత్ర ఈ భావనకు పూర్తి విరుద్ధంగా ఉంది. భారతదేశంలో ముస్లింల అధికారం క్రీ.శ. 712 నుంచి 1857 వరకు నడిచింది. ఈ మధ్యకాలంలో వారు భారతదేశం కోసమే జీవించారు, దేశం కోసమే మరణించారు. దేశ ప్రయోజనాలను పట్టించుకోకుండా వారు వేయి సంవత్సరాల వరకు ఈ దేశంలో ఉండటమేకాదు, పరిపాలన కూడా సాగించారంటే ఏ మాత్రం ఇంగిత జ్ఞానం గల వ్యక్తి అయినా సరే, ఈ వాదనను అంగీకరించడు. ఒకవేళ ఈ ముస్లింలే గనుక దేశ వ్యతిరేకులే అయివుంటే, అత్యధిక సంఖ్యలో ఉన్న హిందువులు సామూహికంగా వారికి వ్యతిరేకంగా తిరుగుబాటును లేపేవారు. కాని వేయి సంవత్సరాల ఈ సుదీర్ఘ వ్యవధిలో ఎప్పుడూ అలా జరిగి ఉండలేదు. ప్రారంభ దశను విడిచిపెట్టి- అంటే, ముస్లింలు ఇక్కడ స్థిర నివాసమేర్పరచుకోక

పూర్వపు దశను మినహాయించి– హిందువులంతా ఒక వైపుండి, ముస్లింలంతా వేరొక పక్షంగా పోరాడిన యుద్ధం ఒక్కటంటే ఒక్కటి కూడా ఈ పది శతాబ్దాల చరిత్రలో మనకు కనిపించదు. దీనికి భిన్నంగా హిందువులకు రక్షకులుగా భావించబడే రాజపుత్రుల జాతి ముస్లిం పరిపాలనకు మూలస్తంభంగా నిలబడి ఉండేది. కాబుల్‌పై మొగలు సేనాని, రాజామాన్‌సింగ్ ద్వారా ప్రాప్తమైన విజయాన్ని భారతదేశ విజయంగానే భావించడం జరిగింది. శివాజీ సైన్యంలో కూడా ముస్లింలున్నారు. చివరికి ఔరంగజేబు సర్వసైన్యాలకు కమాండర్ ఇన్ చీఫ్‌గా ఉండిన రాజాజైసింగ్ హిందువే కదా! హిందుజాతి, ముస్లింల పరిపాలనను విదేశీ పరిపాలనగా ఎప్పుడూ భావించలేదనేది చరిత్ర నిరూపి స్తున్నది. దీనికి బదులుగా 1857లో పాలకవర్గం బలహీనపడిపోయిన తరువాత హిందువులు, ముస్లింలు ఉభయులూ కలిసి ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తమ తరహాలో నిరంతరం పోరాటం సాగించారు. క్రీ.శ. 1857లో మొగలు పాలకుడు 'బహదూర్‌షా జఫర్' సారధ్యంలో జరిగిన ప్రథమ స్వాతంత్ర సమరంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడటానికి మొగలు పాలకుని నాయకత్వానికి హిందువులంతా ఏకగ్రీవంగాను, సంతోషంగాను అంగీకరించారు. క్లుప్తంగా చెప్పాలంటే ప్రథమ స్వాతంత్ర సమరంలో ముస్లింలు హిందువులతో సమానంగా పాలుపంచుకున్నారు.

క్రీ.శ. 1920–21లో ముస్లింలు ఖిలాఫత్ ఉద్యమాన్ని, కాంగ్రెస్‌లో విలీనం చేసిన తరువాతనే కాంగ్రెస్ పార్టీ బలం పుంజుకున్నది. క్రీ.శ. 1916లో జిన్నాహ్ ప్రభావం ఫలితంగా సంపూర్ణ స్వాతంత్రం కోసం, కాంగ్రెస్‌తో ఒప్పందం జరిగింది. భారతదేశానికి స్వాతంత్రం వచ్చేంతవరకు కూడా సంపూ ర్ణంగా ముస్లింలతో కూడిన వాయవ్య సరిహద్దు రాష్ట్రం, ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ నాయకత్వంలో కాంగ్రెస్‌తోనే ముడివడి ఉండేది. నేతాజీ సుభాష్ చంద్రబోస్ రూపొందించిన 'ఆజాద్ హింద్ ఫౌజ్'లో ముస్లింల పాత్ర

సాటిలేనిది. ఇక విప్లవ వాదుల్లో మేజర్ అష్ఫాఖుల్లాఖాన్ వ్యక్తిత్వం మరువ రానిది. మౌలానా అబుల్ కలాం ఆజాద్ పేరు లేకుండా కాంగ్రెస్ గురించి ఊహించనైనా లేము. పాకిస్తాన్ స్వతంత్ర రాజ్యంగా ఏర్పడింది నిజమే. కాని దాని స్థాపకుడైన మిస్టర్ జిన్నా కూడా జాతీయవాదే. క్రీ.శ. 1937లో ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వమంత్రివర్గంలో, రెండు స్థానాలు ముస్లిం లీగ్‌కు ఇస్తామని కాంగ్రెస్ పార్టీ వాగ్దానం చేసింది. కాని తీరా ఎన్నికల్లో విజయం సాధించిన గర్వంతో కాంగ్రెస్‌పార్టీ వాగ్దానోల్లంఘనం చేసింది. మంత్రివర్గంలో చేరదలిచిన ఇద్దరు ముస్లిం లీగ్ సభ్యులు (ముస్లిం లీగ్‌కు రాజీనామా చేసి) తమ కాంగ్రెస్ పార్టీలో చేరిపోవాలనే షరతు విధించింది. ఇది జిన్నాహ్‌కు అత్యంత అవమాన కరమైన షరతు. పాకిస్తాన్ ఏర్పాటు చేసిన బాధ్యత కేవలం ముస్లిం నాయకులదే కాదు, దీనికి బదులుగా కాంగ్రెస్‌కు చెందిన హిందూ నాయకుల తెలివిహీనత, దూరదృష్టి రాహిత్యం, గర్వం, పోకిరితనం కూడా దీనికి సమాన బాధ్యత వహిస్తుంది. బేరసారాలకు, మోసానికి కూడా ఒక హద్దంటూ ఉంటుంది. వాస్తవం చెప్పాలంటే పాకిస్తాన్ ఏర్పాటు హిందువుల ద్వారా గాని, ముస్లింల ద్వారా గాని జరగనే లేదు. దానికి బదులు దూరాలోచన, దూరదృష్టి లేని రాజకీయ నేతల (వారు హిందూ నేతలైనా, ముస్లిం నేతలైనా) ద్వారా మాత్రమే జరిగింది. ఇంకాస్త ముందుకెళ్ళి చెప్పాలంటే, ఇందులో కాంగ్రెస్ పాత్ర అధికంగా ఉంది. కాంగ్రెస్ పార్టీ ఒకవైపేమో భారతీయులందరికీ ప్రాతినిధ్యం వహిస్తానని వాదించేది. వేరొక వైపు అది హిందువులకు ప్రత్యేకంగా (వేరుగా) ప్రాతినిధ్యం వహిస్తానని చెప్పుకొచ్చేది.

అందుకని జరగవలసిందేదో జరిగిపోయింది. పాకిస్తాన్‌తో రెండు యుద్ధాలు జరిగాయి. కాని భారతీయ ముస్లింలు పాకిస్తాన్‌ను సమర్థించారా? అబ్దుల్ హమీద్ చేసిన త్యాగం చారిత్రాత్మకమైన త్యాగం కాదా? కాశ్మీర్‌ను భారత్‌లో చేర్చిన కీర్తి, ఘనత, కశ్మీర్ ముస్లింలకు దక్కదా? ఇక్బాల్ కంటే

మనోహరమైన, 'జాతీయ గీతాన్ని' (సారె జహాఁసె అచ్ఛా....) ఎవరు రాశారు? ఒకవేళ మలిక్ ముహమ్మద్ జాయిసి, రస్ఖాన్, కబీర్, అబ్దుర్రహీం ఖానె ఖానా, ఖుతుబున్ షేక్, మహెూన్న తుడు, హిందీ భాషా వ్యవస్థాపకుడు అయిన అమీర్ ఖుస్రోను, హిందీ సాహిత్యం నుండి తొలగిస్తే హిందీ విలువెంతుంటుంది? స్వాతంత్ర భారతంలో ముస్లింలు ఎప్పుడైనా, హిందీని వ్యతిరేకించారా? దీనికి విరుద్ధంగా ఎప్పుడైతే దక్షిణ భారత హిందువులంతా ఏకమై హిందీని వ్యతిరేకిస్తుంటే షేక్అబ్దుల్లా హిందీని సమర్థిస్తూ గళమెత్తి గర్జించాడు. దీనికి భిన్నంగా స్వతంత్ర భారతంలో ఉర్దూకు రెండవ (ప్రభుత్వ) భాషగా గుర్తింపు ఇవ్వాలనే ముస్లింల సముచితమైన న్యాయప్రదమైన కోరికను నేటివరకు కూడా ఖాతరు చేయలేదు. మక్కా మదీనాలు ముస్లింల ధార్మిక పవిత్ర స్థలాలు. వాటిపట్ల ముస్లింలు భక్తి విశ్వా సాలు కలిగివుంటే అందులో ఆక్షేపించవలసిందేముంది? ఇంగ్లాండ్కు చెందిన ఒక ఆంగ్లేయుడు, జెరూసలేం పట్ల ప్రేమ విశ్వాసాలు కలిగివుంటే ఇంగ్లాండ్ కొరకు అతను 'దేశ వ్యతిరేకి'గా భావించబడతాడా? బర్మాకు చెందిన ఒక బౌద్ధుడు భారత దేశంలోని 'సారనాథ్' పట్ల భక్తి విశ్వాసాలు కలిగివుంటే అతను బర్మా దేశం పట్ల దేశద్రోహిగా పరిగణించబడతాడా? స్వతంత్ర నేపాల్కు చెందిన హిందువు 'కాశీ' పట్ల భక్తివిశ్వాసాలు కలిగి ఉండడా? ముస్లింలు 'దేశ వ్యతిరేకులు' అరబ్ మరియు ఇతర ముస్లిం దేశాల పట్ల అభిమానం కలిగి ఉంటారని హిందువులు ముస్లింలపై నిందారోపణ చేయటంలో దాగివున్న అసలు విషయం ఏమిటంటే, భారత దేశంలో తప్ప ఇతర దేశాల్లో వారికి (హిందువు లకు) సంబంధించిన పుణ్య క్షేత్రాలు, పవిత్ర స్థలాలు లేకపోవటమే, ఒక్క నేపాల్లో తప్ప. అయితే స్వతంత్ర భారతదేశానికి, ఆ ఒక్క దేశంతో కూడా ఏమంత సత్సంబంధాలులేవు.

(సమాప్తం)